# హేమశిల్పి



presented
by
M. Rama Mohan Reddy

విద్వాన్:
దేవరకొండ చిన్నికృష్ణశర్మ

ట్రేడ్స్‌మన్ పబ్లికేషన్సు
విజయవాడ-2.

# తొలిపలుకు

ఈనాడు తెలుగు సాహిత్యంలో నవలకున్నంత ఆదరణ మరి దేనికీ లేదు. ఇందుకు కారణం ఇది ఏ కొంచెం భాషా జ్ఞానం ఉన్నవారైనా... చదివి అర్థంచేసుకొనడానికి తగిన స్థాయిలో ఉండడమే. నాటకం, కథా మొదలయిన సాహిత్య ప్రక్రియలుకూడా సర్వజనగ్రాహ్యమైన వ్యావహారికాన్నే ఆశ్రయించి వున్నాయి. అయినా నవలలో ఉండే కథా కథన సౌలభ్యం నాటకంలోఉండకపోవడమూ, నవలవల్ల కలిగేవిస్తృతానుభూతి కథలవల్లకలగకపోవడమూ నవల ఆ రెంటి కంటె ప్రాచుర్యం పొందటానికి ముఖ్య కారణాలు. నవలకు కల ఈ విశిష్టతను గమనించే ఎందరో ఆధునిక మహా రచయితలు ఈ ప్రక్రియను తమ రచనలచేత పరిపుష్టంచేస్తున్నారు. వారిమార్గాన్ని అనుసరించి నేనున్నూ ఈ రూపాన కూడా సాహిత్యసేవ చెయ్యాలనే కుతూహలంతో చేసిన రచనలలో ఇది ఒకటి.

అయితే ఈ రచనను గురించి ఒకింత చెప్పవలసింది ఉంది. ఇతరభాషల నుంచి మనం ఎన్నో నవలలు అనుసరించుకొంటున్నాం. కాని మాటల్లోనే తప్ప ఇతివృత్తంలో తెలుగుదనం లేకపోవడం వల్ల ఆ అనువాదాలు తెలుగు డెందాన్ని హత్తుకోలేకపోతున్నాయని నేను అభిప్రాయపడు

తున్నాను. ఆ అభిప్రాయంచేత వైదేశిక మహారచయితల రచనల్ని తెలుగు జాతి అభిరుచులకు తగిన విధంగా మలిచి చూపాలని యత్నిస్తున్నాను. ఆ ప్రయత్న ఫలమే యీ 'హేమశిల్పి'. George Elliot ఆంగ్లంలో రచించిన 'Silas Mariner' అనే నవల ప్రసన్న కథాకలితార్థ యుక్తితో అర్థగౌరవం కూడా సమ్మిళితమైన మౌలిక రచన. రచయిత యిందులో చూపిన ఉదాత్తతకు సహృదయులు ముగ్ధులు కాక మానరు. ఆ కళాతపస్వి చూపిన త్రోవలో నడిపించాను యితివృత్తాన్ని. కాబట్టి యీ తెలుగు నవలలో ఏవైనా లోపాలుంటే నావేకాని ఆ మహారచయితవి కావని మనవి చేస్తూ యీ కొత్త అంటు మొక్కకు ఆంధ్ర సాహిత్యోద్యానంలో గల స్థానాన్ని నిర్ణయించే బాధ్యత విజ్ఞులకు వదలి పెడుతున్నాను.

— రచయిత.

# హేమశిల్పి

"ఆశా! ఆశా!"

శైవమఠంనుంచి అప్పుడే బయటికి వచ్చిన ఆశ ఈ పిలుపువిని కుడివైపుకుతిరిగి చూచింది. మఱ్ఱిచెట్టుక్రింద నిలబడి చిరునవ్వు చిందించే శైలేంద్రుడు కనిపించాడు. ఆమె పెదవులమీద కూడా మందహాసం తొలకరించింది.

"మీరు ఎంతసేపటనుంచీ యిక్కడ వున్నారు?"

"అది నేను చెప్పలేను ఆశా! స్వామివారు పురాణం చెప్తూ ఉండగానే ఇలావచ్చాను."

"అయ్యో! ఎంతపని చేశారు."

"అలా అంటున్నావేం ఆశా!"

"మరి మీరు చేసిందేమైనా బాగుందా చెప్పండి! గురువులు చెప్పేది సాంతం వినకుండా లేచిరావడం అపచారం కాదూ!"

"ఇవన్నీ నేను ఎన్నిసార్లో విన్నవి, ఇంకా వినేవి కూడా గదా! ఎప్పుడో వినేవాళ్ళ విషయంలో అయితే_"

"పోనివ్వండి! మీరు ఇక్కడ ఎందుకు నిలబడ్డట్టు?"

"ఆ కారణం నా నోటిమీదుగా వింటే నీకు ఎక్కువ సంతోషంగా ఉంటుందికదూ!"

"అంటే మీరు ఎందుకు ఇక్కడ నిలబడి ఉన్నదీ నాకు తెలుసుననేగా మీ భావం?"

"అది నీ మనస్సునే అడిగి తెలుసుకో ఆశా!"

ఆశ నవ్వింది. ఎలా నవ్విందని! నవ్విందని శైలేంద్రుడు గ్రహించేటట్టు నవ్వింది. ఆమె యెఱ్ఱని పెదవులు ముద్దుగా ముడుచుకున్నాయి. సోగ కన్నులు సొంపుగా వెలుగులు విరజిమ్మాయి. చెక్కిళ్ళమీద కుంకుమవన్నె పొటమరించింది.

శైలేంద్రుడు ఆ కొంచెపు నవ్వుకే కొండ కక్కిపోయాడు. 'అలా వెడదాం రా ఆశా!' అన్నాడతను ఉత్సాహంతో. మునిపండ్లతో అధరం అదుముకొంటూ, చిలిపి చూపులతో అతనిని వెంబడించింది హంసయాన ఆశ.

ఆమె తనవెంట రావడమే వరంగా భావించుకొంటున్న శైలేంద్రుడు నాలుగడుగులు వేసిన తర్వాత ఇలా అన్నాడు.

"స్త్రీలు పైకి ఉన్నంత సుకుమారంగా మనస్సులో ఉండలేరా ఆశా!"

"అంటే?"

"అంటేనా? ఏమున్నది? ఏమీ లేదు. వారి శరీరం ఎంత మృదువో మనస్సు అంత కఠినంగా ఉంటుందేమోనని."

"మీరు పొరబడుతున్నారంటే కోపం తెచ్చుకోరు గదా!"

"ఈరోజున మన యిద్దరి మధ్యనూ ఉండే అభిప్రాయభేదాలన్నీ వెల్లడించుకొని, సందేహాలు తీర్చుకొని, ఏకాభిప్రాయానికి రావాలని నిశ్చయించుకొన్నాను. నీకు నా

విషయమై ఎల్లాటి సందేహాలున్నా నిర్భయంగా వెల్లడించు. అందుకు నేను కోపగించుకోను సరిగదా, చాలా సంతో షిస్తాను."

"............"

"మాట్లాడవేం ఆశా!"

ఇలా అని అతను నడక ఆపి, వెనకకు తిరిగి ఆమె ముఖంవైపు చూచాడు. తలవంచుకొని నడుస్తున్న ఆశ అతను ఆగిపోవడం గమనించలేక, తల అతని రొమ్ముకు తగలగా ఉలిక్కిపడి వెనుకంజవేసి, 'అబ్బ! ఏమిటది?' అన్నది సిగ్గుతో. కుంచించుకునిపోయిన ఆమె ముఖం అతనికి ఇంకా ఆకర్షణీయంగా కనిపించింది. శరీరం రోమాంచితమైంది.

"క్షమించు ఆశా! నువ్వు నా మాటకు వెంటనే జవాబు యివ్వకపోవడంవల్ల, నీ ఆలోచన యేమిటో ముఖం చూచి ఊహించాలని వెనుకకు తిరిగాను. ఇంతలో నువ్వు వచ్చి ఢీ కొట్టావు"

ఆశ యిందుకు మధురంగా మందహాసం చేసింది.

"అయితే తప్పు నాదే. మరి నేను మిమ్మల్ని క్షమించటం ఏమిటి? మీరే నన్ను క్షమించాలి."

"క్షమించటం అంత సులభం కాదుసుమా! ఈ ఢీ కొట్టడం నా వల్లనే జరిగితే నువ్వు శాంతంగా ఉండేదానివేనా?"

"పొరబాటు ఎవరికైనా వస్తుంది. దానికేం చెయ్యగలం?"

"అది నిజమే అనుకో! అయినా పురుషుడి పొరబాటును స్త్రీ యెన్నటికీ మన్నించదు. కావాలనే అతను తనను అవమానించాడని భావిస్తుంది."

"అది ఆ పురుషుడి గుణాన్నిబట్టి ఉంటుంది. మీరల్లాంటివారు కారుగా!"

"నామీద నీకింత సదభిప్రాయం ఉన్నదా ఆశా!"

"ఒక్క నాకే కాదు. ఈ ఊళ్ళోవున్న యువతులందరికీ మీమీద సదభిప్రాయమే."

శైలేంద్రుడి ముఖం ఆనందంతో వికసించింది.

"నిజం!"

"ముమ్మాటికీ నిజమేనండీ!"

"అలాగయితే నువ్వు నా కింతవరకు సరిఅయిన సమాధానం ఎందుకు ఇవ్వలేదు?"

"నన్ను ఏమని చెప్పవలసిందంటారు మీరు?"

"అది నేనా చెప్పేది! బాగుంది."

"మరి మీకు ఎల్లాంటి సమాధానం కావాలో నాకేం తెలుస్తుందండీ!"

"ఆశా! ఇప్పటికి ఆరునెలలనుంచీ నీతో మాట్లాడుతున్నాను. నా కష్టసుఖాలు చెప్పుకొంటున్నాను. నువ్వూ నీ మంచి చెడ్డలు వినిపిస్తూనేవున్నావు. నువ్వు ఇంతసుకుమారివై ఆయింటా ఆయింటా ఊడిగంచేస్తూ జీవిస్తున్నావంటే నా మనస్సు ఎంత క్షోభపడుతున్నదో! ఆ విషయం నీకు బాగా తెలుసు కూడా. నీకు ఆ కష్టం లేకుండా చెయ్యాలని నేను కోరుకొంటున్నట్టు కూడా నీకు తెలుసు. తెలిసి, తెలిసి

నన్ను ఇంకా పరాయివాణ్ని చూచినట్లే చూస్తున్నావు. దీనికి కారణం ఏమిటి?"

"కారణం ఏముంది? ఏమీ లేదుగాని ముందు నడవండి. ఎవరైనా చూస్తే బాగుండదు."

"ఎందుకు బాగుండదు! నీకూ 'నా' అనేవాళ్ళు లేరు; నాకూ అంతే. ఒకరి కొకరం తోడుగా ఉంటాం. అందుకు ఎవరో ఏదో అనుకోవలసిన పనియేమున్నది?"

"అది నిజమేగానీ నడవండి స్వామీ! మీకు పుణ్యం ఉంటుంది. 'ఈ ఆశ కెంత దురాశో! అందరాని మానిపళ్ళకు అర్రులు చాస్తోం' దంటారు"

శైలేంద్రుడికి మాటలు పరమ సంతోషం కలిగించాయి. అతను మళ్ళీ ముందుకు తిరిగి నడుస్తూ ఇలా అన్నాడు:

"ఆశా! లోకులు అలా అనుకొనేది నన్ను గురించే కాని, నిన్ను గురించి కాదు. ఎందువల్లనో చెప్పనా?"

ఆశ అతని వెనుకనే నడుస్తూ ఇలా అన్నది:

"చెప్పండి?"

"కాకి ముక్కుకు దొండపండు గట్టినట్టుగాదా, శైలేంద్రుడికి ఆశను భగవంతుడు అంటగట్టడం! ఆ పిల్ల యెక్కడ; అతనెక్కడ ? అని యెవరైనా అనుకొంటారు."

"ఊడిగం చేసుకొని బ్రతికే దానికి గొప్పయింటి బిడ్డ భర్తగా లభించడం సామాన్యమా !"

"నా గొప్పతనం ఏమిటి ? కులం మాత్రమేనా !"

"ఒక్క కులమేనా ! గుణం ! సంపాదన !"

"ఇవన్నీ నీ ఒక్క చిరునవ్వుముందు దిగదుడుపు గదూ !"

"అది మీ భ్రాంతిగానీ, మీరు కోరితే నా తల దన్నిన వాళ్ళెంతమంది రారూ ?"

"వస్తారో ! రారో ! ఆ విచారణతో నాకు నిమిత్తం లేదు. నిన్ను చూచాను అంతే. ఈ కళ్ళతో మరొక స్త్రీని చూడటం నాకు ఇష్టం లేదు. తెలిసిందా !"

ఆశ యిందుకు కొంటెగా నవ్వి యిలా అన్నది:

"తెలియలేదండీ !"

శైలేంద్రుడు విస్మయంతో వెనకకు తిరిగిచూచాడు. క్రీగంట అతనిని గమనిస్తూ నడిచే ఆశ ఈమారు ముందుకు తూలలేదు. టటాలున ఆగిపోయి నవ్వుతూ "ఈసారి అటువంటి పొరబాటుపని చెయ్యనులెండి ! 'చేస్తుందేమో, పబ్లోకమంతా నవ్వుదా' మనుకొన్నారేమో!" అన్నది.

శైలేంద్రుడు యిందుకు సిగ్గుపడ్డాడు.

"నాలో అటువంటి కొంటెతనం ఎప్పుడూ ఉండదు ఆశా !"

"అంటే ఒక్కొక్కప్పుడు ఉంటుందనేగా !"

"నీతో నేను వాదించలేను. అన్నింటికీ లేనిపోని అర్థాలు కల్పిస్తూ ఉంటావు"

అతని అమాయికత్వానికి జాలిపడింది ఆశ.

"నవ్వుతూఅనే మాటలకు అంత బాధపడిపోతా రేం? ఇలాగైతే మిమ్మల్ని కట్టుకొన్నవిడగతి ఏంకావాలి? నవ్వు

లాటలకూ నిందలకూ తేడా తెలియని భర్తగా ఎలా వేగు తుం దేవతెమాత్రం !"

"అందుకే నాతత్వం అంతా తెలిసిన..."

మిగతావాక్యం అతను పూర్తిచేయలేకపోయాడు.

"అబ్బే! లాభంలేదు స్వామీ!"

అన్న ఆశ మాటలు అతనికి కొరడా దెబ్బలలాగా తగిలాయి "ఎందుచేత ఆశా !"

అతి దీనంగాఉన్న అతని ముఖం ఆమె హృదయాన్ని కలచివేసింది. 'నడుస్తూ మాట్లాడుకొందాం పదండి!' అన్న దామె. అతను ముందుకు అడుగు వెయ్యక అలాగే నిల బడ్డాడు. ఆమె లాలనగా అతన్ని చూస్తూ "నడవండి ! ఇంతలో నేను మీకు దూరమైపోయేదిలేదు. ఇంటిదాకా వస్తానుగా!" అన్నది. శైలేంద్రుడు బరువెక్కిన గుండెతో మెల్లమెల్లగా నడక సాగించాడు.

"భర్త తనను శాసించాలనే స్త్రీ కోరుకొంటుంది. మేమేమే అనేభర్తను ఏస్త్రీకూడా మెచ్చదు. ఆ రహస్యం మీరింతవరకు తెలుసుకోలేదు. అందుకే మీరంటే నాకు కోపం."

శైలేంద్రుడు అంతవరకూ బిగపట్టిన ఊపిరి ఒక్క సారి వదలి, "ఇందుకేనా ఆశా! నాకు ఇన్నాళ్ళనుంచీనువ్వు సరిఅయిన జవాబు చెప్పకపోవడం !" అన్నాడు.

"అది కాదండీ ! అల్పురాలనైన నన్ను వివాహం చేసుకోవడంవల్ల సంఘంలో మీరు ఎన్నో చిక్కులను ఎదు ర్కోవలసివస్తుంది. మీ రేమో సుతిమెత్తనివారు, ఆ బాధ

లకు తట్టుకోలేక మీరు క్రుంగిపోవడం నేను చూడలేను. నన్నుగాక మీ అంతస్తుకు తగిన కన్యను చేపట్టితే మీరు సుఖంగా ఉండగలరు, నాకూ సంతృప్తిగా ఉంటుంది. అలా కాక నా సౌఖ్యంకోసం మీ జీవితం దుఃఖమయంచేస్తానా! వద్దండీ వద్దు!"

నడుస్తూ ఉన్న శైలేంద్రుడు ఎదురుదెబ్బతిన్నట్టు ఆగి పోయాడు. కాని, తనమాటలు అతనిలో తేగల మార్పును గమనించిన ఆశ వెంటనే మెత్తనిగొంతుతో 'ఆగిపోయారేం? అదిగో మాయిల్లు! అక్కడ తీరుబడిగా మాట్లాడుకోవచ్చు నడవండి!' అన్నది. దీర్ఘంగా నిట్టూర్చి శైలేంద్రుడు ఇంటి వైపునడిచాడు. ఆశకూడా మౌనంగాఅతన్ని అనుసరించింది.

౨

ఆరోజు శైలేంద్రుడు చాలా ఉత్సాహంగా ఉన్నాడు. ఇల్లంతా తగుపాటి వస్తుసామగ్రితో అందంగా పరిశుభ్రంగా కనబడుతున్నది. అతను ముందుగదిలో కొలిమిపెట్టుకొని బంగారం కరిగిస్తూ సన్నని గొంతుతో ఏదో పాడుకొంటు న్నాడు.

అంతలో 'శైలేంద్ర! శైలేంద్ర' అని వీధిలోనుంచే ఉచ్చైస్స్వరంతో పిలుస్తూ లోపలికివచ్చిన విలాసుడు ఉల్లా సంగా పాడుకొంటున్న శైలేంద్రుణ్ణీ, క్రొత్తగా కనబడు తున్న గృహాలంకరణనూ చూచి ఆశ్చర్యపడి "అరె! ఏమి టోయ్ ఇది? ఏదో విశేషం ఉన్నట్టున్నదే! ఏమిటది? నాకు చెప్పదగిందైతే చెప్పు! సంతోషిస్తాను" అంటూ

అతని ప్రక్కనే చాపమీద కూర్చున్నాడు. శైలేంద్రుడు సస్మితంగా అతనివైపు చూచి, 'మరేమీ విశేషం లేదువిలాస్! ఇల్లు మరీ అసహ్యంగా కనిపిస్తే కొంచెం శ్రద్ధ తీసుకొని ఏ వస్తువు ఎక్కడఉంటే బాగుంటుందో ఊహించుకొని ఆ యా స్థానాల్లో సర్దిపెట్టాను. చెత్తా చెదారం ఊడ్చివేశాను. అంతే!" అన్నాడు.

"ఇన్నాళ్ళనుంచీ అసహ్యంగా కనిపించనిఇల్లు ఈ రోజున ఎందుకలా కనిపించింది! ఏదో విశేషం ఉందిలే! నాదగ్గఱ మఱుగుపరుస్తున్నా వది."

"నువ్వలా అంటే నేనేంచేప్పేది! నీకు చెప్పకూడని రహస్యా లేముంటాయి నాకు?"

"ఏమీ లేకపోతే ఈ కూనిరాగా లెందుకు వస్తున్నాయి? నాకు తెలుసులే!"

"తెలిస్తే చెప్పు మరి!"

"నీనోటితో చెప్పుతావో, చెప్పవో, చూద్దామని"

"విలాస్!"

శైలేంద్రుడేదో చెప్పాలని ప్రయత్నించికూడా విఫలుడై పోయాడు. సిగ్గు అతనిని మాట్లాడనివ్వలేదు. విలాసు డది గమనించి నవ్వుతూ ఇలా అన్నాడు:

"ఆడపిల్లలాగా అంత సిగ్గుపడిపోతున్నావేమిటోయ్! బహుశః నీమనసు హరించిన వగలాడి నీకోరికను అంగీకరించి ఉంటుందనుకుంటాను. నా అభిప్రాయం సరి అయిందేనా శైలేంద్ర్!"

"షోవోయ్; నీలాగా మనోహారిణులకోసం కలవరించడం నాకు అలవాటులేదు."

"అబ్బో! సంగనాచి తుంగముల్లువు గావూ! ఆశను రానీ! నీబండారమంతా బయటబడుతుంది"

"ఏమిటి విలాస్! ఆశ నీతో ఏం చెప్పింది?"

"ఏం చెప్పిందా; 'ఆశేశేంద్రుడుగారు నన్ను బ్రతికనివ్వడంలేదండి! నేనటా! ఆయనమనస్సును దొంగిలించానటా! నామనస్సును తిరిగి నాకు ఇచ్చి వేస్తావా, లేదా?' అని ఒకటే గోలపెడుతున్నారండి!" అని.

"నిజంగా ఇలా చెప్పిందా నీతో!"

"చెప్పకపోతే నా కిలా తెలుస్తుంది!"

"ఆశ అలాంటిది కాదు విలాస్!"

"అయితే ఆశతత్వం నీకుబాగా తెలుసునన్నమాట!"

"బాగానో కొద్దిగానో, నేను చెప్పలేను. నాకు తెలిసినంతవఱకు ఆమె అబద్ధాలు చెప్పదు. తేలికమనిషి కాదు."

"ఈ డొంకతిరుగుడంతా దేనికి? నువ్వు ఆశను ప్రేమిస్తున్నావా; లేదా!

"అబద్ధం ఎలా చెప్పను! ప్రేమిస్తూనే ఉన్నాను. కాని నాది చంచలమైన ప్రేమకాదు."

"దానికేంలే! సాగినంతవఱకు అందఱిప్రేమా స్థిరమైనదే! సాగనప్పుడే వస్తుంది చిక్కు."

"నామనస్సు ఎప్పుడూ ఒకే మాదిరిగా ఉంటుంది విలాస్!"

"అది నీ భ్రమ. నీ ఆశ నిన్నుకాదని మరొకరిని ప్రేమిస్తుం దనుకో! అప్పుడుగూడా నువ్వామెను ప్రేమించ గలుగుతావా !"

శైలేంద్రుడీ ప్రశ్నకు అప్రతిభుడై పోయాడు.

"ఏం శైలేంద్ర్ ! అలా తెల్లబోయావేం ? ప్రేమ తత్వం తెలిసినట్టు మరీ మాట్లాడావుగా !"

"కాదు విలాస్ ! ఆశ అలాంటిది కాదు. ఆమెయెన్న టికీ కృతఘ్నురాలు కాదు."

"కాకపోతే మంచిదేలే! కాని, కృతఘ్నురాలే అవు తుందనుకో ! అప్పుడు?"

"అప్పుడూ నే నామె శ్రేయస్సే కోరుతాను. అంతే కాని ఆమెకు కీడు తలపెట్టను."

"అది పౌరుషం కాదు శైలేంద్ర్ ! భర్త యెలాంటి వాడైనా అతనిని భార్య ఆరాధిస్తుంది. ఆరాధించి తీరాలి. కాని భార్య నడవడి మంచిది కాకపోతే ఏ పురుషుడూ సహించడు. సహించితే వాడు పురుషుడే కాదు."

"ఇది నీసిద్ధాంతం మాత్రమే విలాస్ ! బుద్ధిమంతు లెవ్వరూ దీనిని ఆమోదించరు."

"బుద్ధిమంతులు ఆమోదించే సిద్ధాంతాలకు లోకంలో ఏమీ తావులేదు శైలేంద్ర్ ! వాటిని ఎవ్వరూ ఆచ రణలో పెట్టడంలేదు. ఇది నీకు ఎందుకు తెలియదో నాకు ఆశ్చర్యంగా ఉన్నది"

"నాకు తెలియకపోవడం కాదయ్యా! తెలుసు. కాని, వాటిని నేను ఆచరణలో పెట్టి తీరాలని నిశ్చయం చేసుకొన్నాను. ఆ నిశ్చయాన్ని ఎవ్వరూ మార్చలేరు."

"కట్టె వంక పొయ్యే తీరుస్తుంది. కాలంగడచినకొద్దీ ఈ నియమనిష్ఠలన్నీ గాలికెగిరిపోతాయి శైలేంద్ర్! నువ్వేమిటో అనుకొంటున్నావు. మనిషైనదికామక్రోధాలకులొంగకుండా ఉండదు. అందులోనూ ఆశ వంటిది నీకు ఆశాభంగం కలిగించడం అతి సహజం. స్త్రీస్వభావం ఈనాటికీ ఏ విధంగా ఉంటుందనే రహస్యం నాకు తెలిసినట్లు నీకు తెలియదు"

"నాకు స్త్రీలతో విశేషపరిచయం లేనిమాట యథార్థమే అయినా, ఆశ విషయంలో నేనేమీ పొరబడటంలేదని గట్టిగా చెప్పగలను."

"శైలేంద్ర్ ! ఆశ ఆశలకు పెట్టిందిపేరు. నగలమీదా చీరలమీదా, ఇతర విలాసాలమీద ఆమెకు ఉన్న మోజు మరొక స్త్రీకి ఉండదు. దానికి కారణం ఆమె పేదఱికమే. ఈరోజున నివల్ల తన ముచ్చటలు కొన్ని తీఱగలవని ఆమె నిన్ను నమ్మినట్లు ఉండవచ్చును. అవి తీఱకపోతే బట్టను అంటుకొన్న గడ్డిపరకను విదల్చివేసినట్టు ఆమె నిన్నువిదల్చి వేస్తుంది."

"నీ కెందుకో ఆశమీద కోపం ఉందనుకొంటాను."

ఇలా అంటూ కరిగిన బంగారాన్ని మూసలోపొయ్యడానికి ఉద్యుక్తుడైనాడు శైలేంద్రుడు. ఇంతలో ఆశ లోపలికి వస్తూ విలాసుణ్ణిచూచిఆశ్చర్యంతో "ఓహో. విలాసబాబుగా

రిక్కడే ఉన్నారే! నమస్కారం బాబూ! అనుకోకుండా మీ దర్శనం లభించింది" అన్నది. విలాసు డందుకు నవ్వుతూ ఇలా అన్నాడు.

"నేను ఇక్కడ ఉన్నట్టు తెలిస్తే రాకపోయేదానివేమో"

"ఎందుచేత బాబూ! మన యిద్దరికీ గిట్టకపోవడం అనేది లేదుగదా!"

"గిట్టడం. గిట్టకపోవడం కాదు ఆశా! పాపం! నువ్వు శైలేంద్రుడితో రహస్యంగా ఏదో మాట్లాడాలని వచ్చి ఉంటావు. ఇక్కడ నేను ఉంటే మీ సంభాషణకు అంతరాయం కాదూ?"

"మీరు వారికి మిత్రులు. వారినిబట్టి నాకూ మిత్రులే. మిత్రులమధ్య రహస్యాలేమిటి?"

"బాగుంది. అయితే శైలేంద్రుడు చెప్పింది నిజమే నన్నమాట"

"ఏమిటి బాబూ అది!"

ఆశ గొంతులో కుతూహలం ధ్వనించింది.

"చెప్పవచ్చునా శైలేంద్ర!"

"నీకా జంకు దేనికి విలాస్! నువ్వు నాకు ప్రాణమిత్రుడివి కదా!"

"ఆశా! నువ్వూ శైలేంద్రుడూ కొద్ది రోజుల్లో..." అంటూ విలాసుడు మందహాసం చేసి ఆగాడు.

ఆశ ముఖం సిగ్గుతో కందిపోయింది. శైలేంద్రుడా మె ముఖలక్షణాలు గమనించి మరీ ముగ్ధుడైనాడు. మఱునటి నిమిషంలో ఆశ మృదుస్వరంతో ఇలా అన్నది.

«ఔను విలాస బాబూ! నా కోసం వారు ఎంత త్యాగానికయినా సిద్ధపడుతున్నారు. కులం గానీ, ధనంగాని లేని నన్ను తమ యింటికి అధీశ్వరిని చేసుకొనడానికి అంగీక రించారు. నావంటి దానికి ఇంత అదృష్టమా! ఈ ఆఱు నెలలనుంచీ వారు నాజీవితం సౌఖ్యవంతంచేయడానికి కావల సిన ధనం ఆర్జించడానికి రాత్రీ పగలు విరామం లేకుండా కృషిచేస్తున్నారు. ఎన్ని అవసరపు ఖర్చులో తగ్గించుకొని పైకం కూడబెట్టుతున్నారు. వారి అండను నా జీవితంలో వెలుగు చూడగలనని ఆశపడుతున్నాను. నా ఆశ ఫలించా లని ఆశీర్వదించండి విలాసబాబూ!»

ఆశ మాటలువిని విలాసుడు నిరుత్తరుడైనాడు. అతను సంతోషం అభినయిస్తూ శైలేంద్రుడివైపు చూపు సారిం చాడు. ఆశ కూడా తన మాటలకు శైలేంద్రుడు ఎంత సంతోషిస్తున్నదీ తెలుసుకొనడానికి అతనివైపు చూచింది. శైలేంద్రుడి ముఖం అత్యంత హర్షంతో ప్రఫుల్లమై ఉంది. అతని నేత్రాలవెంట ఆనందబాష్పాలు రాలుతున్నాయి. ఏదో చెప్పదలచినట్టు పెదవులు కదలుతున్నాయి. అలా ఉండే హఠాత్తుగా అతను నేలమీదికి ఒరిగిపోయి గిల గిలా కొట్టుకోవడం మొదలు పెట్టాడు. ఆశా, విలాసుడూ కంగారు పడుతూ, అతనిని జాగ్రత్తగా కొలిమి దగ్గఱనుంచి యెత్తు కొనిపోయి, రెండవగదిలో మంచం వాల్చి పరుండబెట్టారు.

"ఆశా! నువ్వు అతనిని జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉండు! నేను ఏ వైద్యుణ్ణో పిలుచుకొని వస్తాను." అంటూనే విలాసుకు గబ గబా బయటికి పరుగెత్తుకొని పోయాడు. ఆశ నిలువునా వణికిపోతూ శైలేంద్రుణ్ణి కనిపెట్టుకొని కూర్చున్నది.

# 3

మఠాధిపతికి కొన్నిరోజులనుంచీ అస్వస్థతగా ఉన్నది. శైలేంద్రుడు భక్తి శ్రద్ధలతో ఆయనకు ఉపచారాలు చేస్తున్నాడు. ఆ గురు సేవలో అతనికి నిశ్చింతగా భోజనం చెయ్యడానికి గానీ, కంటినిండా నిద్రపోవడానికి కానీ వీలు ఉండడం లేదు. అతను అప్పుడే అన్నం ముందు కూర్చుని ఉంటాడు. "శైలేంద్ర!" అన్న గురువు పిలుపు అతినీరసంగా వినిపిస్తుంది. తక్షణం అతను చెయ్యినా మూతీ కంచంలోనే కడుగుకొని ఆయన దగ్గరకు పరుగెత్తుతాడు. "అబ్బా! కాళ్ళులాక్కొని పోతున్నాయిరా తండ్రీ!" అంటారు గురువుగారు. అతను వెంటనే ఆయన ప్రక్కనే కూర్చుని పాద సంవాహనం ప్రారంభిస్తాడు. "అమ్మయ్య!" అనుకొంటూ గురువుగారు మెల్లగా నిమీలిత నేత్రులవుతారు. అలా వుండి ఉండి కొంతసేపటికి వారు పూర్తి నిద్రాధీనులైనట్లు కనిపిస్తారు. కొంచెం దాహం తీర్చుకొని వద్దామని అతను ప్రక్కనుంచే లేచి రెండడుగులు వేస్తాడో; లేదో! "వెడుతున్నావా శైలేంద్ర!" అని గురువుగారు దీనంగా ప్రశ్నిస్తారు. అతను అంతదాహాన్నీ అణచుకొని తిరిగి ఆయన పాదాలు ఒత్తుతూ కూర్చుంటాడు.

రాత్రివేళ కూడా చాలా సేపటివరకూ గురువుగారికి నిద్రపట్టదు. తల పగలగొట్టుకు పోతున్నదనో, చెయ్యిపోటు పుడుతున్నదనో బాధపడ్తూ వారు పడుకునే ఉంటారు. ఉపచారం చేస్తున్నవాడు చేస్తున్నట్టే ఉంటాడు శైలేంద్రుడు. ఒకరాత్రి వేళకు ఎంత నిగ్రహించుకొంటున్నా ఆగకుండా నిద్రవస్తే మంచం పట్టెమీదనే కొంచెం తలవాలుస్తాడు అతను. అంతలో "అమ్మా! అబ్బా! అయ్యో! శివ శివా!" అన్న గురువుగారి ఆర్తారవాలు బాణాల్లాగా అతని చెవులు దూసుకు పోతాయి. వెంటనే అతను తన కన్నుమూసినందుకు సిగ్గుపడుతూ తిరిగి గురువుగారికి పరిచర్యలు ప్రారంభిస్తాడు.

మఠంలో భక్తుల సంఖ్య కేమీకొదవ లేదు. వారి భోజన భాజనాల క్రింద అయ్యే ధనవ్యయానికిన్నీ పరిమితి లేదు. మఠాధిపతి ఆరోగ్యం కోసమని ఎందఱోఎన్నో దీక్షలు పట్టారు. నిత్యం ఏకాదశ రుద్రాభిషేకాలు జరుగుతున్నాయి. నవగ్రహజపాలు సాగుతున్నాయి. ప్రతిదినం భాగవత సమారాధనలు పుష్కలంగా నెఱవేరుతున్నాయి. విలాసుడూ, ఆశా మొదలైన వారుకూడా యథాశక్తిగా ఈ కార్యకలాపాలలో పాల్గొంటున్నారు. బజారు నుంచి తేవలసిన వస్తువులన్నీ కొని తెచ్చే బాధ్యత వహించాడు విలాసుడు. భక్తులకు ఆయాపాత్రలు పరిశుభ్రంగా తోమి ఇవ్వడం, పూలు కోసి తేవడం, భోజనశాలలు బాగుచెయ్యడం వంటపనులన్నీ ఆశ ఎంతో ఓపికగా నిర్వర్తిస్తున్నది. ఎవరూ కూడా స్వార్థ

మనేదిలేకుండా మఠాధిపతి ఆరోగ్యం చక్కబడడమే పరమ లక్ష్యంగా పనిచేస్తున్నట్లున్నారు. అయితే స్వామివారి చెంత అరపై గడియలు కాచుకొని ఉండేపనికి మాత్రం ఎవ్వరూ ముందుకు రావడంలేదు. శైలేంద్రుడే అందుకు తగినవాడని అందరూ అభిప్రాయ పడ్డట్టున్నారు. మఠాధిపతికూడా ఏపరిచర్యకయినా శైలేంద్రుణ్ణి తప్ప మరొకరిని పిలవడంలేదు. ఒకవేళ అతను ఆ సమయానికి మఠావరణలో లేకపోతే ఎవరో ఒకరు అతనిని పిలుచుకొని వచ్చేవారేకాని అతని బదులు కొంతసేపు రోగికి పరిచర్య చెయ్యడానికి సిద్ధపడేవారు కారు.

ఒకరోజున విలాసుడు నౌకర్ల చేత బజారు వస్తువులు మఠానికి గంపలలో చేర్పించి, చేరుమాలుతో ముఖం మీది స్వేద బిందువులు తుడుచుకుంటూ ఇలా అన్నాడు.

"స్వామివారి ఆరోగ్యం ఎప్పటికి చక్కబడుతుందో; అప్పుడుగాని ఈ శ్రమకు సార్థకత కనిపించదు. నాకు ప్రతి క్షణం వెయ్యికళ్ళతో చూడవలసిస్తోంది పని అయినా. ఎక్కడ పొరపాటు పడితే మఠద్రవ్యం దుర్వినియోగం అవుతుందో అనే భయం నాకు శాంతిలేకుండా చేస్తున్నది."

అప్పుడే పూజా మందిరంలోకి పువ్వులతో వెళ్ళుతున్న ఆళి యీ మాటలు విని "మీరు చాలా శ్రమ పడుతున్న మాట వాస్తవమే విలాసబాబూ! అయినా స్వామి కార్యం శ్రమ అనుకోగూడదు. మనం ఇలా అనుకొన్నట్టు స్వామి

వారికి తెలిస్తే వారు ఎంతైనా నొచ్చుకుంటారు." అన్నది.

విలాసుడు ఇందుకు సంతృప్తి పడలేదు.

"ఆ విషయం నాకు తెలియకపోలేదు ఆశా! అయినా మరొద్రవ్యం కాసైనా నా అజాగ్రత్తవల్ల వ్యర్థమై పోతుం దేమో అనే భయంవల్లనే యిలా అనుకొంటున్నాను. ఈ వర్తకు లున్నారే; వీళ్ళు మనిషి ముఖాన్నిబట్టి వెలలు చెప్తూ ఉంటారు. కొంచెం గడుగ్గాయిలాగా కనిపించిన వాడికి సరి అయిన ధర చెబుతారు. శైలేంద్రుడి వంటివాడి కయితే రెట్టింపూ మూడు రెట్లూ కూడా చెబుతారు. ఆవెర్రి వాడు అంత ధరాపెట్టి తెస్తాడు వస్తువు. చూడు మరి! ఎంత ధనం వృధా అయిపోతుందో!"

"మీరు మాటి మాటికీ వారి నలా అంటుంటే నా కేమిటో కష్టంగా ఉంటుంది విలాసబాబూ!"

"ఒకరికి కష్టంగా ఉంటుందని సత్యం చెప్పడానికే నే నన్నడూ వెనుదియ్యను ఆశా! ఆ గుణం వల్లనే నేను ఎవరికీ పనికిరానివాడినయి పోతున్నాను. ఊరికే అన్నారా మతి! 'యథార్థ వాగ్ బంధువిరోధీ' అని!"

"యథార్థం చెప్పటం తప్పు కాదనుకోండి! మాటి మాటికీ ఒకరిని వేలెత్తి చూపుతూ 'వెర్రివాడు, అసమర్థుడు, అధముడు' అని అనడం మంచిదా చెప్పండి!"

"ఆశా! అతను నాకు స్నేహితుడైన తర్వాతనే నీకు పరిచితుడైనాడు. స్నేహితుడి శ్రేయస్సు కోరడం నాకు

ధర్మం. అందుకనే సమయం వచ్చినప్పల్లా అతని లోటు అతనికి తెలియ జెప్పుతూ ఉంటాను! చెప్పగా, చెప్పగా ఒక నాటికయినా అతను తన తెలివి తక్కువతనాన్ని గుర్తించక పోడు, తెలివితెచ్చుకోక పోడు-అని నా విశ్వాసం. నేనేదో ద్వేషంతో అతనిని నిందిస్తున్నా ననుకుంటున్నావేమో!»

«మీరు ద్వేషంతో అంటున్నారని నే నెప్పుడూ అనుకోను విలాసబాబూ! కాని వారు ఎదురుగా లేని సమయంలో మీరు ఇలా అన్నందువల్ల మేలేమీ ఉండదంటు న్నాను.»

«ఎందుకుండదు? అతనిమీద అభిమానం ఉన్నవాళ్లు ఎవళ్ళో ఒకళ్ళు 'విలాస బాబు నిన్ను గురించి యిలా అన్నా'డని అతనితో చెప్పకుండా ఉంటారా! అప్పు డతనికి తన తెలివి తక్కువ తనం తెలియకుండా ఉంటుందా! ఒక్కటి గుర్తులో ఉంచుకో ఆశా! సదుద్దేశంతో అనే మాట యెన్నటికీ వ్యర్థం కాదు. ఏదో ఒకనాటికి దానివిలువ లోకానికి తెలిసివస్తుంది.»

పూజా మందిరంలో పువ్వులు చేర్చి తిరిగి వస్తున్న ఆశ యీ మాటలకు ఇలా జవాబిచ్చింది.

"అందరికీ అన్ని శక్తులూ ఉండవు విలాసబాబూ! బేరసారాల్లో మీకు ఉన్న ప్రజ్ఞ ఎన్ని జన్మాలకూ నాకు అబ్బదేమో! అలాగే వారి శాంత స్వభావం కూడా నాకు ఎప్పటికీ అందరానిదిగానే కనుపిస్తుంది. నిజం చెప్పవలసివస్తే స్వామి వారికి వారు చేస్తున్నసేవ మరెవరికీ చేతగాదనే

చెప్పాలి. నిద్రాహారాలను రెంటినీ వదలిపెట్టి అరవై గడియలూ వారు స్వామివారి నలా కనిపెట్టుకొని ఉన్నారు. ఒకప్పుడు స్వామి వారు బాధ భరించలేక వారి నెలాంటి మాటలో అంటూ ఉంటారు. ఎన్నిమాటలు పడ్డా వారి పెదవులమీద చిరునవ్వు మాసిపోదుగదా! అంత సహనం మనకు ఉంటుందా మరి! ఏ నిమిషంలోనైనా అబ్బ ఏమిటీ బాధ అని అనుకోనడం వున్నదా!"

"ఎందుకనుకోవాలి! స్వామివారి ధనమంతా అతని చేతిలోనే ఉండె! అతని చేతిలో నుంచి తప్ప ఎవరికి రాగిడబ్బు కూడా ముట్టదయ్యె. ఇలా ఓపిక పట్టగాపట్టగా రేపు అతనికే మఠాధిపత్యం వస్తుంది. ఆశా, శైలేంద్రుడు అంత తెలివి తక్కువ వాడేం కాదు. తన భవిష్యత్తేమిటో గుర్తించే అతను స్వామివారికి పరిచర్య చెయ్యడానికి సిద్ధపడ్డాడు."

"అన్యాయంగా మాట్లాడుతున్నారు విలాసబాబూ స్వామివారి ధనం అంతా వారి చేతిలోనేఉన్నా ఏ చిన్న ఖర్చుకూ లెక్కవ్రాసి చూపాలి వారు. అదీ యెలాంటిది? 'విలాసబాబుగారి కిచ్చిందింత_మరొక బాబుగారికి చ్చిందింత' అనేగా! ఇవ్వనిది ఇచ్చినట్లు వ్రాస్తే మీ రందరూ ఒప్పుకొంటారా? కాబట్టి ఆ అధికారం వల్ల వారికి లాభించే దేమీ ఉండదు. మిగిలింది భవిషత్తులో మఠాధిపత్యం మాట. ఆ అధిపత్యం వల్ల బాధ్యతలు పెరుగుతాయే గానీ సౌఖ్యం ఉండదు గదా! స్వామివారు దీనివల్ల ఎంత సుఖ

పడుతున్నదీ మనకు తెలియని విషయమూ! అటువంటిదాని కోసం ఆశించి వారు ఏం సుఖపడగలరు."

ఇలా అని ఆశ అక్కడినుంచి బయటికి వెళ్ళిపోయింది. విలాసుడు ఆమె పోక గమనిస్తూ బహిగంగ స్వగతం లాగా ఇలా అనుకొన్నాడు.

'ఈ ప్రపంచమే యింత. ఒళ్ళు వంచకుండా ఉపాయంగా ఇతరుల సొమ్ము ఆరగించే వారిని ఏమీ అనదు. పగలు నాలుగు జాములూ ఊపిరాడకుండా కష్టపడే వారి శ్రమనూ గుర్తించదు. ఒక్కొక్క వస్తువుయొక్క సరి అయిన ధర తెలుసుకొనడానికి ఎన్ని అంగళ్ళు తిరగవలసి వస్తున్నది. తూకంలో, కొలతలో, నాణెంలో మోసం జరగకుండా చూడడానికి ఎంత శ్రద్ధ వహించవలసి వస్తున్నది. కొన్న వస్తువులన్ని అంగడిలో మరచిపోకుండా, దారిలో నేలపాలు గాకుండా మఠానికి చేర్పించే సరికి ఎంత ప్రయాస పడవలసి వస్తున్నది!

'ఇదేమీ లేకుండా, కూర్చున్న చోట నుంచి కాలు కదల్చకుండా, బుద్ధిబలంతో అసలే అవసరం లేకుండా కూర్చున్నవాళ్ళు మహా శ్రమ పడిపోతున్నారట ? అందుకే అన్నారు'లోకులు పలు గాకు'లని. వాడు ఎంత బుద్ధిమంతుడు గాని, లోకాన్ని ఎప్పటికీ మెప్పించలేడు.'

ఆ రోజున మఠంలో చాలా గందరగోళంగా ఉన్నది. స్వామివారు మహా శివరాత్రినాడు శివసాయుజ్యం పొందగా ఆ రాత్రే ఎవరో ఇనపపెట్టె తలుపులు పగలకొట్టి ధనం యావత్తూ అపహరించుకొని పోయారు. రోజూ ఆ పెట్టె తెరచి ధనం తియ్యడం మళ్ళీ పెట్టెతాళం వెయ్యడం శైలేంద్రుని వల్లనే జరుగుతున్నది. కాని శైలేంద్రుడు పరధనం విషంగా చూస్తాడని అందరికీ తెలుసు. అతను తన వృత్తిలో బాగానే ధనార్జన చేస్తున్న వాడు. కుటుంబభారం అనేది లేకపోవడంవల్ల అతనికి పెద్దఖర్చులేవి లేవు. అతని తిండికీ బట్టలకూ పోగా ఎంతో ధనం మిగులుతున్నది. పైగా స్వామివారికి పరిచర్య చేస్తే పుణ్యమనే భావంతో మాత్రమేఅతను మఠంలోకి వచ్చి నిద్రాహారాలు కూడా మరచి వారికి ఉపచారాలు చేశాడు. అవసాన దశలో వారు భక్తుల నందరినీ చేరబిలిచి 'నా తర్వాత ఈ మఠానికి శైలేంద్రుడే అధిపతి. మీరు అతని ఆజ్ఞలను పాలించాలి'అని చెప్పి మరీలింగైక్యం పొందారు. అటువంటి శైలేంద్రుడే మఠద్రవ్యం హరిస్తాడా!

మఠస్థులూ గ్రామస్థులూ కూడా తర్జన భర్జనలు మొదలుపెట్టారు. యీ దొంగ ఎవడో మన ఊరివాడేకాక మఠం యొక్క రహస్యాలు అన్నీ తెలిసినవాడై ఉండాలి.

ఈనాడు ఇంతసాహసం చేసినవాడు రేపు ఇంకెన్ని ఘోర కృత్యాలకు సిద్ధపడతాడో! ఎంత కష్టమైనా సరే! దొంగను కనిపెట్టి కౄరంగా శిక్షించాలి. అని అందరూ కూడబలు క్కొని అన్వేషణ సాగించారు. ఊళ్ళో ఎక్కడ విన్నా ఈ దొంగతనాన్ని గురించిన చర్చలే నడుస్తున్నాయి. వొక రోజున విలాసుడు ఆశను ఏకాంతంలో కలుసుకొని యిలా ముచ్చటించాడు.

'ఆశా, నిన్ను చూస్తే నాకు చాలా విచారంగా వున్నది. నీకు ఇంతకష్టం వస్తుందనుకోలేదు.'

ఆశ ఆ మాటలకు అదిరిపడింది.

'ఏమిటది విలాసబాబూ! మఠంలో దొంగతనం నేనే చేశానని నిందరాలేదు గదా!'

'ఈ పాడులోకంలో ఏవీ అసంభవం కాదు ఆశా.'

ఆశకు దాదాపు మతిచెడి నట్లయింది.

'ఆశగుణం ఎలాంటిదో ఈ ఊళ్లో ఎరుగని దెవరు విలాసబాబూ! ఎంతెంత ధనం కలవారి యిళ్ళల్లో తిరగ లేదు నేను? నామీద నమ్మకంతో ఇల్లంతా నామీద వదిలిపెట్టి ఎంతమంది యిల్లాళ్ళు పుట్టిళ్ళకు పోలేదు. ఎప్పు డైనా చిల్లిగవ్వయినా పోయిందా? అటువంటిదాన్ని ఎలా దొంగదంటున్నారు! పేదదాన్నయినంతమాత్రాన దొంగ తనం చేస్తానా? భాగ్యవంతులైకూడా యెంతమంది ఇతరుల కొంపలు తియ్యడంలేదు. ఆ పాడు బుద్ధి పేదరికం వల్లనే

వస్తుందనడానికి వీల్లేదు బాబూ! ఈ మాత్రం మీరు చెప్ప లేక పోయారా.'

ఈ దీన వాక్యాలకు విలాసుడు జాలిపడుతున్నట్లు చూచి ఆమెతో ఇలా అన్నాడు.

'నిజం ఆశా! పేదవాడే దొంగతనం చేస్తాడనీ, భాగ్య వంతుడు చెయ్యడనీ సిద్ధాంతం చెయ్యడానికి వీల్లేదు. నేనూ ఈ మాటే అంటున్నాను. నాకు తెలిసినంతవరకు ఈ దొంగ తనం కాస్తో కూస్తో వున్నవాడూ, మహాపుణ్యాత్ముడు అని పేరుపడ్డవాడూ అయినవాడే చేశాడని నిశ్చయమవుతున్నది. అయితే ఆ దొంగ అసాధ్యుడు. కన్నంలో వుండగా కనిపిస్తే తప్పితే అతన్ని దొంగ అని ఎవ్వరూ ఒప్పుకోరు. అది తెలిస్తే అతనింత సాహసం చేశాడు.'

'అయితే అతనెవరో మీకు బాగా తెలుసు నన్న మాట.'

'తెలిస్తే ప్రయోజనం ఏమిటి ఆశా! తగినంత నిదర్శ నం ఉంటే గానీ, ఆ మాట బైటపెట్టడానికి వీలుండదు.'

'అయితే నాలాంటి దిక్కూ మొక్కూ లేని వాళ్ళు అన్యాయంగా నిందపాలై నశిస్తుంటే చూస్తూ ఊరుకోవడం మీ లాంటి వాళ్ళకు ధర్మమేనా! ఇంతకూ వారికి ఈ మాట తెలిసిందా?'

'ఏ మాట?'

'ఆశమీద నేరం మోపుతున్నారని.'

'తెలియకేం, బాగా తెలుసు.'

'తెలిస్తే వారు ఏమీ పట్టనట్టు కూర్చుంటారా? నమ్మ లేకుండా వున్నాను విలాసబాబూ.'

'ఆశా, ఆనాడే నేను నీకు గట్టిగా చెప్పాను ఎలాటి భావావేశం కలిగినా ఒళ్ళు మరచిపోయే వ్యక్తి ఎప్పటి కయినా ప్రమాదకారి కావచ్చునని'

'అంటే మీ అభిప్రాయం ఏమిటండీ! నా గొంతు మీదికి వస్తే వారు ఉపేక్షిస్తారా?'

'అయ్యో, నువ్వెంతగా నమ్మావు కాబట్టే, తడి గుడ్డతో గొంతు కోస్తున్నాడు దుర్మార్గుడు. తను చేసిన దొంగతనాన్ని నీ మీదకు నెట్టివేస్తున్నాడు, ఆశా! శైలేంద్రుడు తేనెపూసిన కత్తి. గోముఖ వ్యాఘ్రమూ తప్ప నువ్వనుకొన్నట్టు ఏమీ అమాయకుడూ, ప్రేమమూర్తీ కాడు.'

'మీ రిలా మాట్లాడటానికి ఆధారాలేమిటి విలాస బాబూ.'

'కావలసినన్ని.'

'ఏదీ, ఒక్కటి చెప్పండి?'

'తప్పకుండా చెపుతాను కాని యిప్పుడు కాదు.'

'ఈ కాలయాపనకు కారణం?'

'అదీ ఇప్పుడు చెప్పను. ప్రస్తుతం నా ప్రయత్నం ఏమిటంటే ఎంతచెడ్డా అతను నాకు మిత్రుడు కాబట్టిఅతనిని రక్షించాలని. అయితే ఆ ప్రయత్నంవల్ల నీ కేమీ అపకారం

జరగకూడదు. అతను నేరమంతా నీమీదకే నెట్టివెయ్యటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు.'

'మీ రెన్నయినా చెప్పండి, నాకు నమ్మకం చిక్కటంలేదు.'

ఇలా అని ఆశ విసురుగా వెళ్ళిపోయింది. విలాసుడు నిర్లక్ష్యంగా నవ్వుతూ, ఆమె కనిపించినంతవరకు చూచి, తన మిత్రుల్ని కలుసుకొనడానికి వెళ్ళిపోయాడు.

ఆశ తిన్నగా శైలేంద్రుడి నివాసానికి వెళ్ళింది. ఆమె వెళ్లేసరికి శైలేంద్రుడు వీధి తలుపు గడియ పెట్టుకొని వున్నాడు. ఆశ తలుపు మెల్లగా తట్టింది. శైలేంద్రుడు తలుపు తియ్యకుండానే 'ఎవరు వారు!' అని ప్రశ్నించాడు. ఆశ తడబడుతున్న స్వరంతో 'నేనేనండీ!' అన్నది. 'నువ్వేనా? నేనింకా ఎవరో అనుకొన్నాను' అంటూ శైలేంద్రుడు వచ్చి తలుపు తెరిచాడు. 'త్వరగా లోపలికి రా! మళ్ళా యెవరయినా చూస్తారేమో' అంటూ తలుపు పట్టుకొని నిలబడ్డాడు.

'ఎందుకండీ అంత జంకుతున్నారు? ఎవరు చూస్తే మాత్రం ఏమనుకొంటారు?' అని విస్మయంతో ప్రశ్నించింది. ఆశ.

'నీ కాళ్లు పట్టుకొంటాను ఆశా! యిక్కడ నిలబడి ప్రశ్నలు వెయ్యకు. లోపలికి వస్తే నీకు అంతా చెబుతాను.'

అతనిలా అనడంతో ఆశ తలపంకిస్తూ, అతని వంక ఒక్కసారి సాభిప్రాయంగా చూచి మెల్లగాలోపలికివచ్చింది. ఆమె వెనకనే తలుపు గడియపెట్టి శైలేంద్రుడు కూడా లోపలికి వచ్చాడు. ఆమెను ఒకచోట కూర్చోవలసిందని చెప్పి, తాను ఒకచోట కూర్చుని ఇలా అన్నాడు.

'ఆశా, స్వామివారు నామీద ఎంతో అనుగ్రహం కలిగి యీ మఠాధిపత్యం నాకు ప్రసాదించారనుకో. కాని నువ్వూ చూస్తూనే వున్నావుకదా? నేను ఆ పదవిని అలంకరించకముందే మఠద్రవ్యం దొంగలపాలై పోయింది. ఆ దొంగ లెవరైనా కానీ మఠం గుట్టు యావత్తు తెలిసినవాళ్లే అనేది సత్యం. వాళ్లు మఠస్థులలో ఒకరై ఉంటారనేదిన్నీ యధార్థమే. ఇటువంటి ద్రోహులు ఉన్నచోట నాలాంటి అమాయకుడు ఇంత బాధ్యతకల పదవిని ఎలా నిర్వహించగలడో నువ్వే చెప్పు?'

ఆశ యిందుకు జవాబేమీ చెప్పకుండా అతనిముఖాన్ని పరిశీలనగా చూడటం మొదలు పెట్టింది. ఆమె మౌనంగా వుండటం, పరీక్షగా తన ముఖాన్ని చూస్తూ ఉండటం గమనించిన అతను విస్మితుడై 'అదేమిటలా చూస్తున్నావాశా?' అని అడిగాడు.

'మీ పక్కనే వున్న ఆ సంచిలో ఏమున్నదండీ?' అన్నదామె.

'ఇందులోనా? యిన్నాళ్ళ కష్టార్జితం ఆశా! నువ్వు నా అర్థాంగివైతే సాటి స్త్రీలముందు ఏ మాత్రం తీసిపోకుండా మంచి చీరా,మంచినగా ధరించినవ్వుతూ సుఖంగా

వుండాలికదా? దానికి ధనం అవసరం కదా? అలా అవసర మయే ధనం కొంతవరకు కూడబెట్ట గలిగా నిప్పటికి. అన్నట్టు నే నిలా చేస్తున్నానని యిదివరకే చెప్పాను గూడా నేమో?,

'చెప్పారుగా! ఏదీ. అందులో ఏమాత్రం ధనం వున్నదో చూడనివ్వండి?'

'చూడు, ఎప్పటికయినా చూడవలసిన దానివే గదా.' అంటూ శైలేంద్రుడు ఆ సంచిని ఆమెకు అందించాడు.

ఆశ తొందరగా సంచిలోని వస్తువులన్నీ క్రుమ్మరించి చూచింది. వాటిలో కొన్ని కాసులు, కొన్ని ముత్యాలు, కొన్ని బంగారు నగలు కూడా వున్నాయి. ఆమె నగలను చూచి ఆశ్చర్యపడుతూ 'ఎక్కడివండీ ఇవి?' అని అడిగింది. 'పాతనగలు బేరానికి వస్తే కొన్నాను' అన్నాడతను ఉత్సాహంగా. ఆమె వాటిని అతిపరిశీలనగా చూస్తూ 'ఎవరిదగ్గర కొన్నారండీ?' అని అడిగింది.

'ఒక స్నేహితుడి దగ్గర కొన్నాను.'

'అతనిది మన ఊరేనా?'

'కాను'

'ఎవరండీ అతను?'

'ఆ మాట మాత్రం అడగకు ఆశా.'

ఆశ క్రింది పెదవి మునిపండ్లతో నొక్కిపట్టుకొని అతనివైపు వింతగా చూచింది.

'అలా చూస్తున్నా వేం ఆశా?'

“మీరు నాతో చెప్పగూడనిరహస్యాలున్నాయండీ!”

శైలేంద్రుడి ముఖం వివర్ణమైంది. కొంతసేపటివఱకూ అతను ఆమెకేమీ జవాబు చెప్పలేకపోయాడు. దానితో ఆశ ముఖంలో మార్పులు ప్రారంభమైనాయి. ఆమె వక్షస్థలం ఉచ్ఛ్వాస నిశ్వాసాల వేగానికి మాటిమాటికీ పొంగుతూ క్రుంగుతూ వచ్చింది. తెల్ల కలువ రేకులవంటి కన్నులు ఎఱ్ఱ కలువ రేకులను తలపించాయి. అధరం అదర సాగింది.

“మాట్లాడరేమండీ!”

వీణానాదం తలపించే ఆమె కంఠస్వరం అతి కర్కశంగా ధ్వనించింది.

అతను త్రుళ్ళిపడి ఆమె కళ్ళల్లోకి చూచాడు. ఆ చూపులో అతని దైన్యమంతా గూడుగట్టుకొన్నట్టున్నది.

“అలా చూస్తారేం! ఇన్నాళ్ళనుంచీ నాతో మీరు చెబుతూ వచ్చినవన్నీ అబద్ధాలే నన్నమాట!” ఆశ చూపులలో అతనిపట్ల తిరస్కారం బాగా వ్యక్తపడింది.

“అబద్ధాలా!”

ఇలా అనేటప్పుడు శైలేంద్రుడి కంఠం జీరబోయింది.

ఆశ అతని దైన్యానికి ఏమాత్రమూ జాలిపడలేదు.

“మీరు ఇంత మేకవన్నె పులులని యేనాడూ అనుకోలేదు. తియ్య తియ్యటి మాటలతో నన్ను నమ్మించారు. చివరకు నా గొంతు కోయడానికి సిద్ధపడ్డారు. ఎవ

రెన్నివిధాల చెప్పినా వినక, మీమీదనే మనస్సు నిలుపు కొన్నందుకు నాకు తగ్గ శాస్తి చేశారు. మీ స్వార్థంకోసం నన్ను బలిపెట్టడానికి సిద్ధపడ్డారు. కానివ్వండి! మీకు చేత నయిందంతా చెయ్యండి! నేను ఆత్మరక్షణకోసం ఎలాంటి ప్రయత్నమూ చెయ్యను. జరగవలసిందేదో జరుగుతుంది. కాని, చివరిసారిగా మీకు ఒక్కమాట చెప్పి పోతాను. ఈ కుట్రలో మీరు విజయం పొందినా ఏదో ఒక రోజు మీ ఈ ఆనందానికి ఎన్నో రెట్లు దుఃఖం అనుభవించవలసి వస్తుంది. కాబట్టి చేసినదానికి పశ్చాత్తాపపడండి! నన్ను వంచించినట్లు మరెవ్వరినీ వంచించటానికి యత్నించకండి! ఉన్నదానితో తృప్తిగా శాంతిగా జీవించండి. సెలవు!"

ఇలా ఒక్క గుక్కలో ఆవేదన అంతా వెళ్ళగ్రక్కి తటాలున లేచిపోయింది ఆశ. "ఆశా! ఆశా! నిన్ను నేనిప్పటికీ ప్రేమిస్తూనే ఉన్నాను. నీకు ఏ విధమైన కీడూ తలపెట్టలేదు. ఏ ఒట్టు పెట్టుకోమన్నా పెట్టుకొంటాను" అని శైలేంద్రుడు అతి దీనంగా రోదిస్తూ కూలబడిపోయాడు. కాని, ఆమె వెనక్కి తిరిగి చూడకుండానే "మోసగాళ్ళు మాటమాటకూ ఎన్ని ఒట్లయినా పెట్టుకొంటారు లెండి! ఇప్పటికైనా భగవంతుడు నా కళ్ళు తెరిపించాడు. ఇక జీవితంలో మిమ్మల్ని నమ్ముతానా!" అంటూ గడియతీసుకొని తలుపు తెరిచి వెళ్ళిపోయింది. శోకమూర్ఛితుడైన శైలేంద్రుడికి ఆమె తలుపుతీసి పోవడమే తెలియకపోయింది.

౫

నా ప్రియమైన !ఆశా!

ఆ రోజున నువ్వు నన్ను దొంగనుగా ఎందుకు అనుమానించావో నాకు తెలుసు. యదార్థానికి నేను దొంగను కాను. ఇప్పుడు మత ద్రవ్యాన్ని నేనే అపహరించి నట్టు ఊళ్ళోవాళ్ళందఱూ నిర్ణయించి, నన్ను పదభ్రష్టుణ్ణి చేయడమే కాక, నాసర్వస్వం మతానికి చేర్చివేశారు. నన్ను ఈ ఊళ్ళో ఉండరాదని ఆంక్ష విధించారు. నువ్వు నేను చెయ్యని తప్పుకు నన్నెలా నిందించావో, అలాగే వీళ్ళూ నేను చెయ్యని అపరాధానికే నన్ను హింసించి తఱిమి వేస్తున్నారు. సత్యాసత్యాలు నాకు తెలుసు; భగవంతుడికి తెలుసును. ఇది అంతా ఇలా నడిపిన మఱొకవ్యక్తికి కూడా తెలుసును. కాని మొదట్లో నేను అతనికి చేసిన వాగ్దానాన్ని బట్టి అతని పేరు బయటపెట్టలేకపోయాను. ఈనాడు కూడా నేను ఆ వాగ్దానానికే కట్టుపడి ఉన్నాను. కాని, ఆశా! నువ్వు నా శీలం ఎలాంటిదో తెలియనిదానివి కావుగదా! నువ్వెలా నన్ను అనుమానించగలిగావు? ఇదే నాకు తీఱని మనోవేదన కలిగిస్తున్నది. నా మాట నమ్ము ఆశా! నేను దొంగను కాను. దొంగ సొత్తును తెలిసికొన్నవాణ్ణి కాను. ఆ వ్యక్తిమీద ఉన్న నమ్మకంకొద్దీ కొన్నాను.

ఆశా! నీమీద ఆశతోనే నేను అహోరాత్రాలూ ఒకటే పనిగా చెమట ఓడ్చి ధనం సంపాదించాను. ఒక్క-

రాగిడబ్బుకూడా అక్రమంగా సంపాదించలేదు. ఈ ధనంతో నీకు కావలసినవన్నీ అమర్చి, నీ పెదవులమీద మధురమంద హాసం వెలుగుతూఉంటే ఆ వెలుగులో ఎన్ని దివ్యలోకాలో చూడాలని ఆశపడ్డాను ఇది అంతా నీకు తెలిసిన విషయమే కాని క్రొత్తది కాదుగదా! నీ కోసం అంత శ్రమపడ్డవాణ్ని ఎందుకిలా ద్వేషిస్తున్నావు ఆశా !

నేను దొంగను కావడమే నీ గొంతు కొయ్యడమను కొన్నావా? లేక మరొక విధంగా నీ క్షేమానికేదు తలపెట్టా నని అనుకొన్నావా? నాకు నీ అభిప్రాయం ఏమిటో బోధ పడటంలేదు. ఆశా! నిజం ఎప్పటికో ఒకప్పుడు బయట పడుతుంది "శైలేంద్రుడు నిర్దోషి. అతనిని అన్యాయంగా హింసించాము" అనిఅందరూ అనుకోక పోరు. అంతవరకూ వేచి ఉండలేవా! ఇప్పుడే విలాసుణ్ణి వివాహం చేసుకొని, నా గుండె ముక్కలు చేసివేస్తావా! నా జీవితం సర్వంఅంధ కారంమయం చేసివేస్తావా! ఇంత కఠినురాలవా ఆశా! మరి కొంచం కాలం వేచివుండే సహనం నీలో అంతరించి పోయిందా !

వెడుతున్నాను ఆశా! వెడుతున్నాను. నిరాశుణ్ణయి ఎన్నడూ చూడని ఏ క్రొత్తచోటికో వెళ్ళిపోతాను. ఆత్మ హత్య చేసుకొనే ధైర్యం లేనందువల్ల బరువైన జీవితాన్ని ఒంటరిగానే తుదిగడియదాకా మోస్తూనే కనుమూస్తాను. 'శైలేంద్రుడు నిరపరాధి అయినకూడా అపనిందలపాలై నానా హింసలూ పడి మరణించా'డని ఆనాడైనా నువ్వు జాలిపడక

పోవు. పశ్చాత్తాపంతో కన్నీరువిడవకనూపోవు. కాని లాభం ఏమిటి? అది నీకు జీవితాంతందాకా బాధాకరంగానే ఉంటుంది.

ఆశా! మరొక్కసారి బాగా ఆలోచించి చూడు! అప్పుడే విలాసుణ్ణి వివాహమాడబోకు; శాశ్వతంగా నాకు పరాయిదానివి కాబోకు! ఒకనాటి కయినా నువ్వు నాదాని వౌతావనే ఆశ ఉంటే నేను ఉత్సాహంగా జీవించగలుగు తాను. మళ్ళీ ధనం సంపాదించగలుతాను. ఇద్దరం సుఖంగా జీవించగలుతాము ఆమాత్రం అవకాశం నాకు ఇయ్యి ఆశా!

చివరిసారిగా నిన్ను ఇదే వేడుకొంటున్నాను. నా స్వార్థం సర్వం నీమీదనే కేంద్రీకరించుకొన్నాను. నీ ఆనం దమే నా ఆనందమనుకొంటున్నాను. నువ్వీనాటిదాకా నా విషయంలో అలాగే ఉన్నావు. ఇకముందైనా అలాగే ఉండి మన పవిత్రప్రేమను కలుషితం చెయ్యవద్దని ప్రార్థిస్తు న్నాను. ఒక్కసారి నాకు దర్శనమిచ్చి అలా వరం ఇవ్వవా ఆశా! నీకోసం కళ్ళు కాయలు కాచేట్టు నిరీక్షిస్తున్నాను. రావూ!

—శైలేంద్రుడు.

పెళ్ళిపీటలమీదకు వెళ్ళబోతున్న ఆశ ఒకచిన్నపిల్ల అందించిన యీఉత్తరం ఇలా చదువుకొని కొంతసేపు ఏం చెయ్యాలో తోచని పరిస్థితిలో పడిపోయింది.

"ఆశా! ఏంచేస్తున్నావిక్కడ! ముహూర్తం సమీపిస్తోంది. పురోహితుడు రానేవచ్చాడు. నువ్వు అక్కడికి రావాలి. గౌరీపూజ ముగించాలి ఎక్కువవ్యవధిలేదు. బయలుదేఱు మఱి!" అంటూ కంగారుగావచ్చిన కళావతి ఆశ వంక చూచి విస్మితురాలయింది.

"ఏమిటది ఆశా! ఈ శుభసమయంలో కన్నీరు పెట్టుకొంటున్నావెందుకు? ప్రాణానికి ప్రాణంగా చూచుకొనే భర్తను చేపట్టబోతున్నావే! ఎంతమంది స్త్రీలకిటువంటి భాగ్యం కలుగుతుంది?" అన్నదామె.

ఆశ యిందుకేమీ జవాబు చెప్పలేకపోగా దుఃఖాన్ని నిరోధించుకోలేకపోయింది. "మోసపోయాను కళావతీ! మోసపోయాను. రత్నమేదో గాజుముక్కయేదో కనిపెట్టలేకపోయాను. నా జీవితానికిక శాంతి ఉండదు కళావతీ!" అని వెక్కివెక్కి యేడ్వసాగింది.

కళావతికేమీ పాలుపోలేదు.

"ఏమిటి ఆశా నువ్వనేది? ఇది ని యిష్టప్రకారం జరుగుతున్నదేగానీ బలవంతపు పెళ్ళికాదుగదా!"

"కాదు కళావతీ కాదు. ఇది బలవంతపు పెళ్ళి కానే కాదు. అయినా నాగొయ్యి నేనే త్రవ్వుకొంటున్నాను. నాయింటికి నేనే చిచ్చు ముట్టించుకొన్నాను"

ఇలాఅనలేక అనలేకఅన్నఆశ రెండుచేతులతో ముఖం కప్పుకొని కూలబడింది. వాకిట్లోవినిపించేపెళ్ళిపెద్దల హడావిడి

గమనించటంచేత బలవంతాన ఏడుపు నిగ్రహించుకొనడానికి ప్రయత్నం చెయ్యసాగింది. కాటుకకన్నీటితో ముఖంఅంతా మలినమై, కళ్యాణతిలకం కరిగిపోగా మూర్తీభవించినశోక దేవతలాగా రూపొందింది.

ఇంతలో వీధిగుమ్మందగ్గఱ పెద్దకోలాహలంవినిపించ సాగింది. "తన్నండి! కొట్టండి! ఊరిబైటికి తఱిమి వెయ్యండి!" అని యెందఱో కేకలు వెయ్యడం వినిపించింది. లత త్రుళ్ళిపడి అటు వెళ్ళి చూచింది. ఎందఱో పిన్నలూ, పెద్దలూ పిచ్చికుక్కను తరిమినట్లు తరుముంటే నిస్సహాయుడై దుఃఖపడుతూ వెళ్ళుతున్నాడు శైలేంద్రుడు. ఒకరిద్దరు కొంటెపిల్లలు అతనిమీదకు రాళ్లు రువ్వుతున్నారు కూడా. రాళ్ళ దెబ్బలకు అతనిముఖంమీదా, తలమీదా గాయాలు తగిలి నెత్తురు కారుతున్నది. అయినా అతను ఆ దెబ్బలను తప్పుకొనడానికి ప్రయత్నించడంలేదు; పెద్దలు ఎవరూ ఆకొంటెపిల్లలను వారించడమూ లేదు. అంతలో అక్కడికి పెండ్లికొడుకు వేషంలో వచ్చిన విలాసుడు శైలేంద్రుణ్ణి ఉద్దేశించి యిలా అన్నాడు.

"నీకు ఇటువంటి దుర్గతి సంభవిస్తుందని యేనాడూ అనుకోలేదు శైలేంద్ర! నా చేతనైనంతవరకు నిన్నుకాపాడడానికే ప్రయత్నించాను. కాని నువ్వు నిరపరాధివని చెప్పడానికి ఏ ఆధారమూ లేకపోయింది. వెళ్ళు శైలేంద్ర! వెళ్ళు! తొందరగా ఈవూరు దాటిపో! ఆలస్యంచేస్తే ఈ ప్రజలకోపం మరీ పెరిగిపోయేట్టున్నది. అప్పుడు ఏం జరుగు

తుందో ఊహించలేను. నా అశక్తతకు ఏమో. అనుకోకు శైలేంద్ర్! నువ్వు ఎక్కడైనాసరే సన్మార్గుడవనిపించుకొని సుఖంగా జీవించాలని కోరుకుంటున్నాను. నాకోరికను భగవంతుడు ఫలింపజేస్తాడని నమ్ముతున్నానుకూడా! వెళ్ళు శైలేంద్ర్! తొందరగా వెళ్ళు"

రక్తంతో, అశ్రువులతో తడిసినముఖం పైకెత్తి శైలేంద్రుడు ఒక్కసారి విలాసుడివైపు చూచాడు. ఆ చూపులో ఏ శక్తి ఉన్నదో! విలాసుడిముఖం కళాహీనమైపోయింది. ఇది అంతా గమనిస్తున్న ఆశ నివ్వెరపోయింది. అంతలో శైలేంద్రుడు చినిగిన పైబట్టతో ముఖంతుడుచుకొని మెల్లగా ఇలా అన్నాడు.

"వెడుతున్నాను విలాస్! వెడుతున్నాను. నాకోసం నువ్వేమీ దిగులుపడబోకు! భగవంతుడనేవాడేఉంటే ఇలా ఎందుకు జరుగుతుంది? నిర్విచారంగా ఉండు విలాస్! నేను కరవడంకాదు సరిగదా బుసగూడ కొట్టలేని సర్పాన్ని. మనో వ్యథే దారిబత్తెంగా, కన్నీళ్ళే పానీయంగా దూరతీరాలకు వలసపోతాను. మనిషిని మనిషి అర్థంచేసుకొని మన్నించడం సంభవమైన చోటెక్కడయినా కనిపిస్తే అక్కడే విశ్రమిస్తాను. మంచితనం అనే జలం కనబడని ప్రపంచమనే యీ పెద్దఎడారిలో నాలాంటివాడికి ఆశ్రయంఅనేదే కనిపించకపోవచ్చును. కాని జీవితకాలం ముగిసేవరకూ నా అన్వేషణ కొనసాగిస్తూనే ఉంటాను. వెడుతున్నా మరి!"

తర్వాత శైలేంద్రుడు అక్కడ ఒక్కక్షణంగూడా నిలవలేదు. తలవంచుకొని సూటిగా ముందుకుసాగిపోయాడు. ఆశ నిల్చున్నది నిల్చున్నట్లే కొయ్యవారిపోయింది.

## 6

అది శాంతిదుర్గం. అక్కడికి ఎవడో విదేశీయ యువకుడు జీవనోపాధికోసం వచ్చాడు. అతను చాలా మితభాషి. వచ్చిన క్రొత్తలో పొలాలలో కూలిపనులకు వెడుతూ, ఆర్జించినదానిలో ఎంతోకొంత మిగుల్చుకొంటూ ఒకనెల గడచేసరికి బంగారపుపని చేసుకొనడానికి కావలసిన పరికరాలు కొనుక్కొన్నాడు. ఒకరోజు సాయంకాలం ఆ ఊరి జమీందారుగారిని సందర్శించి, తాను అవలంబించుకొన్న వృత్తిని గురించి చెప్పుకొని, తనకేదైనా పని ఇవ్వవలసిందని అర్థించాడు. జమీందారుగారి కూతురికి వివాహం నిశ్చితం అయింది. సుముహూర్తం నెలరోజుల వ్యవధిలో ఉన్నది. వధువుకు ప్రాతకాలపునగలు ఎన్నో ఉన్నాయిగాని, క్రొత్త పద్ధతిలో కొన్నింటిని చేయించాలనే అభిప్రాయం జమీందారుగారికి అప్పుడే కలిగింది. ఆయన ఆ యువకుడికి తమ దివాణంలోనే బస యేర్పాటుచేసి, ముందు కొన్ని చిల్లర వస్తువులు చేయించిచూచారు. వాటినిబట్టి ఆ కుర్రవాడు బంగారపు పనిలో సమర్థుడే అని స్పష్టపడింది. తర్వాతపెద్ద వస్తువులపనిగూడా అతనికే ఒప్పగించారు జమీందారుగారు. ఆయువకుడు అవికూడా సమర్థతతో సర్వహించాడు. జమీం

దారుగారు అతనినేర్పుకు మెచ్చుకొని మంచి బహుమానం కూడా అనుగ్రహించారు. ఆనాటినుంచీ శాంతిదుర్గంలో ఆకుర్రవాడికి విరామం చిక్కనంత పనులవత్తిడీ, అందుకుతగ్గ ఆదాయమూ ఏర్పడ్డాయి.

అతను ఊరికి చిట్టచివర కొండ నానుకొని ఉన్న స్థలంలో ఒక చిన్న కుటీరంనిర్మించుకొన్నాడు. ఆ స్థలాన్ని అతనికి జమీందారుగారు తమ అనుగ్రహానికి శాశ్వత చిహ్నంగా ప్రసాదించారు. వెనుక వైపు పెద్దకొండ, మిగిలిన మూడువైపులా ఎత్తుగా ఎదిగిన మహావృక్షాలు ఉన్నాయి. ఈ సరిహద్దులమధ్య ఉన్నస్థలంలో గల తన కుటీరంచుట్టూ అతను రకరకాల పూలమొక్కలు నాటుకొన్నాడు. నూరు గజాల దూరాన కొండమీదనుంచి సర్వకాలంలోనూ జాలు వారే సెలయేటి మడుగులో నుంచి కావడితో నీళ్లుతెచ్చి మొక్కలన్నింటికీ పోసేవాడు. ఏమొక్కకు ఎటువంటిపోషణ అవసరమో తెలిసికొని ఆప్రకారం దానిని సాకుతూ కొద్ది కాలంలోనే అతను అందమైన పూదోటను సృష్టించుకో గలిగాడు. చేస్తేబంగారపుపని; లేకపోతే తోటపని. మూడవ పని అతనికిగిట్టదు. ఒక్కశాంతి దుర్గంలోనేకాక చుట్టు ప్రక్కల పదిగ్రామాలలోపల అతనివంటి సువర్ణశిల్పి లేడని ప్రఖ్యాతియేర్పడింది. చివరకు అతని యథార్థనామమేమిటో ఎవరికీ తెలిసికోవలసిన అవసరం పట్టకుండాపోయింది. 'హేమ శిల్పి' అనేదే అతనికి వ్యవహారనామంగా స్థిరపడింది.

ఇప్పుడీ హేమశిల్పి వయస్సు ముప్పైఏళ్ళకులోపే. కష్ట జీవి కావడంవల్ల అతనిశరీరం వజ్రదృఢమైన ఆకర్షణీయంగా

నిగనిగలాడుతూ ఉంటుంది. అతను మరీ పొడుగుకాని, పొట్టి కాని కాక, మధ్యమ ప్రమాణం కలిగి పీలకాని, విపరీతపు లావుకాని కానట్టి రూపంతో నలుగురిలో తన వ్యక్తిత్వం నిలుపుకోదగ్గట్టు కనిపిస్తాడు. అతను పచ్చగా దబ్బపండు లాంటి వన్నె లేకపోయినా నల్లనివాడు మాత్రంకాడు. చెప్పుకోదగ్గ అందం లేక పోయినా అనాకారికాడు.మృదువైన కంఠస్వరమూ, ప్రియమైన వాక్కూ, నిర్మలమైన మంద హాసమూ. అతనిముఖానికి ఆకర్షణ తెచ్చిపెట్టాయి. ఇన్నింటినీ మించినది అతని వినయసంపత్తి. దానితో అతనికి ఎక్కడా శత్రువనేవాడే లేకపోయాడు. అంతఃపుర స్త్రీలు ఎదురుగా నిలబడిఉన్నా కన్నెత్తిచూడని మనోనిగ్రహం స్త్రీలోకంలో అతనికి ఎంతో గౌరవాన్ని చేకూర్చింది. అప్పటికి 'హేమశిల్పి యింతవరకూ ఎందుకు వివాహం చేసుకోలేదో' అనేది ఆడపిల్లలను కన్న స్వర్ణకారులకు లోకాభిరామాయణంలో ప్రధానాంశమైపోయింది. ఎవరికివారు తలకోక విధంగా వ్యాఖ్యానించటం మొదలుపెట్టారుకూడా.

"అతను భగ్నప్రేమతో విరక్తుడై ఉంటాడు. కాకపోతే ఈ నడియౌవనంలో స్త్రీసాహచర్యం ఆశించకుండా కాలక్షేపం చెయ్యడంఏపురుషునికయినాసాధ్యమౌతుందా?"

"కొంతమందికి స్త్రీకంటెకూడా ధనమేముఖ్యంగాకనిపిస్తుంది. వివాహం చేసుకొంటే ఖర్చులు పెరిగిపోతాయి గాబట్టి, ధనం తక్కువైతే సంతోషంగా ఉండలేరుగాబట్టి వాళ్ళు వివాహం చేసుకోరు."

"అయితే హేమశిల్పి అటువంటి పరమలుబ్ధుడుకాడు గదా! అతను వివాహం మానడానికి మరొకకారణం ఏదో ఉంటుంది."

"వివాహంతో స్వేచ్ఛ కట్టుపడిపోతుందనేభయంతో కొంతమంది అవివాహితులుగానే బ్రతకదలచుకొంటారు. హేమశిల్పి అభిప్రాయంకూడా అంతేనేమో!"

"కాదు,కాదు అటువంటివాళ్ళు అవినీతుపరులై ఉంటారు. హేమశిల్పి మరి అవినీతుడు కాడుగదా!"

"కొందరికి పుట్టుకతోనే వైరాగ్యం అబ్బుతుంది. ఇతనుకూడా అలాంటివాడేమో!"

"మనం అతనికినచ్చజెప్పిఒకయింటివాణ్ణి చెయ్యాలి. సంసారి అయినంతమాత్రాన పురుషుడు మోక్షం పొందలేక పోతాడనుకోవడం భ్రమమాత్రమే అని చెప్పాలి."

"అతనికి అలా మోక్షకాంక్షఉన్నట్లూ కనబడదు. ఒకగుడికి పోవడంకానీ, తీర్థయాత్రలకు వెళ్ళడంకానీ లేదు గదా!"

"ఇదంతా ఆలోచిస్తే అతనిని ఏస్త్రీఅయినా ప్రేమించినట్లు నటించి మోసగించిందేమో అని తోస్తుంది. కాక పోతే ప్రియురాలు వివాహం కాకపూర్వమే గతించిఉండాలి. ఆ విధమైన మనోవ్యధయేదో అతనిని పీడిస్తూ ఉండబట్టే స్త్రీముఖం చూడకుండా ఉంటున్నాడు. పాపం! ఒక స్త్రీ మోసగిస్తే స్త్రీలందరూ మోసగించేవాళ్లే అనుకొంటున్నాడేమో! అతని భ్రమ నివారించాలి మనం."

పెద్దలిలా అనుకొంటూ ఉండగా ఆ కుటుంబాలకు చెందిన కన్యలుకూడా ఏకాంతంలో అతనిని గురించి తమలో తాము తర్కించుకోవడం మొదలుపెట్టారు. అతను మర్యాద తెలిసినవాడు, నీతిమంతుడు, ప్రయోజకుడు, కొంచెమో, గొప్పో రూపసంపదకూడా ఉన్నవాడై నప్పుడు అవివాహిత యువతులు అతనిని గురించి ఆలోచించకుండా ఉంటటం ఎలాగు! 'అతనిని పెండ్లాడగలిగిన దానిదే అదృష్ట'మనే భావం చాలామందికి కలిగింది. కాని వారి కోరిక ఫలించ టానికి మార్గం ఎంతకాలానికీ కనిపించకపోయింది. అతను ఏ ఆడపిల్ల ఎదురుగా కనిపించినా తలవంచుకొని ఒదిగి వెళ్ళి పోయేవాడు. అటువంటివాడ్ని ఆకర్షించి తనవైపు త్రిప్పు కోవడం కులకన్యలకు ఎలా సాధ్యపడుతుంది. ఎప్పుడైనా పండుగ పబ్బాలకు కులస్థులెవరో ఒకరు అతనిని విందుకు ఆహ్వానించినా, అతి గంభీరంగావచ్చిభోజనాలుపూర్తిఅయ్యే వరకూ ముళ్ళమీదఉన్నట్టుండి వెళ్ళిపోయేవాడతను. సొగసు గత్తెల వాలుచూపులుగానీ కిలకిల నవ్వులుగానీ, అతని కళ్ళనూ, చెవులనూ కూడా తాకలేక పోయేవి. «అబ్బే! హేమశిల్పి తను సృష్టించే శిల్పాలలో ఒక శిల్పంవంటివాడు మాత్రమే. అతనిలో శృంగార రసానికి తావేలేదు పాపం!» అని చాలామంది యువతులు నిర్ధారణ చేసుకొన్నారు. ఒక రిద్దరు కులవృద్ధులు ప్రసంగవశాన వివాహ ప్రసక్తి తీసుకొని రాగా «క్షమించండి! నాకు వివాహంచేసుకోవాలనే తలంపే లేదు. నన్ను చేసుకొని ఏ యువతి కూడా సుఖపడలేదు.» అన్నాడతను. దీనితో చాలామంది అతని వైవాహిక

సమస్యను గురించిఆలోచించించటం మానివేశారు. లభించిన వరుణ్ణజీవిత సర్వస్వంగా భావించుకొంటూఎందరో స్వకుల యువతులు అతని విషయం మరచిపోయారుకూడా.

హేమశిల్పికి ఎంత వద్దనుకొన్నా ధనం విపరీతంగా వచ్చిపడుతున్నది. "అయ్యా! నాకుఇప్పటికే పని తలమును కలుగా ఉన్నది. మరెవరిచేతనైనా మీపని పూర్తిచేయించు కోండి" అని చెప్పినా వినకుండా "నీకుతీరుబడి అయినప్పుడే చేసిపెట్టు! మావాళ్ళకు ఇంకొకరు చేసిన నగ నచ్చదు." అని బంగారం అతనివద్ద పడవేసివెళ్ళిపోయే వాళ్ళైవళ్ళైనా అతను ఉద్దేశించిన దానికంటె హెచ్చు ప్రతిఫలమే ముట్ట జెప్పేవాళ్ళు.

కళోపాసకులకు కళారాధనలో అనుభవానికి వచ్చే ఆనందం మఱి యెందులోనూ గోచరించదు. హేమశిల్పి కూడా అలాగే తన బుద్ధిబలంచేత ఎప్పటికప్పుడు రకరకాల నగిషీలతో ఆభరణాలనుసృష్టించడంలో ఎంతో ఆనందం అనుభవించేవాడు. దేవతా మూర్తులను అతి మనోహరంగా సృష్టించేవాడు. ఆమూర్తులు జీవకళవుట్టిపడు తున్నట్టుండేవి. "హేమశిల్పీ! నీకూ బ్రహ్మదేవుడికీ ఏమీ తేడాలేదు. నువ్వు చేసే సృష్టికూడా సజీవమైనట్టేభాసిస్తున్నది" అనే వాళ్ళు చాలామంది. అప్పుడతనికి కలిగే హర్షానికి పరిమితి వుండేది కాదు.

ఇక ప్రతిసాయంకాలంపూటా పూలతోటలో, పని చేసేటప్పుడున్నూ అతనికి బాహ్య ప్రపంచం స్ఫురించేది

కాదు. ప్రతిలతా, ప్రతిపత్రమూ, ప్రతిపుష్పమూ అతని కేవో రహస్యాలు చెబుతున్నట్టు కనిపించేవి. అతని చరిత్ర యావత్తూ ఎరిగి ఉన్నట్టు శిరఃకంపాలు చేసేవి. కమ్మని తావులతో రకరకాల వన్నెలతో అతనికి విందులూ, వినోదాలూ కల్పించేవి. ఒక తీగ కొంచెం వాడినా, ఒక పత్రం క్రిముల చేత జీర్ణమవుతున్నట్లున్నా, ఒక పువ్వు పరిపూర్తి వికాసం పొందక పోయినా అతని మనస్సు చివుక్కుమనేది. తోటనిండా పువ్వులు వికసించినా ఒక్కటి కోసేవాడుకాడు. ఇతరులు ఎవరైనా కోస్తారేమో అని, వారిని ఆ తోట లోనికి రానిచ్చేవాడుకాడు. వెన్నలరాత్రులలో ఆ తోట లోనే మంచం వాల్చుకొని పదివేలమంది బంధుమిత్రుల మధ్య శయనించినట్టు తృప్తిగా పరుండేవాడు.

మరి చీకటి రాత్రులలో అతనికి కాలక్షేపం మరొక విధంగా జరిగేది. శాంతి దుర్గానికి చేరుకొన్నది మొదలు కొని సంపాదించిన ధనం ఎంతఉన్నదో అని లెక్కపెట్టు కోడం కూడా అతనికి సంతృప్తి కలిగించేది. అంతేకాదు. ఆ ధనంలో ఏ నాణెం ఏవస్తువు చేసినప్పుడువచ్చిందీకూడా అతనికి గుర్తులో ఉండేది. మనస్సుకు వ్యావృత్తులు తక్కు వగా ఉన్నప్పుడు అతిపరిచితమైన దానిలో విశేష ప్రజ్ఞ అబ్బడం ఆశ్చర్యంకాదు. అలా ఆ నాణాలన్నీ సరిచూచు కొని, భద్రంగా తోలుసంచులలో పోసి మూతలు కట్టి, తలక్రింద పెట్టుకొని, కన్నుమూసేవాడు.

కొంతకాలానికి క్రొత్తసంచులు అవసరమైనాయి. అన్ని సంచులూ ధనంతో నిండిపోయాయి. అతను క్రొత్తవి కుట్టించి వాటినిగూడా త్వరత్వరగా బంగారు నాణాలతో నింపగలుగుతున్నాడు. అన్నింటినీ తలక్రిందనే ఉంచుకోవడం కష్టమనిపించింది. అందుచేత ఇంట్లోనే ఒక చిన్న నేల మాళిగ సిద్ధంచేసుకొన్నాడు. ధనపుసంచులన్నీ దానిలోకి చేర్చి వేశాడు. రాత్రిపూట భోజనం అయినతర్వాత నేల మాళిగ తెరచి సంచులన్నీ మంచంమీద పెట్టుకొని వాటి లోని ధనం యావత్తూ లెక్కపెట్టుకొని మళ్ళావాటిలోనే పదిల పరచి, నేలమాళిగలో మూసివేసి, తృప్తితో నిద్రించే వాడు.

## 7

హేమశిల్పి శాంతి దుర్గంలో నివసించడం మొదలు పెట్టిన పిమ్మట పదిహేను సంవత్సరాలు ఇలాగే గడచి పోయాయి. ఆకుటీరంలో అతనికి తోడు ఎవ్వరూ రాలేదు. ఒకళ్ళు రావాలని అతను కోరుకొన్నదీ లేదు. ప్రపంచంలో నా అనేవాళ్ళు ఎవళ్ళయినా అతనికి ఉన్నారో, లేరో! ఉన్న ట్టయితే ఈ పదిహేనేళ్ళ కాలంలో ఒక్కసారి అయినా అతనిని చూడటానికి రాక పోయేవాళ్ళేనా! అతనైనా వాళ్ళను చూడటానికి వెళ్ళకపోయేవాడా! మరి శాంతి దుర్గంలో అతనికి కావలసినంత మర్యాద అయితే ఉన్నది కాని, అతనిని ప్రేమించే హృదయంఒక్కటీ లేదు. దానికి కారణం అతనినడవడే అని చెప్పకతప్పదు. నడియౌవనంలో

తన అండ అభిలషించే ఏ కన్యనూ అతను కన్నెత్తిచూడక పోయాడు. 'ఇతడు జడుడో! యోగీశ్వరుడో!' అనియువతు లకు తోచేవిధంగా కాలంక్షేపం చేశాడు.వినోదంకోసమైనా ఎవ్వరితోనూ స్నేహబంధం పెట్టుకోలేదు. 'పని చెయ్యడమే వినోదం' అన్నట్టు ప్రవర్తించాడు. ఇక అతనికి మిత్రబృందం మాత్రం ఎలా ఏర్పడుతుంది?

పెండ్లికావలసిన స్వజాతి పురుషులలో ఒకడుగా లెక్కకు వచ్చే హేమశిల్పికి క్రమక్రమంగా ఆ పట్టికలో ప్రాముఖ్యం తేలుగుతూ తేలుగుతూ ఈనాడు స్థానమే లేకుండాపోయింది. అతనిముఖం మరీ బిగుసెక్కి మన్మథుడికి చోటులేకుండా చేసింది. వార్ధక్యదేవత కటాక్షాల మాదిరిగా తలవెంట్రుకలలో అక్కడక్కడా తెలుపు మొలిచింది. చూపులలోయువతులకుగిలిగింతలు పెట్టగల స్వారస్యంఅంత రించిపోయింది. తమఇళ్ళకు వచ్చిన అతనిని గురించి తల్లిదం డ్రులకు చెప్పే పడుచులు 'హేమశిల్పి తాతగారు వచ్చారు' అని మాత్రమే అనడం సాగించారు. ఇలావుండగా ఒకనాడు అతని జీవితాన్ని తారుమారు చేసే ఒక అద్భుత సంఘటన జరిగింది.

శాంతిదుర్గపు జమీందారు కాశీనాథుడు దాతృత్వా నికి ప్రసిద్ధిచెందిన వ్యక్తి. నూతిలో నీళ్ళుతోడుతున్న కొద్దీ క్రొత్తనీరు ఊరుతూనే ఉంటుంది. తోడితే నీరు తరిగిపోతుం దేమోనని వాడకం మానివేస్తే, పసరెక్కిపోయి ఇక ఆనీళ్ళు స్నానపానాలకు పనికిరానివైపోతాయి. ధనంకూడా ఇటువం

7)

టిదే అని ఆ జమీందారుగారికి తెలుసు. తెలిసినదాన్ని ఆచరణలో పెట్టేవాడు కావడంచేత ఆయనకు ఒక్కరోజుకూడా పశ్చాత్తాపపడవలసిన అవసరం రాకుండాపోయింది. ఆయన దాతృత్వం అతిశయించినకొద్దీ ఐశ్వర్యమున్నూ అతిశయించింది.

ఆయనకు ఇద్దరుకుమారులు. పెద్దవాడు గదాధరుడు, రెండవవాడు దామోదరుడు. వీరిద్దరూ గాక భవాని అనే కూతురుగూడా వున్నది. హేమశిల్పి శాంతిదుర్గానికి వచ్చిన క్రొత్తలోనే ఆమె వివాహం జరిగింది. తర్వాత కొద్దిరోజులలోనే ఆమె అత్తవారింటికి వెళ్ళిపోగా, తమ్ముళ్ళు అదుపూ ఆజ్ఞా లేనివాళ్ళయినారు. వారితల్లి దామోదరుడికి పదేళ్ళయినా నిండకముందే స్వర్గస్థురాలయింది. అప్పటినుంచీ భవానీ తమ్ముల మంచిచెడ్డలు విచారిస్తూ, తండ్రికి పిల్లల యోగక్షేమాలనుగూర్చిన బెంగ కలగకుండా చేసింది. ఆమె అత్తింటికి వెళ్ళడంతో ఈ అన్నదమ్ములను 'ఆఁ!' అని అదలించేవాళ్ళే లేకపోయారు.

జమీందారుగారికి దివాణపు పనులూ, ప్రజల కష్టసుఖాలూ, యాచకుల అభ్యర్థనలూ గమనించడానికే రోజుకు ఉన్న అరవై గడియలూ చాలేవికావు. ఇక ఈ కుమారుల చదువు సంధ్యలనుగూర్చి విచారించటానికి ఆయనకు తీరుబడి యెక్కడిది? గురువులు రోజూ దివాణానికి వస్తూ వెడుతూ వుంటారు. శిష్యులు నెలకు పదిరోజులే వారికి దర్శనంఇస్తారు. తక్కిన యిరవైరోజులూ 'ఈరోజు పెద్దబాబుగారు చదువు

కొనలేమంటున్నారు. అందుకని చిన్నబాబుగారుకూడా ఈ వేళకు సెలవు ఇస్మన్నారు.' అని పరిచారకులు వచ్చి చెప్పడమో, 'ఈరోజు బాబుగార్లు ఇద్దరూ పోట్లాడుకొన్నారు—కాబట్టి చదుకోరట' అని చెప్పడమో, 'ఈనాడు చిన్నబాబుగారికి మనస్సు బాగుండలేదట! అందుకని పెద్దబాబుగారు పాఠాలకు రారు." అని వినిపించడమో జరుగుతూ ఉంటుంది.

ఇలా కాలం గడవగా అన్నదమ్ముల కిద్దరికీ చదువంటడం అసంభవమైపోయింది ఇద్దరిలో పెద్దవాడుతిమ్మడికంటె కొంతకాలం ఎక్కువగా క్రమశిక్షణలో ఉన్నవాడు కాబట్టి ఒకమాదిరి పుస్తకజ్ఞానం సంపాదించాడు. అంతరంగిక ప్రవర్తన ఎలా వున్నా పదిమంది యెదట మర్యాదగా వ్యవహారించటం నేర్చుకున్నాడు. రెండవవాడు మాత్రం ఎంత దుస్సాహసానికైనా జంకనివాడైనాడు. అయితేఇద్దరూ తండ్రి ముందు పిల్లులే.

జమీందారుగారు పారలౌకిక చింత అధికమైన కొద్దీ సంసార పరిస్థితులు విచారించటం మానివేశారు. ఇరవయి ఏళ్ళవాడైనప్పనుంచీ పెద్దకొడుకు ఆస్తి విషయాలు చూచుకోవడం ప్రారంభమయింది. అయితే తండ్రి అడిగినప్పుడు లెక్కలు చూపించి ఆయన ఆమోదం పొందుతూ వుండేవాడు. చిన్నకొడుకు అన్నగార్ని అడిగి ధనం తీసుకొని సొంతఖర్చులు గడుపుకోనేవాడు. ఇప్పటికి గదాధరుడు ఇరవై

అయిదేళ్ళ వాడయినాను. దామోదరుడికి ఇరవై మూడేళ్ళు వచ్చాయి.

మనిషికి ధనం వుంటే ఎన్ని దుర్గుణాలైనా కప్పబడి పోతాయి. అతనితో చుట్టరికం కలుపుకొనడానికీ, స్నేహం కల్పించుకోడానికీ లోకులు ఉవ్విళ్ళూరుతారు కాబట్టి గదాధరుడికీ, దామోదరుడికీకూడా ఇరుగుపొరుగు జమీందారులు మా పిల్లనిస్తామంటే మా పిల్లనిస్తామని రాయబారాలు సాగిస్తున్నారు. అయితే ఆముష్మికవాంఛలో ఉన్న జమీందారుగారు ఆ రాయబారాలకు జవాబులు చెప్పేపనికూడా కుమారులకే విడిచిపెట్టారు. గదాధరుడు తనకు వచ్చిన సంబంధాలలో లక్ష్మీపురం జమీందారుగారి కొమార్తెవైపు కొంచెం మొగ్గుచూపించాడు. ఆపిల్ల కొంతవరకు చదువూ, సంగీతమూ నేర్చినదే కాక చక్కనిది. పేరుకూడా పూర్వకాల పద్ధతిలో వుండక 'నళిన' అని సరికొత్తరీతిలో వున్నది. కుమారుడు నళినను వివాహం చేసుకోదలచినట్టు విన్నప్పుడుజమీందారుగారుకూడా చాలా సంతోషించారు. ఇందుకు కారణం లక్ష్మీపురంవారికీ శాంతిదుర్గంవారికీ చిరకాలపు బాంధవ్యం ఉండటమే. ఇక దామోదరుడు ఏ సంబంధానికీ అంగీకారం చూపించలేదు. అంతమంది కన్యలలో అతనికి నచ్చిన కన్య ఒక్కతె గూడా కనిపించలేదు. అతనికి ఎలాంటిపిల్ల నచ్చుతుందో ఎవరూ ఊహించలేకపోయారుకూడా. కాబట్టి గ్రామస్తులు దామోదరుడి వివాహం విషయంలో ఆలోచనలకు స్వస్తి చెప్పారు. నళినకూ గదాధరుడికీ దాంపత్యం చాలా

ఉచితంగా ఉంటుందనీ, ఆమెవచ్చిందంటే దివాణానికి క్రొత్త వెలుగు వచ్చినట్లే అని-అనుకోవడం మొదలు పెట్టారు.

గదాధరుడు కూడా నవీనతో వివాహం నిశ్చితం అయిన తర్వాత చాలా ఉల్లాసంగ కనిపిస్తూ వచ్చాడు. అతని వేషభాషలలో నాగరికత అతిశయించింది. దానితో పాటు పెద్దమనిషితనం కూడా పెరిగింది. నవీన చాలా మిత భాషిణిమాత్రమేకాక మధురభాషిణి కూడనూ. చమత్కారంగా మాట్లాడటం ఆమెకు పుట్టుకతోనే అబ్బినట్టుంటుంది. గదాధరుడు ఆ గుణాలకు ముగ్ధుడై తానుకూడా మితంగా చమత్కారంగా, వినేవాళ్ళకు ఇంపుగొలిపే విధంగా మాట్లాడటానికి ప్రయత్నం సాగించాడు. ఈ ప్రయత్నం కొంత వరకు ఫలించిందికూడా. దివాణంలో ఉద్యోగులూ, బయట ప్రజలూ అతని విషయంలో చాటునగూడా మర్యాదగానే మాట్లాడుకోవటం మొదలుపెట్టారు. "నవీనా దేవి చలవే నేమో! పెద్దబాబుగారు చాలా మారిపోయారు. ఆమె దివాణంలో అడుగుపెట్టితే బాబుగారిలో ఇంకొంత మంచి మార్పు వస్తుందో! ఇంతకూ అటువంటి బంగారు తల్లి రాణిగా రావడం మన అదృష్టమే" అని అందరూ అనుకొంటూ వచ్చారు.

ఇటువంటి రోజులలో ఒకనాటి సాయంకాలం గదాధరుడు దివాణం పై అంతస్తుమీద ఎవరికోసమో ఆతురతతో చూస్తూ నిలబడ్డాడు. ఎప్పుడూ చిఱునవ్వుతో మెరిసే అతని ముఖం అప్పుడు ఎంతో గంభీరంగా ఉన్నది. ఒక్కొ-

కష్టంకు కొంచెం విసుగుదలకూడా తల యెత్తుతున్నట్లు ఆ చూపులు ప్రకటిస్తున్నాయి. మనస్సులోని ఆలోచనల ఛాయలు ముఖం అనే అద్దంలో ప్రతిఫలించి తీరుతా యెవరికైనా. అలా వాటిని బైటపడనివ్వకుండా కప్పిపెట్టుకోవడం ఎవరికో కాని సాధ్యపడదు.

గదాధరుడిలా అంతకంతకు క్షీణించిపోయేటర్పులో మేడమెట్లపై పు మాటి మాటికీ చూస్తూఉండగా, తూలుతున్న శరీరంతో ఎలాగో మెట్లెక్కివచ్చాడు దామోదరుడు. అతనినిచూడగానే గదాధరుడు తన చిరాకు నంతటినీ అణచుకొనడానికి ప్రయత్నిస్తూ ఇలా అన్నాడు:

"చాలా ఆలస్యం అయింది తమ్ముడుగారూ!"

"ఔను అన్నయ్యగారూ! ఆలస్యమే అయింది. క్షమించాలి."

"తమ్ముడుగారు! ఒక్కసంగతి గమనించాలి. మీ అన్నగారుకూడా సర్వస్వతంత్రులు కారు. నాయనగారికి జవాబు చెప్పుకోవాలి. ఎన్నిరోజులూ ఒక్కటే జవాబుతప్ప పని జరగడం లేకపోయేసరికి ఎంత మంచివారైనా కోపగించుకొంటారు."

"అది నిజమే అని మేమూ ఒప్పుకొంటాము. కాని మా అన్నగారు మాకు పెట్టని కోటలాంటి వారని మాకు తెలుసు. వారు ఎంత విపత్తునైనా సులువుగా ఎదుర్కోగలరు; విజయం సాధించనూ గలరు."

"తమ్ముడుగారు చాలా పొరబడుతున్నారు. ఒకప్పుడు కోట కోటగా ఉండగానే, లోపలివారు శత్రువులకు చిక్కిపోవడం తటస్థిస్తూ ఉంటుంది. అందుకు కోటను నిందించి లాభం లేదు."

"అన్నగారు బూజు చూపించి బూచి అని మమ్మల్ని భయపెట్టడానికి ప్రయత్నిస్తున్నారా యేమిటి? బాగుంది!"

ఇలా అని దామోదరుడు నిర్లక్ష్యంగా మందహాసం చేశాడు కాని గదాధరుణ్ణి ఆ చిరునవ్వు శాంతింపజెయ్యలేకపోయింది. చూపులలో అసహ్యం వ్యక్తపరుస్తూ అతనిలా అన్నాడు.

"నాయనగారు లెక్కలు చూడటం పూర్తి అయిపోయింది. మేము వారికి పైకం అప్పగించడమే ఆలస్యం. తమరు మాదగ్గరనుంచి తీసుకొన్నదేదో వారికి చెప్పివేస్తే మా మీద బరువు తప్పించిన వారౌతారు. నాయనగారు పైకంకోసం తహ తహ లాడుతున్నారు. మీరు మళ్ళీ ఇలా ధనం దుర్వినియోగం చేస్తున్నట్లు తెలిస్తే వారు చాలా ఆగ్రహిస్తారు. పర్యవసానం శుభంగా ఉండదు."

కాని దామోదరు డిందుకేమీ వెఱచినట్లు కనిపించలేదు. అతను ఒక వెకిలినవ్వు నవ్వి అన్నగారి కిలా సమాధానమిచ్చాడు.

"నాయనగారు మెచ్చేపనులు మాత్రమే చెయ్యడం మాట వచ్చినట్టయితే మనం ఇద్దరం కూడా అనర్హులమే

అయిపోతాము. అన్నగారి దాసీప్రణయం ఇంకా మాకు గుర్తులోనే ఉన్నది. అది మేము బహిరంగపరిస్తే కథ అడ్డం తిరిగిపోతుంది. నవీనాదేవి మీద ఆశకూడా వదలుకోవలసి వస్తుంది. కాబట్టి ఏదో విధంగా సర్దుకొని పోవడమే అన్న గారికి శ్రేయస్కరం"

గదాధరు డీ మాటలతో కృంగిపోయాడు. అతను దీనంగా తమ్ముడి ముఖంలోకి చూస్తూ ఇలా అన్నాడు.

"ఎలా సర్దుకొనేది! మాదగ్గఱ చిల్లిగవ్వకూడా లేదు."

"తెల్లవారకముందే గుఱ్ఱం ఎక్కి వనదుర్గానికి వెళ్ళ నట్టయితే సంతలో గుఱ్ఱాన్ని విక్రయించవచ్చును. అలా సంపాదించిన ధనం లెక్కలలో జమకట్టవచ్చును."

"కాని యీ పూట మేము ఒక నృత్యప్రదర్శనానికి వెళ్ళవలసి ఉన్నదే! తిరిగి వచ్చేసరికి చాలా ప్రొద్దుపోతుంది. వనదుర్గానికి తెల్లవాఱకుండా చేరుకోవడం ఎలాగు!"

"ఓహో! ఈ రోజు నవీనాదేవి పుట్టినరోజు పండగ కాదూ? మాకు ఆ విషయం గుర్తులో లేకుండానేపోయింది. అవును. ఆవిడతో సమావేశం కలిగే అవకాశాన్ని ఎలా వదలుకోగలరు! కాని, అన్నగారు ఒక్క విషయం జ్ఞప్తిలో ఉంచుకోవాలి! నవీనాదేవి ఏకపత్నీవ్రతం పాటించని పురుషుణ్ణి పెండ్లాడడానికి ఎన్నడూ అంగీకరించదు కాబట్టి రహస్యగోపనం చాలా అవసరం"

గదాధరుడి ముఖం కోపంతో కందిపోయింది. అతను తీవ్రంగా నేల తన్నుతూ ఇలా అన్నాడు.

"ఇదిగో రహస్యం బైటపెడతా నంటూ మాటి మాటికీ మమ్మల్ని బెదరించనక్కర్లేదు. అంత తుమ్మితే ఊడే ముక్కు ఎన్నాళ్ళు నిలుపుకొంటాం! ఈరోజే నాయన గారికి సమస్తం వినిపిస్తాం. అంతటితో మాకు తమ్ముయ్యగా రంటే భయపడే పని లేకుండా పోతుంది. తర్వాత ఏది ఎలా జరిగినా విచారపడం."

దామోదరుడు అన్నగారి కోపావేశానికి అతి నిర్ల క్ష్యంగా చిరునవ్వు నవ్వాడు.

"కోపం వచ్చినప్పుడు ఇలా అనుకోవడం మనుష్యులకు అలవాటే. కాని ఈ తెగింపు ఎంతోసేపు నిలవదు. అప్సరస లాంటి ప్రభుకుమారి అనంతమైన ఐశ్వర్యంతో చేరవస్తుంటే జారవిడుచుకోగల సాహసం వివేకవంతం కాదని అన్నగారికి మేము ఉపదేశించగలవాళ్ళం కాము. నవీనాదేవిని వదులు కొనడంతోనే సరిపోదుమరి. పిత్రార్జితంకూడా దక్కక పోవచ్చును. నాయనగారు అవినీతుల్ని ఏమాత్రం కనిక రించక పోవడం మన అనుభవంలోకివచ్చిందేగాని క్రొత్తది కాదుగదా! ఒకరి కొకరం అండదండలుగా నిలవకపోతే శాంతిమర్గం ఏ పీఠం వారి పరమో అయితీరుతుంది."

దామోదరుడు పలికినప్రతి వాక్యమూ గదాధరుడ్ని విచలితుణ్ని చేసింది. అతను చాలాసేపు దీర్ఘంగా నిట్టూ

ర్పులు విడుస్తూ కూర్చోవడం తప్ప మరేమీ చేయలేక పోయాడు. కాటువేయ వచ్చిన కోడెత్రాచును మంత్ర జపంతో కట్టివేసి మందహాసం చేసే మాంత్రికుడువాదిరిగా, క్రుద్ధగదాధరుణ్ని నాలుగు మాటలతో స్తంభింపజేసి చిరు నవ్వుతో ఆతని అవస్థను గమనిస్తూ కూర్చున్నాడు దామో దరుడు. కొంతసేపటికి గదాధరుడు హీనస్వరంతో ఇలా మాట్లాడ సాగాడు.

"మా గుర్రం ఉత్తమజాతికి చెందిందని, అటువంటిది ఈ ప్రాంతాలలో ఎప్పుడో కాని అమ్మకానికి రాదని తమ్మ య్యగారికి తెలుసు. తెలిసి కూడా దానిని అమ్మివేయవల సిందనడం వారికే తగును. అదికూడాపోతే ఇక మాది అని చెప్పుకోదగ్గ అమూల్యవస్తువేదీ ఉండదు."

దామోదరుడు చాలా సానుభూతి వ్యక్తపడేస్వరంతో అతి వినయంగా ఇలాబదులు పలికాడు. "ఆసంగతి మాకూ తెలుసు. కాని పరిస్థితులు సవ్యంగా లేనందున ఆ మాట అనక తప్పడంలేదు. కానిమేము ఒక్క హామీ మాత్రం ఇవ్వగలం. మన పంచకల్యాణికి చాలా మంచి బేరమే వచ్చితీరుతుంది. అందుకుతగ్గప్రయత్నం యావత్తు జరుగు తుంది."

"అదంతా యదార్థమే కానీ, పైకం పూర్తిగా మా చేతికి అందుతుందో లేదో అనేదే మాకు తెలియకుండా ఉన్నది."

"మంచిది. నూరు సువర్ణాలకు తక్కువ గాకుండా తను చేతికి అందుతుంది. ఆ పైన వచ్చేది ఎంత స్వల్పమైనా దానితోనే మా అవసరాలు సర్దుకోగలం. ఈ నూరు సువర్ణాలలో ఒక్కటికూడా. మాకోసం వ్యయంకాదు."

ఇలా అని దామోదరుడు తన ఆసనం మీాద నుంచి లేచి ఠీవిగా వెళ్ళిపోయాడు. గదాధరుడు అతని పోకనుగమనిస్తూ దీర్ఘ నిశ్వాసం విడిచాడు.

"అయ్యో! యూవ్వనం ఎంత ప్రమాదకరమైంది? నవీనాదేవి ముందు ఆ దాసీకన్య దిగదుడుపుకైనాపనికిరాదే అటువంటి అల్పురాలికి మేము ఎందుచేత వశపడవలసి వచ్చింది! ఒక్క క్షణం. ఆ క్షణాలో జరిగిన పొరబాటే మాకు ఏనాటికీ తీరని పరితాపానికి కారణమైపోయింది. ఆ దాసి కథే బయటపడితే ఎంత సిగ్గుచేటు! ఇటు నవీనాదేవీ, చేయిజారిపోతుంది- అటు ఐశ్వర్యమూ దూరమైపోతుంది. పై పెచ్చు బ్రతికి ఉన్నంతకాలమూ దుఃఖావమానాలతో క్రుంగిపోవలసి వస్తుంది. కాశీనాథ ప్రభువుల సంతతి ఇటువంటిదనే అపఖ్యాతిశాశ్వతమైపోతుంది. ఇంతకూ మూలం ఆ ఒక్కక్షణం-ఎంత దారుణం!"

అతని హృదయం ఇలాంటి తలపోతలతో వికలమై ఎంతసేపటికి తిరిగి స్వస్థపడకపోయింది.

౮

ఆ మరునాటి సాయంకాలం దామోదరుడు వనదుర్గం నుంచి గుర్రంఎక్కి వస్తూవుండగా వనమధ్యంలోకి వచ్చేసరికి చీకటి పడింది. చీకటితోడు ఆకాశం కారుమబ్బులతో నిండి సన్నని చినుకులు పడటం ప్రారంభమైంది. గాలి మహా వేగంతో వీస్తూ ఉండటంవల్ల చెట్లు ఊగిపోతున్నాయి ఎండుటాకులూ దుమ్మూ కలగాపులగమై ఆకాశయానం ప్రారంభించాయి. పాపం! అతనికి కళ్ళు తెరవడానికిగానీ, మూసి ఉంచడానికిగానీ వీలులేనిదురవస్థపట్టింది. అప్పుడతను ఇలా అనుకోవడం మొదలుపెట్టాడు.

"నేను ఈ అవస్థ ఎందుకు తెచ్చుకున్నట్టు! ప్రొద్దున హేమశిల్పి యింటిదగ్గర తోచినట్టు అన్నగారిని అతనిదగ్గరకు పంపించి అప్పుగా నూరు సువర్ణాలూ సంపాదించిఉంటే సరి పోయేదికదా! అతనిదగ్గర నూరు సువర్ణాలు పుట్టడం ఒక వింతకాదు. వెయ్యి అయినా పుట్టేవి. అయినా అదేమిటో అనుకొంటూ నేడూరుదాటి వచ్చాము. ఆ గంగాధరుడు తన మనిషిని ఎవరినైనా పంపగూడదా! మేమే గుర్రాన్ని ఒప్ప గించి పైకం పుచ్చుకోవాలట! ఇప్పటికే చీకటిపడ్డట్టున్నది. ఇంకా కావలసినంత దూరం పోవాలి. ఈ వాన ఒకటి ప్రాణంతీస్తున్నది. పని ఎప్పటికి పూర్తిఅవుతుందో! ఈరాత్రి అడవిలోనే చిక్కుపడటం జరగదుగదా;"

అతను ఇలా అనుకొంటూ ఉండగానే పెద్దమెరుపు మెరసింది దాని వెనకనేఆకాశం పగిలి ముక్కలవుతున్నట్టు

భీకరమైన ఉరుము వినిపించింది. తనచుట్టూ ఏదో మంట ఆవరిస్తున్నట్టు అతనికి తోచింది. ఉత్తరక్షణంలో గుర్రం కాలుజారి పడిపోయింది. అతను బోరగిల పడిపోయాడు. మోచేతులూ, మోకాళ్లూ రాళ్ళకు కొట్టుకొన్నాయి. 'అబ్బా!' అనుకొంటూ అతను ఎలాగోలేచి నిలద్రొక్కుకొని గుర్రంవైపు చూశాడు. అది చలనమే లేకుండా పడి ఉన్నది. అతని గుండెలు అవిసిపోయాయి. అది ఒక ఇరుకు లోయలో పడిపోవడంవల్ల క్రిందకిదిగి, అది బ్రతికిఉన్నదో మరణించిందో తెలుసుకొనే వీలు కనిపించలేదు. ఒక వేళ ఏదో కొనప్రాణం ఉన్నప్పటికీ దానిని అప్పుడు పైకిలాగి బ్రతికించే ప్రయత్నం చెయ్యడం కూడా అశక్యమని స్పష్టపడిపోయింది. ఎన్నడూ చెమర్చని అతని కళ్ళు జల జలా బాష్పాలు రాల్చాయి.

"అనుకొన్నదేమిటి? జరిగిందేమిటి? అన్నగారికి మేము ఏం జవాబు చెప్పగలం? పైకం లేదు సరిగదా గుర్రం కూడా పోయిందంటే పరిస్థితులు ఎలా విషమిస్తాయో? ఏది ఏమైనా కానీ! పైకం లేకుండా అన్నగారిదర్శనం చెయ్యకూడదు."

ఈ నిశ్చయానికివచ్చిన తర్వాత అతను గుర్రంవైపు తుదిసారిగా చూచి, కళ్ళు తుడుచుకొని, క్రింద పడివున్న బంగారుకొరడా అందుకొని, మెల్లగా నడవడం సాగించాడు.

కొంతదూరం వెళ్ళినతర్వాత ఆ కటిక చీకటిలో ఆశా కిరణం లాగా సన్నని దీపపు వెలుగు ఒకటి అతనికి గోచరిం

చింది. అతను దీక్షగా ఆ వెలుగునుపరికించి చూచాడు. అది హేమశిల్పి కుటీరంలోనుంచివస్తున్న వెలుగే. తలుపులు దగ్గరకువేసి ఉన్నట్టున్నాయే కాని లోపలనుండి గడియవేసి ఉంచినట్టు కనిపించడంలేదు. గాలి తాకినప్పుడల్లా రెండు తలుపులూ కదులుతున్నాయి. అలా కదులుతుండగా రెంటి మధ్యా ఏర్పడే సందునుంచే దీపపు వెలుగు సన్నని రేఖ మాదిరిగా వాకిట్లో పడుతున్నది. అప్పుడు దామోదరుడు నూతనాశతో అడుగులు తొందరగా వెయ్యడంసాగించాడు.

హేమశిల్పి ఇంకా మేలుకొనే ఉన్నాడన్నమాట! ప్రొద్దున ఎవరినికలుసుకొంటే కార్యం సానుకూలం కావచ్చు ననుకొన్నామో అతనిదగ్గరకే ఇప్పుడువస్తున్నాము. ఏమిటో ఈచిత్రం! మా సంకల్పం వృథా కాకూడదేమో! ఇతను మేము ఎదుటపడి అడిగితే కాదనగలడా! మా అండవల్ల గాదా డబ్బూ పేరూకూడా సంపాదించాడు! ఆ పరమ సత్యం మరిచి కృతఘ్నుడవుతాడా!"

వివిధ భావాలు ఈవిధంగా హృదయాన్ని చలింప జేస్తూఉండగా అతని నడక కూడా వివిధ గతులు అవలంబిం చింది. జమీందారులం ఈశిల్పిని ఆశ్రయించడమా, అనే రాజసం ఒకటీ, అవసరం ఎలా 'తీరుతుంది?' అనే బెంగ ఒకటీ అతన్ని తటపటాయింపులో పడద్రోశాయి. చివరకు అతను హేమశిల్పి కుటీర ద్వారందగ్గరనిలబడ్డాడు. అతన్ని ఏమని పిలవాలి? ఏకవచన ప్రయోగంచేస్తే అతను అసంతు ష్టుడైపోయి? లేదంటాడేమో! బహువచన ప్రయోగంచేస్తే

జమీందారీ రాజసానికి లాఘవం ఆపాదించడం అవుతుం దేమో! అతనికి కొంతసేపు ఏం చెయ్యడానికి తోచలేదు. కుటీరంలో ఉన్న శిల్పి బయటకు వచ్చేట్టుచెయ్యాలి. అతనే ముందు పలకరిస్తే బెట్టు చెడకుండా సంభాషణ సాగించ వచ్చును.

ఇలా అనుకొని అతను మెల్లగా దగ్గాడు. అబ్బ 'ఎంత చీకటి' అనుకొన్నాడు బహిరంగ స్వగతంలాగా, 'కుటీరంలో ఎవరున్నారో' అని అలాగే అనుకొన్నాడు. కాని లోపలి నుంచి 'ఎవరువారు?' అనే ప్రశ్న రాలేదు.

అతను తిన్నగా గుమ్మందగ్గరకు వెళ్లాడు. మునివ్రేళ్ళతో మృదువుగా తలుపుమీద శబ్దంచేశాడు. ఉహూఁ! లోపలినుంచి ఏగొంతూ 'ఎవరది?' అని ప్రశ్నించలేదు. అతను సాహసించి తలుపులు త్రోశాడు. అవి అతనికి స్వాగతం చెప్పుతున్నట్లు సన్నని శబ్దం చేస్తూ విడిపోయాయి. ఒక చిన్న దీపంమాత్రమే కుటీరాన్ని కనిపెట్టుకొని ఉన్నట్లు కనిపించింది. లోపల ఎవ్వరూ లేరు.

దీపానికి కొంతదూరంలో కుంపటిమీద అన్నంఉడుకు తున్నట్టున్నది. హేమశిల్పిజాడే లేదు.

దామోదరుడి మనస్సులో వెయ్యి ఆలోచనలు బయలుదేరాయి. "తలుపులుమూసి తాళం వెయ్యకుండా హేమశిల్పి ఎక్కడకు వెళ్ళిఉంటాడు? ఊళ్ళోకే వెళ్ళిఉంటే తాళం ఎందుకు వెయ్యడు? కాబట్టి ఈసమీపానికే వెళ్ళి ఉండాలి. వెళ్ళినవాడు ఇంతసేపటిదాకా రాకుండాఉండడం

ఏమిటి? చీకటిలో కాలుజారి నాగున్రం పడిపోయినట్టుగా ఏ పెద్దగోతిలోనో పడిపోయి ఉండడుగదా! పాపం! అతను అలా దిక్కులేనిచావు చస్తే అతనిధనం అంతా ఏంకావాలి? 'నా' అనేవాళ్ళు ఒక్కళ్లూ లేరుగదా! అతను పగలూ రాత్రి కష్టించి కూడబెట్టింది ఏ అదృష్టవంతుడి పాలై పోతుందో! కానీ అతను వస్తూ ఉంటాడేమో! మరికొంచెం సేపు వేచిఉంటే రావచ్చును. అందాకా వేచిఉందాం."

యిలా అనుకొని అతని కుటీరంముందు కొంతసేపు అటు ఇటూ పచార్లు చెయ్యడం ప్రారంభించాడు. తర్వాత వానలో బట్టలు తడిసిపోవటంతో చలిగాలికి వణకక తప్పని సరి అవుతుంటే లోపటకివెళ్ళి కుంపటిదగ్గర కూర్చుంటే వెచ్చగా ఉంటుందిగా! అనుకొని లోపలికివెళ్ళి నిప్పుదగ్గర కూర్చున్నారు. చలిబాధ ఉపశమించినతర్వాత హేమశిల్పి ఈ కుటీరంలో ధనం ఎక్కడ దాచిఉంటాడు? అనేప్రశ్న తోచింది. ఆ ప్రశ్నకు సమాధానం తెలుసుకొనడానికి దామోదరుడు కుటీరం యావత్తు కలయజూచాడు.

ఒకమూాల ఒకనాపరాయి కనిపించింది. 'ఒక గోతి వంటిదానిని మూసిఉంచటానికే దానిని అక్కడ ఉంచా డేమో హేమశిల్పి!' అనిపించిందిదామోదరుడికి. అవును ఆ నాపరాతిమీద ఏ వస్తువూ లేదు. మిగతా యిల్లంతా మామూలు నేలతప్ప నాపరాళ్ళు పరచిలేవు "ఏ ప్రయో జనమూ లేకపోతే హేమశిల్పి దానిని ఇంట్లో అలా పరచి ఉంచటానికి కారణం ఏమిటి? కాబట్టి హేమశిల్పి సంపాదిం

చిన ధనం అంతా ఈ రాయి అడుగునే ఉండిఉంటుంది,”
ఇలా అనుకొని అతడు రాతిని ఎత్తి చూచాడు. అతనికళ్ళు సంతోషంతో తళతళలాడాయి. కేవలం ధనం దాచుకోటానికి వినియోగపడే సంచులు గర్భవతుల్లాగా కదలలేక కూర్చునట్టు కనిపించాయి.

అప్రయత్నంగా అతని చేతులు ఆ సంచులమీద వాలాయి. రెండు చేతులతో రెండు సంచులూ తీసికొన్నాడతను. “పో! పో! ఇక నువ్వు ఇక్కడ ఉండకు” అని ఎవరో హెచ్చరిస్తున్నట్టు తోచింది. గుండెలు తీవ్రంగా కొట్టుకొంటున్నాయి. కాళ్లు వణకిపోతున్నాయి. ఎవరో వీపు మీద చెయ్యివేసి కుటీరం బయటికి నెట్టుతున్నట్టు వెలుపలికి వచ్చిపడ్డాడు. బయట వాన తీవ్రరూపం ధరించింది కన్ను పొడుచుకొన్నా కానరాని చీకటి. తడిసిన బట్టలు. భరించరాని చలి. అస్తవ్యస్తంగా ఉన్న నేల. ఇన్ని అసందర్భాలూ అతనికి ఒక లెక్కలోకి రాలేదు. అక్కర ఉన్నదానికంటె ఎన్నోరెట్లు ధనం లభించింది. ఇక కొంత శ్రమపడితేసౌఖ్యపడవచ్చుగదా! ఒక చేతిలో బంగారు కొఅడాకూడాపట్టుకోవలసి వచ్చింది. యదార్థానికి దానిమీద అతనికి పెద్ద మమకారం ఏమీలేదు. గుఱ్ఱం లేకపోయిన పిదప కొఅడా వుపయోగం ఏమిటి? కాకపోతే అది బంగారపు కొఅడా! కాని దాని విలువకంటె కొన్ని వందలరెట్లు విలువగల సొత్తు అతనికి లభించింది దానిని మోసికొని పోవడానికి రెండు చేతులూ చాలడం లేదు. అయినా అతడు దానిని విడిచిపెట్టలేదు.

కష్టంగా నేఉన్నా దానిని తీసుకొనే కుటీరం గుమ్మందాటాడు. అదే అక్కడపడిఉంటే 'దొంగజమీందారుగారి అబ్బాయే' అని లోకానికి తెలిసిపోదు మరి !

కుటీరపు తలుపులు తెరిచిఉంటే కొంతదూరంవరకూ అతనికి మార్గం కనిపిస్తుంది. అయినా అతను చీకటిలోనే పోదలచుకొన్నాడు. కానీ వెలుగును సహించలేక పోయాడు. జార చోరులకు చీకటి అంటే ప్రీతి, వెలుగు అంటే భీతి సహజం కదా! తలుపులు బాగా దగ్గఱకులాగి మరీ వెళ్ళి పోయాడు దామోదరుడు.

౯

దామోదరుడు వెళ్ళిన అయిదు నిమిషాలకే హేమ శిల్పి తన కుటీరానికి తిరిగివచ్చాడు. వందగజాల దూరాన ఉన్న ఒక యింట్లో నగ ఒకటి ఒప్పజెప్పవలసి ఉండడంవల్ల అతను 'ఇప్పుడే రావచ్చునుగదా! ఇంత మాత్రానికి తలుపులు తాళంవేసి పోవడం దేనికి?' అనుకొన్నాడు. 'దొంగ ఎవడో ఇంట్లోపడి ధనం దోచుకొని పోతాడేమో!' అన్న సందేహం అతనికి కలగనేలేదు. వయోధర్మం చేత శరీరానికి నడకవల్ల శ్రమ కలిగినా, అతని మనస్సుమాత్రం తేలికగానే ఉంది. నగ అందు కొన్న ఇంటి ఆవిడ మజూరీ. లెక్క ప్రకారం ఇవ్వడమే కాకుండా "బాబాయీ! ఈ అరిసెలు పుచ్చుకోండి! మిమ్మల్ని చూస్తే, మా నాన్నగారిని చూచి నట్టే ఉంటుంది నాకు. పాపం! ఈ వయస్సులో మీకు

ఇష్టమైంది చేసిపెట్టేవాళ్ళు ఎవళ్ళూ లేరుగదా!" అని పంచదారా, నేతిలో వండిన అరిసెలు అరడజను పొట్లం కట్టి ఇచ్చింది. ఆమె చూపిన ప్రీతి అతనికి అమితమైన ఆనందం కలిగించింది. "నాకు ఒక కూతురు ఉంటే, ఇలాగే ఏదో ఒక భక్ష్యం చేసి పెట్టేదికదా! అయినాఅలా చింతపడడం దేనికి? ఎవరో ఒక పుణ్యాత్మురాలు నన్ను చూచి జాలిపడుతున్నది. ఈ జన్మానికి ఇంతే చాలు" అనుకొంటూ అతను ఉల్లాసంగా ఇంట్లోకి వచ్చి కుంపటి మీద ఉడికిన అన్నంచూచి తృప్తి పడ్డాడు. "కొంచెం ఉమ్మగిల్లితే చాలు-అన్నం పెట్టుకొని తినవచ్చును. అంతవఱకూ ఏ పనీ లేకుండా కూర్చోవడం దేనికి? ఆవిడ ఇచ్చిన పైకం నేల మాళిగలో భద్రం చేసుకోవచ్చును." అనుకొని అతను లాంతరువత్తి హెచ్చించి నేలమాళిగ దగ్గరలో పెట్టుకొన్నాడు. ఆ నాపరాతిమీద పడ్డ ఇసుక అంతా ఊడ్చివేశాడు. 'ఈ ఇసుక రాతిమీద ఎలా పడింది?' అనే ఆలోచనే రాలేదతనికి. మెల్లగా నాపరాతిని పైకి తీసి గోడకు ఆన్చి, నేలమాళిగవైపు చూపు సారించాడతను.

అక్కడ ఏమున్నది? ధనాగారం బావురు మంటున్నట్టున్నది. అతని గుండెలు అవిసిపోయాయి. లాంతరు నేల మాళిగ లోపలికి దించి చూచాడు. చేతులతో క్రింద నేల అంతా తడవి చూచాడు. వట్టి నేలా, ఇంత ఇసుకా తప్ప మరేమీ కనిపించలేదు. "సంచులు ఏమైనాయి? రాత్రి పైకి తీసి చూచినప్పుడు వాటిని బైట నేశించి మరచిపోలేదుగదా!"

అనుకొంటూ లాంతరుతో బైటకి వచ్చాడు. ఇల్లంతా తిరిగి చూచాడు. ఎక్కడా సంచులు కనిపించలేదు. అతని ఆందోళన అంతులేకుండా పెరిగిపోయింది. "ఎవడో దొంగ వచ్చాడేమో! వాడు నా నేలమాళిగలో ధనం ఉండటం ఎలా తెలుసుకొన్నాడో! వాడికి వినాశకాలం వచ్చి ఉంటుంది. లేకపోతే ఇంత సాహసం ఎలా చేస్తాడు! వాణ్ని నేనుకనిపెట్టలేనా! హేమశిల్పిఅంటే బుద్ధిహీనుడనుకొన్నాడేమో! వాడి జాడలు తీసి, నా సొమ్ము మళ్ళీ నేను రాబట్టుకోలేనా! ఎలా చిక్కకుండా పోతాడో చూస్తాను" అనుకొంటూ అతను లాంతరు తీసుకొని గుమ్మం బయటకు వచ్చాడు. కాని అప్పటికి వర్షం మరీ తీవ్రంగా కురుస్తూ ఉండడంతో గుమ్మం ముందు నీళ్ళు తప్ప ఎవరి అడుగు జాడలూ కనబడలేదు.

అతను మళ్ళీ ఇంట్లోకి వచ్చాడు. తనను నోరు తెరచి వెక్కిరిస్తున్నట్లున్న నేలమాళిగను చూచాడు. అడుగంటి మాంసువాసన వస్తున్న అన్నాన్ని చూచాడు. "దుర్మార్గుడా! నా ధనం అపహరించి బాగుపడతావా! నువ్వు ఏమూల దాగినా పట్టించి తీరుతాను. లేకపోతే నాపేరు హేమశిల్పి కానేకాదు" అనుకొంటూ అతను కోపంతో కందిపోయిన ముఖంతో, మనస్సులాగానే భగభగ మండుతున్న లాంతరుతో వీధిలోకి వచ్చాడు. ఆ ఆవేశంలో అతను గొడుగు తెచ్చుకోలేదు. తలుపులు మూసి తాళం వెయ్యలేదు. అడుగడుగునా జారిపడుతూ, బురద కొట్టుకొన్న బట్టలతో అలాగే పరుగెత్తడం ప్రారంభించాడు.

వనదుర్గంలో రచ్చచావడి ఎప్పుడూ జనంతో కిటకిట లాడుతూ ఉంటుంది. వృద్ధులందరికీ అది సమావేశమందిరం. ముఖ్యంగా చతురంగ ప్రియులు అక్కడ రాత్రి పది-పద కొండు గంటలవరకూ ఆటలతో కాలక్షేపం చేస్తూఉంటారు. చతుర్ముఖ పారాయణ పరాయణులయిన యువకులున్నూ అలాగే చీట్లపేకతో రాత్రి చాలా పొద్దుపోయే వరకూ అక్కడే కూర్చునిఉంటారు పైగా పొరుగూళ్ళనుంచి వచ్చి పోయే బాటసారులకున్నూ అదేవిశ్రాంతిమందిరం. ఊరంతా మాటుమణిగినా అక్కడమాత్రం సందడిగానే ఉంటుంది అక్కడికి వెళ్ళినట్లయితే పదిమందికీ తనవిపత్తు చెప్పుకోవచ్చు ననీ, వారి అండతో సలహాతో తాను తన ధనాన్ని తిరిగి రాబట్టుకోవచ్చుననీ ఊహించి తిన్నగా అటువైపు పరుగు దీశాడు హేమశిల్పి.

అక్కడ రచ్చచావడిలో వాన మూలంగా ఎక్కువ జనంలేరు. ఉన్న కొద్దిమందిలోనూ చాలామంది అన్య గ్రామాలవాళ్ళు. చెవుగుడు అడుతున్నట్టున్న చలిగాలికీ, చాదికొట్టుతున్నట్టున్న వానజల్లుకూ అందరూ ముసుగులు పెట్టుకొని వానజల్లు తగలనిచోట కూర్చుండి కాలక్షేపానికి కబుర్లు చెప్పుకొంటున్నారు. సంభాషణ క్రమంగా దయ్యాల మీదకు మళ్ళింది.

"దయ్యాలనేవి లేనేలేవు. మన భయమే మనకు పెద్ద దయ్యం" అన్నాడొకడు. దానితో శ్రోతలు ఒకరితర్వాత ఒకరు తను అనుభవాల్ని వకరవు పెట్టటం సాగించారు.

“ఇది వినండిమరి! దయ్యాలంటూ ఉన్నాయని మీరే ఒప్పుకొంటారు. మా బంధువులపిల్లవాడొకడు మా ఊళ్లో పొట్ట పోసుకొందామని వచ్చాడు. వాడికి అప్పటికి వివాహమయింది. కాని భార్యకాపరానికి రాలేదు. నవయౌవనంతో మిడిసిపడుతున్నాడు వాడు. చాయ నలుపైనా కనుముక్కుతీరు బాగుంటుంది. ఒకరోజు రాత్రి వాడు పదిగంటలు దాటిన మీదట ఒంటరిగా బైటికి వెళ్ళాడు. వాడు వెళ్లినచోట పెద్ద మఱ్ఱిచెట్టుంది దానికి దయ్యాలమఱ్ఱి అనే ప్రసిద్ధి ఉంది. వీడు అక్కడికి వెళ్ళినప్పుడు ఏం జరిగిందో కానీ ఇంటికి రాగానే విరుచుకొని పడిపోయాడు. కంగారుగా నలుగురూ వెళ్లి చూచారు. నోటివెంట నురుగులు వస్తున్నాయి. ఏదైనా పురుగుముట్టుకొన్నదేమో అనిభయపడ్డారు. గబగబా ఒకరు పోయి మంత్రగాణ్ని పిలుచుకొనివచ్చారు. అతనికి భూతవైద్యం కొంచెం తెలుసు. పిల్లవాణ్ణి చూస్తూనే ‘ఇది గాలిచేష్టగాని, పాము కరవడం కాదు’ అని ఏదో భూతచికిత్స ప్రారంభించాడు. అంతలో పిల్లవాడు లేచికూర్చొని “ఎవరా? నా మీదకే వస్తున్నావా? నీకొంప సర్వనాశనం అవుతుంది. జాగ్రత్త” అని హుంకరించాడు. అప్పుడేం చెప్పను! అంత చక్కనివాడా ఆ పిల్లవాడు! ఎర్రగా మెరిసే కన్నుల్తో, పటపటలాడేపళ్ళతో, బుసలుకొడుతూ మహాభయంకరంగా కనిపించాడు. నాకుమాత్రం అప్పటివరకు దయ్యాలమీద నమ్మకంలేదు. ‘అన్నీ వేడికావులే!’ అని ఆ పిల్లవాణ్ని పట్టుకోబోయాను. వాడు ఒక్కవిదిలింపు విదిలించేసరికి వెళ్ళి రోటి

మీదపడ్డాను. మోకాలు విరిగినట్టయింది. నిజానికి వాడు నాతో బలంలో సరితూగేవాడుకాదు. అల్లాంటి వాడిముందు నేను నిలబడలేకపోయానంటే వాడిది దయ్యంబలంకాదూ?

సరే! అదల్లా ఉంచండి! మంత్రిగాడు కంగారుపడి 'ఇదేదో అసాధ్యంగా కనిపిస్తున్నది. గట్టివాళ్ళను ఎవరైనా పిలిపించండి' అని చెప్పి తోక ముడిచాడు. మాలో ఎవరికీ ఏమీ తోచలేదు. ఆ పిల్లవాడి తండ్రి భూతవైద్యుడే. కాని ఆయన ఎక్కడో అరవై మైళ్ళ దూరంలో ఉన్నాడు. పిడి పరిస్థితి భయంకరంగా ఉంది. కొంతసేపు కాళ్ళూ చేతులూ నేలకేసి కొట్టుకొంటున్నాడు. 'దాహం దాహం' అంటూ పావుగంట పావుగంటకూ చెంబెడు చెంబెడు నీళ్లు తాగుతున్నాడు. అటు తండ్రికి కబురుచేస్తూనే ఇటు ఏ పెద్ద డాక్టరుకైనా చూపించడం మంచిదని నిశ్చయించా మందరమూ. మాఊరికి పదిమైళ్ళదూరంలో ఉంది బెజవాడ. ఒక గుర్రపుబండి మాట్లాడుకొని పిల్లవాణ్ణి అందులో ఎక్కించి తీసుకొనిపోయాము.

చూడండి! బెజవాడలో డాక్టర్లకేం కొరతలేదుగదా! ఎంతోమందికి చూపించాము. ఎవ్వరూ కూడా ఈ పిల్లవాడి కిదీ జబ్బు అని చెప్పలేకపోయారు. ఎవరిమందువల్లా ఏ ప్రయోజనమూ కనిపించలేదు. రెండురోజులు నానాఅవస్థలూ పడ్డాము. అప్పటికి పిల్లవాడి తండ్రి వచ్చాడు. వస్తూనే వాడి చేతికి ఏదో గుడ్డపీలిక బిగించాడు. అందులో ఏముందో మరి!

అంతవరకూ నలుగురు పట్టుకొన్నా విడిపించుకొని పోయే వాడు కిమ్మనకుండా పడుకొన్నాడు.

తర్వాత వారంరోజులు జరిగింది భూతవైద్యం. చివరి రోజున వాడు తిన్నాడండీ అన్నం! పదిమందికూడా తినలేనంత. అది తిన్న తర్వాత వీధిలోకి తీసుకొచ్చాం వాణ్ని. వాకిట్లోకి రాగానే "పోతున్నా పోతున్నా" అంటూ విరుచుకొని పడిపోయడు వాడు. పది నిముషాలకు కళ్లు తెరచి చూచాడు. "ఏమిటిది? ఇక్కడ పడిఉన్నా నేమిటి?" అనుకొంటూ మావంక చూడడానికి సిగ్గుపడుతూ లేచి కూర్చున్నాడు. వంచినతల ఎత్తితే ఒట్టు. నిజంగా వాడంతసిగ్గరి. పది మాటలకు ఒక్కటీ అరా మాట్లాడేవాడు. పరుషమైనమాట నోటివెంట వచ్చేదికాదు. అలాంటి వాడెలా అయ్యాడో చూడండి. ఒళ్లు తెలిసేసరికి సిగ్గుపడడమూ మరి!

మళ్లీ వాడు యథాప్రకారంగా మర్యాదగానే నడిచాడు. ఇప్పుడు హాయిగా వాడి బ్రతుకు వాడు బ్రతుకుతున్నాడు. 'ఆ, భూతంలేదు గీతంలేదుపొ'మ్మని మన యింగ్లీషు డాక్టర్లకే ఒప్పగిస్తే వాడిబ్రతుకు ఏమైపోయేదో!

మరొకడిలా చెప్పాడు.

"ఇది మరెవరి మాటాకాదు. నాకళ్ళారాచూచింది. తల్చుకొంటే ఇప్పటికీ కళ్లకు కట్టినట్టే ఉంటుంది.

అప్పుడు నాకు పదహారోయేడు. భయమంటే ఏమిటో ఎరుగనివాణ్ణి నేను. మా ఊళ్ళో చెరువుగట్టున ఒక పురాతన గృహం ఉన్నది. దానిని బాటసారులు తలదాచుకొనే

నిమిత్తం ఎవరో పుణ్యాత్ములు కట్టించారట! దానికి ఒక తలుపుగానీ, కిటికీగానీ లేదు. లోపలికి వెళ్ళడానికి వీలుగా వసారావైపునుంచి హాలులోకి ద్వారం లాంటది ఉన్నది. నాకు తెలిసినప్పటినుంచీ అందులో బిచ్చగాళ్ళు తప్పితే మరెవరూ బస చేసేవాళ్ళు కారు. అందువల్ల దానికి బిచ్చగాళ్ళసత్రం అని పేరు పడిపోయింది. ఆ బిచ్చగాళ్ళలో స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ అనే భేదాలు మాత్రమే కాక త్రాగుబోతులూ, తగాదాకోరులూ, దురుసు నోటివాళ్ళూ అనే రకరకాలవ్యక్తులుకూడా ఉండటంచేత మర్యాద కల వాళ్ళు ఎవళ్ళూ ఆసత్రంవైపు వెళ్ళేవాళ్ళు కారు. అదిఎప్పుడైనా ఖాళీగా ఉంటేమాత్రం ఎవరైనా పిల్లలు చాటుగా చీట్లపేక ఆడుకోటానికి, బీడీలు కాల్చటానికి దానిని వినియోగించుకొనే వాళ్ళు. నాకు ఈ రెండు అలవాట్లూ లేనందువల్ల చాలా రోజులవరకూ ఆ సత్రంలోపలికి వెళ్ళే అవసరం కలగలేదు. చివరికొకసారి నా స్నేహితుడొకడు తనకోసం అక్కడికి ఒక నిర్ణీత సమయానికి రావలసిందని కోరడంచేత నే నా సత్రంలో ప్రవేశించవలసి వచ్చింది. ప్రవేశించాను. మిత్రుడి అభ్యర్థనవల్ల కొంతసేపు అక్కడే కూర్చున్నాను.

మిత్రుడు ఎంతసేపటికీ బయల్దేరలేదు. పేకాట పిశాచంలాంటిదని మీకు తెలుసుగా. 'ఇదిగో ఇదిగో!' అంటూనే మూడుగంటలసేపు కూర్చోబెట్టాడతను. అప్పటికి సాయంకాలమయింది. సత్రంలో క్రమంగా వెలుగు సన్నగిలిపోతున్నది. మనస్సులో ఉల్లాసమూ తరిగిపోతున్నది.

మిత్రుడిపట్ల ఉండే ఆత్మీయత ఒకవైపూ, చల్లగాలికి ఏతోటల వైపో తిరిగి వద్దామనే అభిలాష ఒకవైపూ పట్టి లాగుతూ ఉంటే నిస్సహాయుణ్ణయి పైకప్పు పరికించటం మొదలు పెట్టాను. హఠాత్తుగా గోడపైన ఒక నల్లటిచెయ్యి కనిపించింది. ఏ మానవహస్తమూ అంత పెద్దదిగా ఉండదు. మీ జెయ్యి అంతా రోమాచ్ఛాదితంగా ఉన్నది. విస్మయంతో 'ఏమిటది?' అన్నమాటలు హఠాత్తుగా నానోటినుంచి వెలువడ్డాయి. ఏమిటేమిటంటూ నలుగురూ తలలెత్తారు 'అదిగో' అని ఆచెయ్యివైపు వేలుపెట్టి చూపాను, 'అమ్మో' అంటూ పేకముక్కలక్కడే విడిచి పరుగెత్తారందరూ. నా మిత్రుడు నన్ను చెయ్యిపట్టుకొని యీడ్చుకొని పోయాడు బైటికి. సత్రంనుంచి ముప్పై నలభై గజాలు దూరానికివెళ్ళి జనంలోపడ్డ తర్వాత గాని ఆగలేదు ఎవళ్ళూనూ. రోడ్డుమీద వెళ్ళేవాళ్ళు 'ఏమిటేమి'టంటూ మా చుట్టూ మూగారు. "అదే అదే లంబాడీ దయ్యం! ఈ చెరువులో పడి చచ్చిందటాకే అదే. ఆ గోడమీదనుంచి చెయ్యి ఊపుతోంది." అని ఒక్క బిగువున అన్నారువీళ్ళు. అప్పటికి గాని అదిలంబాడీదయ్యపు చెయ్యిఅని తెలిసిరాలేదు నాకు. ఆ చెరువులో ఎప్పుడో ఒక లంబాడీది బలవంతపు చావు చచ్చిందనీ, చచ్చిదయ్యమై ఆ సత్రాన్ని ఆశ్రయించి ఉంటున్నదనీ యువకులైనా ఒంటరిగా అక్కడికి పోతే పట్టుకొంటున్నదనీ అక్కడివాళ్ళ మాటలవల్ల తెలుసుకొన్నాను.

చాలామంది అనేదేమిటంటే అక్కడ దయ్యం ఉంటుందని విని భయపడ్డవాళ్ళకే దయ్యం కనబడుతుందనీ వాళ్ళనే అది పట్టుకుంటుందనీనూ. మరి అక్కడ దయ్యం ఉందని నేను అప్పటికి విననూ లేదు; దానిని తల్చుకొని భయపడనూ లేదు గదా! ఆ దయ్యపు చెయ్యి నాకు ఎందుకు కనిపించిట్టు? పోనీ నాది భ్రాంతి అనుకొందాం. తక్కిన వలుగురిదీ కూడా భ్రాంతేనా! ఏ భ్రాంతికయినా ముందు భావనఉండాలిగదా! ఆ భావన నాలో లేకుండానే భ్రాంతి ఎలాకలిగింది? ఇందువల్ల నేననేదేమిటంటే దయ్యాలనేవి నిజంగానే ఉన్నాయి. అయితే అవి అందరిజోలికీ రావు. వాటికి కావాలనుకొన్న వాళ్ళమీదకే అవి పోతాయి."

ఇంకొకడిలా అన్నాడు.

"ఔను అందరిజోలికీ అవెందుకు పోతాయి? కామినీ భూతాలయితే ఎర్రగా బుర్రగా కనిపించిన కుర్రవాళ్ళనే పట్టుకొంటాయి. తిండికి మొహంవాచి చచ్చినవైతే భాగ్యవంతుల్నే పట్టుకొంటాయి. కాని దయ్యాలన్నీ భయంకరంగా ఉండవు. కామినీగ్రహాలు చాలా అందంగా ఉంటాయి. అవి ఏ రాణివాసపు స్త్రీలమాదిరిగానో కనిపిస్తాయి. వాటిని దయ్యాలని అనుకోనేలేం."

"అయితే మనకు కనిపించింది దయ్యమో మనిషో తెలుసుకోటానికి మార్గంలేదా?" అని అడిగాడొకడు.

"ఎందుకులేదూ? అవి ఎంతరూపం మార్చుకొన్నా వాటి పాదాలుమాత్రం వెనక్కుతిరిగి ఉంటాయి."

అని ఎవరో అంటూఉండగా గుమ్మంముందుఎవరో పడిపోయినట్టు చప్పుడయింది. చకితులై అందరూ అటు చూచారు. గుడ్డిదీపపు వెలుగులో తటాలున లేచి తూలి పోతున్న ఆ వ్యక్తిని చూడగానే వారి పై ప్రాణాలు పైనే పోయినట్లయ్యాయి. బూచిలాగా రోమాలు పెరిగినముఖంతో తడిసి నీళ్ళోడుతున్న శిరోజాలతో బురదగొట్టుకొన్న బట్ట లతో ద్వారబంధం పట్టుకొని ఊగిసలాడుతున్న ఆ వ్యక్తి దయ్యమే అయిఉంటుందని తోచింది వారికి. భయావేశంతో కొంతమందికి అరవడానికి గొంతుకూడా స్వాధీనంకాక పోయింది; కొంతమందికి తలవెంట్రుకలు చివాలున లేచి నిలబడ్డాయి.

పాపం! ధనంపోయిందన్న దుఃఖంవల్లనూ చాలా దూరంనుంచి పరుగెత్తుకు వచ్చినందువల్లనూ హేమశిల్పి కూడా కొంతసేపటివాకా ఏమీ మాట్లాడలేకపోయాడు. అతనివంక వాళ్ళూ, వాళ్ళవంక అతనూ ఎగాదిగాచూడటం తప్ప మరేమీజరగలేదు. కొంతమంది లోలోపల ఆంజనేయ దండకం వల్లెవెయ్యడం సాగించారు. "ధూత్! చలో! హాం ఫట్! నిన్ను మారణంచేస్తా" అనే బెదిరింపుమాటలుఅంటే దయ్యం పారిపోతుందని విన్నవాళ్ళు కొందరు 'ధూత్' అనే పదంలో మొదటి అక్షరం మాత్రమే ఎలాగో అని, మిగతా శబ్దజాలం ఒక్క ఆరున్నొక్కరాగంతో సరిపెట్టారు.

వారి ఆక్రందనాలకు ఇరుగుపొరుగుల ఇళ్ళలోనివారు అందరూ లేచారు. లాంతర్లతో, కర్రలతో వీధిలోకి వచ్చి

చూచారు. క్షణంసేపు వారున్నూ నిశ్చేష్టులైనారు. అతంలో హేమశిల్పిని బాగా ఎరిగిఉన్న నీలాకాంతుడు మనస్సు అదుపులోకి తెచ్చుకొని "ఏమిటి విశ్వకర్మగారూ! మీకు ఏం కావాలి? ఇంతరాత్రివేళ ఎందుకిలా పరుగెత్తుకువచ్చారు!" అని అడిగాడు.

అప్పటికి హేమశిల్పికి మాట్లాడేశక్తి వచ్చింది. కాని దుఃఖంవల్ల ఆ మాటలు స్పష్టంగా ఉండలేదు. "కొంప పోయింది నీలాకాంతబాబూ! కష్టార్జితం అంతా పోయింది. దొంగలు పూర్తిగా ఎత్తుకుపోయారు బాబూ! ఇప్పుడే! ఇప్పుడే! ఇటో అటో వెళ్ళారు. వాళ్ళ శ్రాద్ధం పెట్టుకొన్నారు"

హేమశిల్పి మాటలు అన్నీ వినబడకపోయినా, విన్నవాటినిబట్టి అతనికి తటస్థించిన ఆపదను గ్రహించగలిగాడు నీలకాంతుడు. అతను జాలితో కరిగిపోయాడు. తన ప్రక్కనే ఉన్న గోవిందుణ్ని చూచి "గోవింద్! మన విశ్వకర్మగారికి దుఃఖంతో మాటగూడా సరిగా రావడంలేదు. ఎలా వణికిపోతున్నాడో చూడు! వానలో తడిసి ముద్ద అయిపోయాడు పాపం! కళ్ళు ఎర్రగా నిప్పులమాదిరి కనిపిస్తున్నాయి. జ్వరం వచ్చిందేమో చూడు!" అన్నాడు. గోవిందుడు హేమశిల్పి శరీరం తాకి చూచాడు. 'ఒళ్ళు వెచ్చగాలేదు బాబూ!' అని అతను నీలకాంతుడితో అంటూఉండగా, హేమశిల్పి ప్రార్థనా స్వరంతో 'గోవింద్!' అని మళ్ళీ ఆగిపోయాడు.

గోవిందుడు అతని దీనతకు ద్రవించి కంపితస్వరంతో “ఏమిటి బాబూ!” అని ప్రశ్నించాడు.

“గోవింద్! నిజంచెప్పు! నాడబ్బు నువ్వు తియ్య లేదూ? ఎవరితోనూ చెప్పనుగా! నాపైకం నాకు ఇవ్వు బాబూ! అందులో ఒక సువర్ణం నీకు బహుమతిగా ఇస్తాగా! ఏం? ఏ మంటావు? చెప్పవు గోవింద్! నిజం చెప్పవూ?”

హేమశిల్పి యిలా అడిగేసరికి గోవిందుడి కళ్ళుచింత నిప్పులయ్యాయి.

“ఏమిటయ్యా నువ్వనేది! నీసొమ్ము నేను ఎత్తుకు పోయానా! మాటలు జాగ్రత్తగా రానియ్యవయ్యోయ్! గోవిందుడంటే ఏమిటని నీ వుద్దేశం?”

క్రోధంతో నిలువునా కంపించాడు గోవిందుడు. కాని హేమశిల్పి సందేహం అలాగే ఉండిపోయింది. అతనువేదో అనబోతుంటే నీలకాంతుడు అతనిని చెయ్యిపట్టుకొని ఒక చోట కూర్చోపెట్టాడు. సానుభూతి ఉట్టిపడే స్వరంతో “విశ్వకర్మగారూ! మీరు గోవిందుణ్ని నిష్కారణంగా అనుమానిస్తున్నారు. అతను ఈ సాయంకాలంనుంచీ నాదగ్గరే ఉన్నాడు. మీరు అలా ఎందుకు అనుకొంటున్నారో నాకు తెలియడంలేదు. అసలు దొంగతనం ఎప్పుడు జరిగిందో, మీకు ఎప్పుడు తెలిసిందో, ఎంతసొమ్ము పోయిందో వివరంగా చెప్పండి!” అని అడిగాడు.

హేమశిల్పి జరిగిందంతా చెప్పడం మొదలుపెట్టాడు. మధ్యమధ్య ఎవరో ఒకరు ఏదో ఒక ప్రశ్నవేస్తూ ఉంటే

అతను ఓపికగా అందరికీసమాధానాలు చెబుతూ వచ్చాడు. దానితో శ్రోతలు అందరూ అతనికి కలిగిన నష్టానికి జాలి పడ్డారు. అలా వారు సానుభూతి చూపుతున్నకొద్దీ అతనికి కొద్దికొద్దిగా దుఃఖం ఉపశమిస్తున్నట్టు తోచింది. పదిమంది జాలిపడేవాళ్ళుంటే దుఃఖభారం తగ్గడం సహజమేగా! చివరకు నీలకాంతుడు ఇలా అన్నాడు.

"విశ్వకర్మగారూ! మీయింట్లో దొంగతనం చేసిన వాడు మరెవడో అయిఉంటాడు. గోవిందుడు మాత్రంకాదు. అతన్ని అనుమానించకండి! ఇందుకేనేమో అంటారు; 'సొమ్ము ఒకచోటఉంటే, అనుమానంమరొకచోటఉంటుం' దని."

హేమశిల్పికి నీలకాంతుడి మాటలతో పశ్చాత్తాపం కలిగింది. అతను గోవిందుణ్ణిచూచి "గోవింద్! నువ్వు తరుచూ మాయింటికి వచ్చేవాడివి. అందువల్ల నువ్వే తీశా వేమో అనే సందేహం కలిగింది నాకు. ఒకవేళ వేళాకోళా నికే తీశావేమో అనికూడా అనిపించింది. డబ్బుపోవడంతో నాకు మతిపోయినట్లయింది గోవింద్! అందుచేతనే అలా అడిగాన్నిన్ను, ఏం అనుకోకుసుమా! మరి నేను ఎవరినీ నిందించను. కాని, దొంగను పట్టుకు తీరుతాను. న్యాయార్జి తం నాది. అది ఇంకొకడికి ఎన్నటికీ దక్కదు. ఏదో ఒక రోజుకు అది నాదగ్గరకు రావలసిందే" అన్నాడు.

అతని మాటలు ముగియగానే ఒక శ్రోత యిలా ప్రశ్నించాడు. 'ఇంతకూ పోయినసొమ్ము ఏమాత్రమండీ!'

హేమశిల్పి ఆ ప్రశ్నకు బరువుగా నిట్టూర్చాడు. "ఒకటా రెండా బాబూ! మూడువందల కాసులు. నిన్న రాత్రే లెక్కపెట్టాను" అన్నాడు.

"మూడు వందలకాసులు! అన్నీ కాసులేనా!" అని మరొక శ్రోత ప్రశ్నించాడు. అంతలో నీలాకాంతుడు ఇలా అన్నాడు. "ఏం? మూడువందల కాసులు మోసుకుపోలేడా ఒకమనిషి? విశ్వకర్మగారూ! ఇంతచీకట్లో వానలో మీరు ఒక్కరూ గక్షకభటాధికారి ఇంటికి ఎలాపోతారు! నేనూ, గోవిందుడూ కూడా వస్తాం పదండి!"

హేమశిల్పి కృతజ్ఞతతో అతనివైపుచూచినిలబడ్డాడు. నీలకాంతుడూ గోవిందుడూ కూడా లేచారు. ముగ్గురూ రక్షకభటాధికారి యింటికి బయలుదేరారు.

## ౧౦

గదాధరుడు ఆ రాత్రి తమ్ముడు రానందుకు అంతగా విచారించలేదు. పంచకల్యాణిని అమ్మడం అంత తొందరగా జరిగేపని కాదనిఅతనికితెలుసు! ఎవళ్ళో లక్షాధికారులుగాని అటువంటి అశ్వరత్నాన్ని కొనడానికి సాహసించరు. కాబట్టి దామోదరుడు మంచిబేరం వచ్చేవరకూ ఆగకతప్పదు. అదీ గాక అతనికి మరో మిత్రుడెవడైనా కనిపిస్తే ఇక్కడ అన్న గారిపరిస్థితి ఏమైపోయినాసరే అమిత్రుడేమో, అతనేమో!

తమ్ముడి నడవడి గురుకువస్తే గదాధరుడు చాలా చిరాకుపడవలసిందే. అయితేసవీనాదేవితో ంతవరకుగడిపి

రావడంవల్ల అతని మనస్సులో ఆలావణ్యవతే సాక్షాత్కరిస్తున్నది. ఆ హుందాతనం, ఆ మధురవీక్షణం, ఆ మృదుమందహాసం, ఆసరససంభాషణా అతనికి మరపురావడంలేదు. ఆమె గులాబిరేకుల్లాంటి పెదవులు మళ్ళీమళ్ళీ ప్రత్యక్షమవుతున్నాయి. తన సర్వభాగ్యం ఆపెదవుల్లోనే ఇమిడిఉన్నట్లు స్ఫురిస్తున్నది. అవిగనక తనవైతే లోకం ఏమైపోతేనేం? ఈ మధురభావన అతనిని మరేవిషయమూ స్మరింపనియ్యకుండా చేసింది. ఎప్పుడు నిద్రపట్టిందో ఏమో! మరునాటి ఉదయం పరిచారకులెవరో చెప్పినప్పుడుగాని హేమశిల్పి సర్వస్వం ఎవరో ఎత్తుకొనిపోయారనే విషయం అతనికి తెలియలేదు.

తర్వాత ఊళ్లోపదిమందితో బాటుఅతనూ హేమశిల్పి యింటికి వెళ్ళాడు. 'దొంగ యెటునుంచి వచ్చి ఉంటాడు ? ఎటువెళ్ళివుంటాడు?' అని తానూ వితర్కించాడు. దొంగ అడుగుజాడ లేమైనా కనబడతాయేమోనని ఆయింటిపరిసరాలన్నీ పరీక్షించాడు. కాని ఆ రాత్రి కురిసినవానకు దొంగ అడుగు జాడలు తుడిచి పెట్టుకునిపోయాయి. అయితేప్రత్యాంగుళం పరిశీలించగా పరిశీలించగా తెల్లని వస్తువొకటిబురదలో మున్పాతికవంతు కూరుకుని పోయిందికనిపించింది. 'ఏమిటిది?' అని దానిని తీసి చూచాడతను. అదినస్యపేటిక. అందరికళ్ళూ దానిమీద వాలాయి. 'ఏదేది?' అని అంతమందీ అందుకొని చూచారు. అది చిన్న వెండిపెట్టె. మంచినగిషీతో చూడటానికి చాలాఅందంగా ఉంది. అటువంటిదాన్ని మంచి భాగ్య

వంతులుమాత్రమే ఉపయోగిస్తారుగదా! వాళ్ళకు ఈదొంగ తనం చేసే కర్మ ఎందుకు కలుగుతుంది?

గదాధరుడితోపాటు అందరూ సుదీర్ఘంగా ఆలోచించారు. చివరకు నీలకాంతుడిలా అన్నాడు.

"ఆఁ, ఇప్పటికి గుర్తుకు వచ్చింది. రెండుమూడు నెలలవుతుంది; ఒక వృద్ధుడు అన్నం పెట్టించవలసిందనిమా యింటికివచ్చాడు. అతని దగ్గిర చూచా నీపెట్టె. అడుక్కు తినేవాడిదగ్గిర ఇలాంటిది ఉండటం వింతకాదూ? అయితే అంతకుముందే చెప్పాడితను- తాను గొప్ప కుటుంబంలో పుట్టాననీ దాయాదులవల్ల తన ఆస్తి సర్వనాశనం అయిందనీనూ. 'అయినా ఆ పెట్టె అమ్మకొంటేఒకటి రెండురోజులు తిండి గడుస్తుందిగా! దాన్ని అలాగే ఉంచుకొని ఇతనికి ఈ ముష్టిబతుకేలా బుద్ధిపుట్టిందో!' అనే ఆలోచన వచ్చింది నాకు. కాని ఒకరోజూ రెండురోజుల్తో బతుకు పూర్తిఅయిపోతుందా? అది అమ్మేనమీదట అతని గతి! ఏమిటో, మన ఆలోచనలకు అర్థంలేదు. అందినచోటనల్లా అప్పులు చేస్తూ ఒక్క బాకీకూడా తీర్చకుండా దర్జాలు వెలిగిస్తూ ఉంటారు కొందరు. వాళ్ళను ఏమీ అనలేం. కాని బిచ్చగాడి దగ్గర ఏకొంచం విలువైన వస్తువున్నా 'నీకది దేనికి?' అని ప్రశ్న వేసితీరుతాం. ఆ వృద్ధుడు తనపెట్టెవంక నేను చూడగానే నా అభిప్రాయం గ్రహించినట్టున్నాడు; 'ఇది మా నాన్న గారు వాడుకొనేవారు బాబూ! ఆయన స్మృతిచిహ్నంగా దీన్ని ఆఖర్కి కోసం అమ్మకోకుండ దాచిపెట్టుకొన్నాను.

దీన్ని చూస్తుంటే ఆయన నాకళ్ళయెదుట ఉన్నట్టే ఉంటుంది. అబ్బ! ఎలాంటివారు మా నాన్నగారు! ఆయన గతించినా నేను బతికి ఉన్నానంటే నాలాంటి కృతఘ్నుడూ రాతికుండె వాడూ ఇంకొకడీ లోకంలో ఉండడనే చెప్పాలి. నా ప్రాణం నాకెంత తియ్యనైంది. ఛీ! ఈస్వార్థపరుడికి కీళ్ళకు చాలదు బాబూ! వీడింకా ఇంకా అవస్థలుపడాలి. గుక్కెడు మంచినీళ్ళుకూడా పుట్టకుండా ఏడ్చి ఏడ్చి చావాలి. అలాగైతే ఆపాపం ఏకొంచెమైనా తరుగుతుందేమో!' అని వెక్కి వెక్కి యేడవటం మొదలుపెట్టాడు. చెప్పవద్దూ! నాకూ కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. మానాన్నగారూ నాకు గుర్తుకు వచ్చారు.

"మేం నలుగురం అన్నదమ్ములమూ! ఆయన మిగతా వాళ్ళమీద కంటె నామీదే వాత్సల్యం చూపించేవారు. అన్నదమ్ములే యేమిటి! అక్కచెల్లెళ్ళు కూడానూ! మా నాన్నగారివాత్సల్యం నేను అనుభవించినంతగా నాతోబుట్టువుల్లో మరెవ్వరూ అనుభవించలేదు. నేను ఆయనకు చేసిన ఉపచారం ఒక్కరవ్వకూడా లేదు. అయినా ఇరవైనాలుగు గంటలూ నాతోనే గడపాలని కుతూహలపడేవారు వారు. 'అన్నానికింత ఆలస్యంగా వచ్చావేం? నడిచే వచ్చావా? ఎండలో ఇంతసేపు తిరిగితే ఎలాగు?' అని ఎప్పుడూ నేను ఏమై పోతానో అనే ఆందోళన పడేవారు. నాకు కొంచెం తలనొప్పి వచ్చిందంటే అది తగ్గేదాకా ఆయన మంచినీళ్ళు

కూడా ముట్టేవారు కారు. అలాంటి వాత్సల్యసముద్రుల్ని కాటి కప్పగించి నే నెలా బ్రతుకుతున్నానో!

ఇలా మానాన్నగార్ని తల్చుకొని ఆ వృద్ధుని కున్న పితృభక్తిలో నాకు సహస్రాంశంకూడా లేదనుకొని సిగ్గు పడ్డాను. చూచారా! ఈ పెట్టె అతనిదే. సందేహం లేదు. కాని అతనే యీద్రోంగతనం చేసివుంటాడని నేను అనుకో-లేకపోతున్నాను. గొప్పయింటపుట్టినవాడికి గొప్ప బుద్ధులే ఉంటాయిగాని నీచ బుద్ధులెలా ఉంటాయి!"

నీలకాంతు డిలాఅని శ్రోతల అభిప్రాయాలు తెలుసుకోవడంకోసం అందరి ముఖాలూ పరికించాడు. ఆ సందర్భంలో అతని చూపు గదాధరుడిమీదకూడా పడింది. గదాధరుడు ఉలిక్కిపడ్డాడు. అయితే అతని ఉలికిపాటు ఎవరూ గమనించలేదు. అంతలో హైమాచలశ్రేష్ఠి సంభాషణ మొదలుపెట్టాడు. హైమాచలశ్రేష్ఠి నిజంగా హైమాచలమే అని ప్రసిద్ధి అతను జంతికలూ, కారపుపూసా అమ్ముకొంటూ సంపాదన ప్రారంభించిన వ్యక్తి. జాగిడీ పుచ్చుకొని యింటింటికీ తిరిగి దమ్మిడీ అమ్మకం కూడా వదులుకోకుండా ఓర్పుతో వ్యాపారం సాగించాడు. 'బేరాలే లేవు బాబూ!' అంటూ అంటూనే ఏడాదితిరిగేసరికి చిల్లరకొట్టు పెట్టాడు. రెండో యేటికి మిఠాయి కొట్టుకూడా మొదలిపెట్టాడు 'అది మా అమ్మది. ఈచిల్లరకొట్టుమాత్రమే నాది' అంటూవచ్చాడు. మూడో యేట కొడుకుచేత బట్టల కొట్టు పెట్టించాడు. నాలుగో ఏటినుంచీ వెండి బంగారు

వస్తువుల తాకట్టుమీద అప్పులివ్వడం మొదలుపెట్టాడు. పదేళ్ళు తిరిగేసరికి ఒక్క జమీందారుగారు తప్ప అతనికి బాకీపడని సంసారి ఎవ్వడూ లేకుండా పోయాడూళ్ళో. మిఠాయి అరువిస్తాడు. బట్టలు అరువిస్తాడు. చిల్లర సరుకులు అరువిస్తాడు. నాము పద్ధతిని పేదరైతులకు అప్పులు పెడతాడు. అన్నప్పుడెల్లా డబ్బు అందరిచేతిలోనూ ఆడదు గదా! కాబట్టి యెంత అప్పు చెయ్యకూడదనుకున్నవాడైనా ఏదో ఒక సందర్భంలో అతని దగ్గర అప్పుచెయ్యక తప్పేది కాదు. కుటుంబ యజమాని స్వయంగా అప్పుచెయ్యక పోయినా చిరుతిండ్లకోసం చిన్నపిల్లలూ, నిత్యకృత్యాల్లో వెచ్చాలకోసమో, అరుదుగా వచ్చిన చీరలకోసమో స్త్రీలూ, హైమాచలందగ్గర ఖాతా పెడుతూవచ్చారు. ఇన్ని రకాలుగా అప్పులిచ్చినాకూడా అన్నివసూలు చేసుకోనేసామర్థ్యంకూడా అతని దగ్గర అమోఘంగా ఉంది. ఏ మనిషి తత్వం ఎలాంటిదో ఎవరితో ఎలా వ్యవహరించి తన కార్యం సాధించుకోవాలో హైమాచలానికి తెలిసినట్టు మరెవ్వరికీ తెలియదు. ఊళ్ళోవాళ్ళందరికీ కూడా అతని విషయంలో ఇదే అభిప్రాయం. అందువల్ల అతని అభిప్రాయానికి అందరూ ఎంతో విలువ యిస్తారు. అతనిలా అన్నాడు.

"నీలకాంతబాబూ! గొప్పయిల్లంటే డబ్బుగలవాళ్ళయిల్లు అనేనా మీ అభిప్రాయం? అయితే పొరబడ్డారన్నమాటే. నిజాయితీ అనేది కలిమినిబట్టి ఉండదు. రాజ్యాం

కోసం అన్నదమ్ములు ఒకర్ని ఒకరుమోసగించి చంపుకొంటు న్నారు. వాళ్ళిద్దరూ మహారాజకుటుంబంలో పుట్టినవారేగా! మోసగించటం వాళ్ళ కెలా అబ్బింది? అదలా ఉంచండి! నాదగ్గర అప్పుతీసుకొనే వాళ్ళని చూస్తున్నాగా! పేదలు అణాపైసలతో గడువు నాటికి బాకీ తీరుస్తున్నారు. కలవాళ్లో; ఇదిగో అదిగో అని కాలయాపన చేస్తున్నారు. పేదవా డెవడూ కొంచెం ఆలస్యంఅయినా బాకీ తీర్చివేస్తున్నాడే కాని ఎగగొట్టాలని ప్రయత్నించటంలేదు. కలవాళ్ళయినా కొందరు ఆస్తి పెళ్ళాంపేరనో ఇంకెవరిపేరనో వ్రాసి నాకు పంగనామాలు పెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. అయితే నా దగ్గర ఈ ఆటలేమీ సాగవనుకోండి! అప్పు ఇచ్చేటప్పుడే దాన్ని రాబట్టుకొనేందుకు ఉపాయం ఆలోచించి ఉంటాను. దానిప్రకారం గొల్లాడగొట్టి మరీ పుచ్చుకొంటాను; నాకు రావలసినదంతా. కాబట్టి భాగ్యవంతుడు దొంగతనం చెయ్య డనీ, బీదవాడే చేస్తాడని సిద్ధాంతం చెయ్యడానికి వీల్లేదు."

అప్పుడు హేమశిల్పి యిలా అన్నాడు.

"బాబూ! ఆ వృద్ధుణ్ని నేనూ చూచాను. అతన్ని బాగా పరీక్షించానుకూడానూ. అతను దొంగకాడు. పైగా నాదగ్గిర డబ్బు ఉంటుందని అతనికి తెలిసే అవకాశంలేదు. అదీకాక అత నీగ్రామం విడిచి వెళ్ళికూడా చాలారోజు లయింది. నా దౌర్భాగ్యంకొద్దీ ఎవడో మన ఊరివాడే, నా గుట్టుమట్టులన్నీ తెలిసినవాడే యీపని చేసివుంటాడు. ఎవరని చెప్పేది? నా ప్రారబ్ధం ఇలా ఉంది."

హేమశిల్పి యిలాఅనేసరికి అందరికీ అతని మీదజాలి కలిగింది. గదాధరుడు మరీ జాలిపడ్డాడు!

"విశ్వకర్మగారూ! మీరు దిగులు పడబోకండి! వీలు చూచుకొని నేను మీకు పోయిన పైకం యావత్తూయిస్తాను."

కాని అత డందుకు అంగీకరించలేదు.

"బాబూ! ఇంతవరకు ఒకరిసొమ్ము ఉచితంగా తీసుకొని యెరుగను. ఇప్పుడు ఆపని ఎందుకు చెయ్యాలి? నేనైనా ఈపైకం నాకోసం కూడబెట్టలేదు. ఎవరికోసమో ఏదో చెయ్యాలనుకొన్నాను. నరుడు తానొకటి తలిస్తే భగవంతుడు మరొకటి తలుస్తాడన్నట్టయిపోయింది. పోనివ్వండి! ఏం చేస్తాం?"

తర్వాత గ్రామస్థులు హేమశిల్పికి ఓదార్పు మాటలు చెప్పి ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు. గదాధరుడు కూడా అలాగే వెళ్ళిపోయినా అతనికి మనశ్శాంతి లేకపోయింది. ఆ నస్యపెటిక దామోదరుడి దగ్గర ఉండగా చూచా డతను. ఆవృద్ధుడి దగ్గరనుంచి దామోదరుడి కెలా వచ్చిందో అది! ఏమైనా దొంగతనం దామోదరుడేచేశాడనిపిస్తున్నది. అయితే అతను ఊళ్ళోకి రాలేదుగదా! వచ్చి ఉంటే గుర్రం అమ్మినబాపతు సొమ్ముతనకు ఇయ్యవలసిందే గదా! ఒకవేళ అదంతా కర్చుపెట్టుకొన్నా ఈ దొంగిలించిందికూడా కర్చుపెడతాడా! ఇంతకూ అతనేమైనట్లు?"

గదాధరుడికి ఒళ్ళంతా తేళ్లూ జెర్రులూ ప్రాకినట్లుయింది. భోజనమైనా చెయ్యకుండా దామోదరుడిజాడ తెలుసుకో

డానికి మరొకగుఱ్ఱం ఎక్కి వనదుర్గంవైపు బయలుదేరాడు. కొంతదూరం వెళ్లేసరికి అతనికి ఎదురుగా ఎవరో గుఱ్ఱం మీద వస్తున్నట్లు కనిపించింది. ఆ వచ్చేది తమ్మయ్యగారే కావాలి! పంచకల్యాణి అమ్మకం కాలేదేమో! భగవంతుడా ఈరోజు నాయనగారికి కెలా కనిపించేది?

ఇలా దిగులుపడి గదాధరుడు గుఱ్ఱాన్ని నిలిపి ఆవచ్చే వాతుకోసం వేచిఉన్నాడు. కొద్ది నిమిషాలలో ఆ వ్యక్తి దగ్గరకు వచ్చాడు. కాని ఆగుఱ్ఱం పంచకల్యాణీకాదు; ఆ రౌతు దామోదరుడూ కాడు. అతను గంగాధరుడు. దామోదరుడి దగ్గిర పంచకల్యాణిని కొనాలనుకొనినదిఅతనే. అతను గదాధరుడ్ని చూడగానే గుఱ్ఱాన్ని ఆపి ఇలా అడిగాడు.

«నమస్కారమండి! దామోదరం దొరగారు ఊళ్ళో లేరా?»

«ఏమైంది గంగాధరా! తొందరగా చెప్పు! పంచకల్యాణితో సంతకువచ్చారే తమ్మయ్యగారు! వారు నీకు కనిపించలేదూ?»

«పంచకల్యాణిని మంచిబేరం వస్తే అమ్ముతామన్నారండీ! మీరు అమ్మమన్నారా; వారే అమ్మదలచారా? అది మీదేకదా!»

«ఏదో అయింది. కానీ పంచకల్యాణితో వారుమీకు కనిపించలేదూ?»

"మీరు కొంచెం సావధానంగా వింటామంటే మనవి చేస్తాను."

"చెప్పు! వినకేంచేస్తాం? ఇది యింకో దుర్వార్త అనుకొంటాం. నిండా మునిగినవాళ్ళకు చలియేమిటి?"

"దామోదరం దొరగారు పంచకళ్యాణిని అమ్మితామంటే నేను కొనాలని మోజుపడ్డాను. మీ రేమో దాన్ని వారికి ఇచ్చివేశానని చెప్పారు వారు. నూటయిరవై సువర్ణాలకు బేరం జరిగింది. ఇదిగో గుర్రం తెస్తామని వచ్చారు. తర్వాత ఎంతసేపటికీ రాకపోతే నేను బయల్దేరాను. దారిలో చూస్తే గుర్రం గోతిలో పడిఉంది."

"ఆఁ! గోతిలోనా! కాళ్ళు విరిగిపోయాయేమిటి?"

"ఔను బాబూ! లేకపోతే ఎలాగో బైటికి వచ్చేదేగా!"

"అలా దానిగతికి దాన్ని వదిలి తిమ్మయ్యగారెలా వెళ్ళిపోయారో."

"ప్రాణమేపోయిన దాన్ని వదిలిపెట్టకేం చేస్తారు బాబూ!"

"ఏమిటి? ప్రాణమే పోయిందా?"

"చిత్తం బాబూ! అందుకే చిన్నదొరగారు మీ ముఖం చూడ్డానికి జంకి ఎటో వెళ్ళిపోయివుంటారు. లేకపోతే యింటికి రావద్దూ?"

"ఇల్లూ, వల్లకాదూనూ - దొరగారికిల్లెందుకు? అన్ని యిళ్ళూ వారివే, అన్ని ఊళ్ళూ వారివే! ఇంతకూ వారిని నమ్మడం మాదే బుద్ధితక్కువ. ఇలా జరుగుతుందని ఊహించలేకపోయాం."

"ఇంతకూ వారేమైనారా అనే నా ఆలోచన వన దుర్గంలో లేరు. శాంతిదుర్గానికి రాలేదు. పంచకళ్యాణితో పాటు దెబ్బలుతగిలి పడిపోయారా అంటే అక్కడలేరు. కాబట్టి వారు కులాసాగానే ఎక్కడో ఉన్నారని అనుకోవలసి వస్తోంది."

"దెబ్బలు తగలడమా? కల్ల! వారు ఇతరులమీద దెబ్బతీసేవారేగానే దెబ్బతినేవారు కారు."

ఇలా అని గదాధరుడు దుఃఖక్రోధాలను నిగ్రహించుకొంటూ శాంతిదుర్గంవైపు గుర్రాన్ని మళ్ళించాడు. అంతలో గంగాధరుడు డీలా అన్నాడు.

"వారు ఒకవేళ విలాసపుర పానశాలలో ఉంటారేమో!"

"ఎక్కడైనా ఉండనీ! విదియనాడు కనపడని చంద్రుడు తదియనాడు తానే కనబడతాడు."

అని అతనికి జవాబు చెప్పి గుర్రాన్ని మెల్లగా గృహాభిముఖంగా పోనిచ్చాడు గదాధరుడు.

నాయనగారు రేపు తప్పకుండా ప్రశ్నిస్తారు. తమ్మయ్యగారి వ్యవహారం యావత్తూ నివేదించకపోతే మా మీద వారికి సదభిప్రాయం కలగదు. కాని అలా చెప్పినప్పుడు తమ్మయ్యగారు మా గుట్టు రట్టుచేయక మానరు. అప్పుడు నాయనగారు మమ్మల్నిద్దరిని అసహ్యించుకొంటారు. ఇద్దరమూ వంశానికి అప్రతిష్ఠ తెచ్చే పనులు చేసినవాళ్ళమే. మా నైచ్యం తెలిసిరావడంవల్లఈఅవసానదశలో

నాయనగారికి మనశ్శాంతిలేకుండా పోతోంది. పరిసరగ్రామా లన్నింటిలోనూ కాశీనాథ ప్రభువుల కుటుంబం ఇలాంటిదని చెప్పుకొంటూ నవ్వుకోటం తప్పదు.

ఇది ఇలా ఉండగా నవీనాదేవికి మేము శాశ్వతంగా దూరమై పోవలసివస్తుంది. రాజకన్య దాసీ ప్రియుణ్ని ఎలా వరిస్తుంది? కాబట్టి మా జీవితంలో అంతా అమావాస్యగానే అయిపోతుంది.

ఇలా అటు నాయనగారికీ, ఇటు మాకూ తమ్మయ్యగారికీ, మమ్మల్ని బట్టి బంధుమిత్రులకూ శోకదేవతా పరిష్వంగంలోనే జీవితాలు గడచిపోవలసి వస్తుంది.

ఈ దురవస్థ కలగకుండావుండాలంటే తమ్మయ్యగారి వ్యవహారం నాయనగారికి తెలియనియ్యకుండానే ఉంచాలి. పైకం మరొక విధంగా సమకూర్చి నాయనగారికి ఒప్పగించాలి. ఇంతకంటే గత్యంతరం లేదు.

ఇలా విచారిస్తూ ఇంటికి చేరుకొన్నాడు గదాధరుడు. నిత్యమూ ఉత్సాహానందాలతో సంచరించే అతను ఏదో మహాపత్తు సంభవించినట్లు ముఖం ముడుచుకొని తిరగడం పరిచారకుల కందరికీ విస్మయం కలిగించింది. పలకరిస్తే యేమంటాడో అనే జంకుతో ఎవరికి వారు ఒదిగి ఒదిగి తిరగడం మొదలుపెట్టారు. సేవకులయిన వాళ్ళు అంతకంటే ఏం చెయ్యగలరు?

# ౧౧

ఆరోజే గదాధరుడు తండ్రికి పైకం ఒప్పజెప్పాలి. తండ్రి కబురు చెయ్యకముందే వెళ్ళి ఎలాగో నచ్చజెప్పి అప్పటికి పైకం ఇయ్యవలసినపని లేకుండా తప్పించుకోవాలని ఉద్దేశించాడతను. సూర్యోదయానికి పూర్వమే స్నానం చేసి, దేవమందిరంలో కొంతసేపు జపంతో గడిపి, పూజా కుంకుమ నొసట దిద్దుకొని అతి వినీతవేషంతో తండ్రియెదుటికి వెళ్ళాడు. కుమారుణ్ణి ఆవేషంలో చూడటం కాశీనాథ ప్రభువులకు చాలా ఆనందం కలిగించింది.

"యువరాజావారిలో చాలా మార్పు వచ్చినట్టుందే! రావాలి. ఆ మార్పు ప్రతిమానవుడికి అవసరం. ఐహికం ఎప్పుడూ అశాశ్వతం. శాశ్వతం పారలౌకికం మాత్రమే. సుఖదుఃఖాలకు అతీతులమై ఉండాలంటే ఆధ్యాత్మికమార్గం గాక మరో మార్గంలేదు. ఇది తెలుసుకోలేక మూఢ మానవులు కాంతాకనకాలవల్ల ఆనందం లభిస్తుందని వాటికోసమే నానాశ్రమలూ పడుతూవుంటారు. ఆదారినుండి తప్పుకొని యువరాజావారు ఈ ఉత్తమ పథం అవలంబించటం మాకు చాలా ఆనందంగా ఉన్నది."

తండ్రి అలా పలకరించటానికి కుమారుడు చాలా సిగ్గుపడ్డాడు. కాంతాకనకాలకోసమే తాను తహతహలాడుతున్నాడు. దామోదరుడు పైకంఇవ్వలేదని ఒకచింత; పంచకల్యాణికూడా పట్టిలో కలిసిందని ఒక దుఃఖం; నవీనాదేవి తనది కాకుండా పోతుందేమో అని ఒక భయం. ఇలాంటి

దిగుళ్ళతో క్రుంగిపోతున్న తానా, మోక్షమార్గాన పయ నించటం!

సిగ్గుతో క్రుంగిపోతున్న గదాధరుడు తలయెత్తి సూటిగా తండ్రి ముఖంలోకిచూడలేక, నీరసంగా నవ్వి యిలా అన్నాడు.

"మహారాజావారి దృష్టిలో అందరూ మహాత్ములే. మేము యింకా అజ్ఞానంలోనే ఉన్నాం కానీ ముముక్షువులం కాలేదు. అయితే ఒక్కటి-ప్రపంచం దుఃఖమయమేనేమో అనేశంక యిప్పుడు రోజురోజుకూ బలపడుతున్నది. అలాటి దుఃఖానుభవం ఏదైనా కలిగినప్పుడు మాత్రం మనశ్శాంతికి దేవతారాధనం చేస్తూవుంటాం"

యువరాజు సమాధానం రాజావారికి చాలాసంతృప్తి కలిగించింది. వారు మందహాసం చేసి యిలాఅన్నారు.

"మంచిపని చేస్తున్నారు. కొందరైతే ఏదో దుఃఖం తటస్థించేసరికి మనశ్శాంతికోసమని ఏ మద్యమో సేవించి పతితులవుతారు. మా వంశోద్ధారకులలా చేయకుండా దేవ తారాధన మనశ్శాంతి హేతువని గుర్తించారు. ఇది మా కెంతో గర్వకారణం. ఇంతకూ మిమ్మల్ని పీడిస్తున్న ఆ చింతయొక్క స్వరూపం ఏమిటో?"

గదాధరుడు అతి మృదువుగా ఇలాజవాబు చెప్పాడు.

"మా ప్రాణానికి ప్రాణం పంచకల్యాణి ఈరోజున కొండప్రక్క గోతిలో కూలిపోయింది."

వృద్ధప్రభువు నేత్రాలు చెమ్మగిల్లాయి.

"పంచకల్యాణి! చాలా విశ్వాసంగల ప్రాణి. అటువంటి అశ్వరత్నం ఎక్కడో గాని ఉండదు. యువరాజావారు దానికోసం చింతాక్రాంతులు కావడం సమంజసమే. చిరకాలం మనకు సేవచేసిన ప్రాణికి బాధ కలిగిందంటే అది మనకు కలిగినట్టే తోస్తుంది. మరి దానికి చికిత్సకోసం ఏర్పాట్లు జరిగాయా?"

"చికిత్స! ఇంకేం చికిత్స మహారాజా! అది ఏ చికిత్సా కోరని శరీరం ధరించింది."

"ఆఁ! అంతపని జరిగిందీ? ఈ వార్త మాకుకూడా దారుణంగా వినిపిస్తున్నది. కాని యువరాజావారు శోకానికి లొంగిపోగూడదు. పుట్టిన ప్రతిజీవికీ మరణం తప్పదు. గతించిన దానికి విచారపడి చెయ్యగలిగిందేమిటి? పశుపత్నీసుతాలయాదులు ఋణానుబంధ రూపాలేకదా! కాని ఒక్కమాట–అశ్వపోషణంలో చాలా జాగ్రత్తగా ఉండాలి. మీరు అంత అజాగ్రత్తగా ఎలాఉన్నారు? గుర్రపుస్వారీలో మీకు గొప్పనేర్పు ఉన్నదనే మా నమ్మకం. మేం ఎప్పుడూ ఇలాంటి పొరపాటుపడి యెరగం 'ఈ గుర్రం ఇలా అయింది మరో గుర్రం కొనిపెట్టవలసిం'దని మా నాయనగారిని ఎన్నడూ అడగలేదు."

తండ్రి అభిప్రాయాన్ని కనిపెట్టి వెంటనే గాధకుడిలా అన్నాడు.

"ప్రభువులు మన్నించాలి. మేమూ మరోగుర్రాన్ని కొనిపెట్టవలసిందని ఏలికవారిని కోరబోవడం లేదు. కాని..."

"కాని...అంటే మరేదో ఉన్నదన్నమాట. చెప్పడానికి సందేహమెందుకు? సత్యం అనేది అప్రియమైనా వినడానికి సిద్ధంగానే ఉంటాం మేము. ప్రియమైతే మాత్రం అసత్యం విని యేం ప్రయోజనం?"

ప్రభువు కోశంనుంచి నూరుసువర్ణాలు మాశిల్పులకు వాడుకోవడం జరిగింది. అవి భర్తీ చెయ్యడానికే పంచశిల్పాలని విక్రయించాలని తమ్మయ్యగారికి ఒప్పగించాం. వారు వనదుర్గ ప్రయాణంలో ఆ గుర్రానికా గతి కలిగించారు. అందువల్ల ఈ ఋణానికి మేము దోషులమై దేవరవారిఎదుట నిలబడవలసి వస్తోంది."

కాశీనాథులు ఆశ్చర్యంతో కుమారుడి మాటలు ఆలించి యిలా అన్నారు.

"యువరాజావారు ఈ సంపద కంతటికీ మనం ధర్మకర్తలమేకాని యజమానులం కామనేది మరిచిపోయారన్నమాట. ఇలాగైతే ఈ సంస్థానాన్ని మనం పాలించలేం. ప్రజల సొమ్ము ప్రజలకోసమే వినియోగించాలి. ప్రభువులు ఆపని చెయ్యకపోతే ప్రజలూ మెచ్చరు; భగవంతుడూ మెచ్చడు. ఈరోజు వేణుగోపాలస్వామి మందిరం ముందు మండపం నిర్మించే శిల్పులకు నూరు సువర్ణాలు ఇస్తామని మాటయిచ్చాము. ఆమాట పొల్లయిపోవలసిందేనా?"

గదాధరుడు వంచినతల యెత్తలేదు. నిట్టూరుస్తూ నేలచూపులతో అలాగేనిలబడ్డాడు. అతనిమౌనానికి ప్రభువులు కొంచెం అసంప్రీతులై తిరిగి యిలా అన్నారు.

"తమతమ్మయ్యగారినడవడి యెలాంటిదో తెలిసికూడా వారితో మీరు ధనసంబంధంఎలా పెట్టుకోగలుగుతున్నారో మాకు బోధపడడంలేదు. మాకు తోచేదేమిటంటే అనూరు సువర్ణాలూ మీసొంతానికి వాడుకోలేదనే. తమ్మయ్యగారే వాడుకొని ఉంటారు. అవునా?"

తండ్రియిలా ఆలోచించటం తనకు ప్రియంగానే ఉన్నా గదాధరుడు బదులు చెప్పలేదు. వెనకటి మాదిరిగానే నిలబడి ఉన్నాడు. ప్రభువుల కిప్పుడు నిజంగా కోపం వచ్చింది.

"మేం ముక్కుమూసుకొని కూర్చుంటున్నాం గదా అని మీ రిద్దరూ మీ యిష్టానుసారం ప్రజాధనం వెచ్చిస్తున్నారు. మాకేమీ తెలియదనుకోబోకండి! అన్నీ తెలిసే విరక్తి మరికొంచెం పెంచుకొంటున్నాం. మీమంచిచెడ్డలు లోకానికి తెలిసిరాకముందే మేం ఈలోకం ఎందుకు విడిచి పెట్టలేదా అని విచారిస్తున్నాం."

గదాధరుడిక మౌనం నిలుపుకోలేకపోయాడు. అతను తండ్రి పాదాలమీద పడి యిలా విచారించాడు.

"మన్నించండి మహారాజా! వెనక తెలిసో తెలియకో కానిపని యేదైనా చేసినా ఈనాడు మేమువంశానికి మచ్చ తెచ్చేపని యేదీ చెయ్యటంలేదు. తమ్మయ్యగారిని కూడా మంచిత్రోవకు త్రిప్పాలని ప్రయత్నిస్తున్నాం. అందుకోసమే వారికి అడిగినప్పుడు అంతో యింతో రొక్కం

ఇస్తూ ఉన్నాం. సామదానాలతో చేసినంత పని భేదదండా లతో చెయ్యలేమని ప్రభువులకు మేం చెప్పనక్కర్లేదు గదా!"

ప్రభువు మరి సంభాషణ పొడిగించటం ఇష్టపడలేదు.

"మంచిదండీ మంచిదని తోచిందే చెయ్యండి; కాని ఒక్క విషయం గుర్తులో వుంచుకోండి! మీ అన్నదమ్ముల్లో ఒక్కరూకూడా యోగ్యులుకారని మాకు రూఢి అయినప్పుడు ఈ సంస్థానాన్ని ప్రజలకు అప్పగించి మాదారి మేము చూసుకుంటాం. తగిన ప్రభువును ప్రజలే ఎన్నుకుంటారు. వీలయితే ఈలోపల 'ఫలానావారి కుమారులు మంచివారు' అనే పేరు తెచ్చుకోండి."

ఇలా అని కాశీనాథులు సోఫామీదనుంచి లేచారు. గదాధరుడు తండ్రి పాదధూళి గ్రహించి వినయంగా ఇలా అన్నాడు.

"ఈ ఒక్కసారికి ఈ అసమర్థజీవిని మన్నించండి మహాప్రభూ! ఇంకెప్పుడూ ఎలాంటి అప్రియమూ మావల్ల జరగనియ్యమని ప్రతిజ్ఞ చేస్తున్నాం."

ప్రభువులు మందహాసంతో అతన్ని చూస్తూ "అప్రియంకాదు యువరాజా! అధర్మం జరగనియ్యరాదు. అదే మేము కోరేది. అదే మానవులనుంచి భగవంతుడున్నూ కోరేది. సకల మనుష్యులూ అధర్మానికి దూరులుగావున్న నాడు భుక్తికీ ముక్తికీ భేదంలేదు. కాబట్టి ధర్మమార్గంనుంచి రేఖామాత్రమైనా తొలగకుండా మెలగండి!" అని

చేయెత్తి దీవిస్తూ ఏదో అస్పష్టంగా పలికి గదినుండిబయటికి వెళ్ళిపోయారు.

గదాధరుడు కొన్ని క్షణాలపాటు తండ్రిపోకను గమనిస్తూ అక్కడే నిలబడి తర్వాత మెల్లగా నిశ్వసిస్తూ తన గదిలోకి వెళ్ళిపోయాడు.

వెళ్ళి గదిలో కూర్చున్నాడే కానీ మనస్సును మాత్రం కూర్చోబెట్టలేకపోయాడు గదాధరుడు. తండ్రి మాటలతని చెవిలో యింకా వినిపిస్తోన్నట్టే ఉన్నాయి.

"ధర్మమార్గంనుండి రేఖామాత్రమైనా తొలగకుండా మెలగండి."

ఆ వాక్యం అతని హృదయంలో బాణంలాగా నాటుకొని పోయింది.

ధర్మం! ధర్మం! ధర్మం! నాయనగారికి ఈ ధర్మం తప్పితే మరేదీ అక్కరలేదు. అదీన్నీ శుద్ధ సనాతన భారత ధర్మం. దానికి ఈరోజున తావులేదనే సత్యం వారు గుర్తించటంలేదో; గుర్తించినా కాలాని కెనుకీద దల్చుకొన్నారో! ఏ భోగమూ అనుభవించనప్పుడు రాజుకీ సామాన్యుడికీ భేదం ఏమిటి? రాజుకూడా తన బ్రతుకు తెరువు కోసం సామాన్యుడిలాగా శ్రమించవలసిందేనా? ప్రభుకోశం నుంచి పైసా అయినా సొంతానికి వాడుకోరాదా? పూర్వకాలపు రాజులందరూ ఇలాగే జీవించారా? ఇప్పటివారు జీవిస్తున్నారా? పిరొక్కరికి కనిపిస్తున్నారు. పైగా మమ్మల్ని కూడా తమ మాదిరిగా జీవించవలసిందనీ లేకపోతేసంస్థానం ప్రజలకు ఒప్పగించి వేస్తామనీ నొక్కి చెప్పుతున్నారు.

అన్నంతపనీ చేస్తారుగూడానూ. అప్పుడు మాగతి ఏం కావాలో! కన్నబిడ్డలపట్ల ఇంత నిర్దాక్షిణ్యంగా ఉండే తండ్రులు ఎక్కడైనా ఉంటారా?

తమ్మయ్యగారు తిరిగిఎన్నటికీ ఇంటికిరాకుండాఉంటే మా దాస్యప్రణయం నలుగురి నోళ్ళలో పడకుండాపోతుంది. ఇటు రాజ్యమూ దక్కుతుంది; అటు నవీనాదేవి దక్కుతుంది. ఏదో అదృశ్య శక్తి సహాకరించాలి. లేకపోతే మాగతి అధోగతే!

ఇలా విచారిస్తూ అతను ఎంతసేపు అలా కూర్చున్నాడో! "భోజనానికి వేళఅయింది దొరగారూ!" అని పరిచారిక పిలిచిన తర్వాతగానీ అతనికి బాహ్యలోకం స్ఫురణకు రాలేదు.

## ౧౨

ఎన్నాళ్ళు ఎంతమంది విచారించినా హేమశిల్పి ఇంటిముందు కనిపించిన వస్త్రపేటికను అక్కడఎవరువిడిచిపెట్టారో తెలిసిరాలేదు. కాలక్రమాన ఆ దొంగతనం జరిగినవిషయం హేమశిల్పికి తప్ప మిగతావారి కందరికీ మరపున పడిపోయింది. దామోదరుడు ఎందుకు తిరిగిరాలేదో అన్నప్రశ్న కూడా కలగడంలేదు. అంతకుముందు ఎన్నోసార్లు అతను ఊరువిడిచిపెట్టి ఎక్కడెక్కడో తిరిగి ఎప్పటికో తిరిగి రావ

డను జరుగుతూ వచ్చింది. ఇప్పుడూ అలాగే జరుగుతుందను కొన్నారందరు. కాబట్టి అతని విషయమై ఆలోచించడము మానుకొన్నారు. ఎవరి జీవితం గురించి వారే ఆలోచించు కొంటూవున్నారు. యథాపూర్వంగా తమ తమ వృత్తుల్ని నిర్వహించుకొంటున్నారు.

హేమశిల్పి మాత్రం వెనకటి మాదిరిగా కాలక్షేపం చెయ్యలేకపోతున్నాడు. పూర్వం అతను రోజూ కొన్ని గడియలైనా తాను కూడబెట్టిన సువర్ణాల్ని లెక్కించుకోట ముతో గడిపేవాడు. ఇప్పు డా సువర్ణాలేవి? అవి లేకపోవ డము అతని అనుదిన కార్యక్రమంలో చాలా మార్పుకు కారణమైంది.

ఒకప్పుడు 'హేమశిల్పి చాలా బుద్ధిశాలి' అని అను కొన్న ప్రజలే ఇప్పుడు హేమశిల్పి పట్ల తెలివితక్కువవాడు. లేకపోతే అలా సొమ్ము గంగపాలు చేసుకునే వాడేనా' అనుకోడం సాగించారు. కాని అతనిపట్ల వారి సానుభూతి దినదినాభివృద్ధి అవుతున్నది. "మనిషి ఒకరికి అపకారం చేసే వాడు కాడు. ఒకరి సొమ్ము తేరగా తినేవాడూ కాడు. మన గ్రామాన్ని నమ్ముకొని ఉన్నాడు. పెద్దవాడయాడు. 'నా' అనే వాళ్ళెవళ్ళూ లేనివాడు. గడించుకొన్న కష్టార్జితం పోగొట్టుకొన్నాడు. ఈ స్థితిలో అతనిని మనం కనిపెట్టక పోతే ఎలాగు? మనం గనుక ఉపేక్షిస్తే మతిచెడి మనో వ్యాధితో మరణిస్తాడేమో పాపం!" అనుకొన్నారు. పండుగరోజుల్లో, సంపన్న గృహస్థులు అతనిని భోజనానికి

పిలిచి తాంబూలంలో ఒకటో రెండో రూపాయలు యివ్వడము మొదలుపెట్టారు. కొంతమంది బట్టలు పెడుతూ వచ్చారు. కొందరు అతని యింటిలో చాలాసేపు గడుపుతూ ఏ పురాణగాథలో చెప్పి అతని మనస్సుకు విశ్రాంతికలిగించడము మొదలుపెట్టారు. «విశ్వకర్మగారూ! కష్టార్జితం చాలా విలువైనదే! పోయింది! పోయింది తిరిగిరాదు. రాకపోతే మాత్రం మీకిప్పుడు లోటేమిటి? చెప్పండి. మీకంటె ఎంతమంది పేదవాళ్ళు లేరు? వాళ్ళందరికంటె మీరు సుఖంగా కాలక్షేపం చేస్తున్నారా; లేదా? అయినా అన్న వస్త్రాలకు లోటులేకుండా ఉన్నప్పుడు డబ్బులేకపోతే మాత్రమేం? ఏదో జీవితావశ్యకమైనది కొనుక్కోటానికేగా డబ్బు! అలాంటి అత్యావశ్యక వస్తువులన్నీ మీకు లభిస్తూనే ఉన్నాయిగదా! మీకు డబ్బు పోయిందనే దిగులెందుకు చెప్పండి? మీరు ఎవరికీ మూటగట్టి యిచ్చే పనిలేదుగా!» అనేవాళ్ళు. హేమశిల్పి వారు చెప్పినవన్నీ మౌనంగా ఆలించేవాడు. ఎవరైనా మరీ నొక్కించి ప్రశ్నిస్తే అతను ఒక్క నిట్టూర్పు విడిచి యిలా అనేవాడు.

«అవును బాబూ! మీరనేదంతా నిజమే. నా సంపాదనకోసం ఆశపడే వాళ్ళెవళ్ళూ లేరు. కాని ఆ డబ్బుతో నేను ఒకపని చెయ్యాలనుకొన్నాను. అది చెయ్యవలసిన బాధ్యత నామీద ఉన్నది. ఆ బాధ్యత తీర్చుకోకుండా మరణిస్తే నాకూ పరలోకంలో శాంతి ఉండదు»

'అయితే అదేమిటో చెప్పండి!' అని ఎవరు ఎన్ని సార్లు అడిగినా అతను జవాబు చెప్పేవాడు కాదు.

ఇది ఇలా ఉండగా కాశీనాథ ప్రభువు కాశీయాత్ర ముగించుకొని వచ్చి శాంతిదుర్గాన్ని కాశీ క్షేత్రానికి సమానంగా చెయ్యాలనే సంకల్పంతో బ్రహ్మాండమైన శివాలయం కట్టించడానికి పూనుకొన్నారు. అందులో హేమశిల్పికి విగ్రహాదికాలు నిర్మించే పని ఒప్పగించారు దానివల్ల అతనికి పోయిన ధనాన్ని గురించి తీరుబడిగా విచారించే అవకాశం లేకుండాపోయింది. తననేర్పు సర్వమూ వినియోగించి దేవతా విగ్రహాలను సజీవమూర్తులుగా రూపొందించాలనే ఆకాంక్ష రోజురోజుకూ బలపడసాగింది. అలా చెయ్యగలిగినప్పుడే తనకు హేమశిల్పి అనేపేరు సార్థకం అవుతుందని ఊహించాడు. దీనితో పూర్వం సువర్ణాలను స్మరించుకొని దిగులుపడే ఆ వృద్ధుడు పార్వతీ పరమేశ్వర మూర్తులను మనోనేత్రంతో దర్శిస్తూ ఉల్లాస భరితుడవుతూ వచ్చాడు. మనస్సనే పశువు అభ్యాసమనే పలుపుతో కట్టుబడిఉంటుంది గదా!

శాంతిదుర్గంలో ఇప్పుడు సత్కాలక్షేపాలు ప్రారంభమైనాయి. ప్రభువులు శివాలయం నిర్మిస్తున్నారంటే ప్రజలలో ఒకనూతనోత్సాహం వెల్లివిరిసింది. భస్మత్రిపుండ్ర ధారణం ప్రతిపురుషునికీ ఒక ఆభరణమై పోయింది. నొసటి నడుమ సన్నని విభూతి రేఖ ప్రతి నవలావణ్యవతికీ నవలాంఛనమై పోయింది. రోజురోజూ ముఖక్షౌరం దంతధావనం వంటిదిగా

పాటించే యువకులంలో ముఖమండలాలు విలంబిత నీల లాంఛనలాగా మెరిసే సుదీర్ఘశ్మశ్రువులతో చంద్రమండల శోభవహించాయి. చలన చిత్రాలలోని గీతాలకంటె శివ స్తోత్రాలే ప్రతికంఠంనుంచీ వినిపించ సాగాయి. 'యథా రాజా తథాప్రజా' అనేది ఎంతఅనుభవంకలవాళ్ళు చెప్పిందో మరి !

రచ్చ చావడిలో ఇప్పుడు చతుర్ముఖ పారాయణం కట్టుబడిపోయింది. పురాణ శ్రవణం నిత్యకృత్యంగా పరిణమించింది. అక్కడికి పురుషులేకాక స్త్రీలుకూడా రావడం మొదలు పెట్టారు ఒక్కొక్కరోజు ప్రసిద్ధ హరికథకులవల్ల శివకథలు వినటమున్నూ జరుగుతూవచ్చింది. దేవాలయంలో విగ్రహప్రతిష్ఠ దగ్గిర పడ్డకొద్దీ ఈ సత్కాలక్షేపాలు మరింత అతిశయించాయి. భగవంతుడిపేరు వినడమంటేనే గిట్టని నాస్తికులకు కూడా శివనామ శ్రవణం విని సహించటం అలవాటైపోయింది. మరికొద్దిరోజులకు శివస్తుతులు వినిపించక పోతే అంతటి నాస్తికులకున్నూ నిత్యానుభవంలోవదో వెలితి అయినట్లు అసంతృప్తి కలగడం మొదలయింది చీమలు ప్రాకగా ప్రాకగా రాళ్ళయినా అరిగిపోతాయట ! అలాగే సదభ్యాసం చెయ్యగా చెయ్యగా ఎంత దుష్టచిత్తానికయినా శుభ పరిణామం సంభవించి తీరుతుంది.

అంతలో కార్తీకంవచ్చింది. అందాకా సూర్యోదయానంతరం కాని నిద్రలేవని వాళ్ళుకూడా మల్లికార్జున సుప్రభాత శ్రవణంచేస్తూ ఉషః కాలానికే మేలుకోసాగారు. వేడినీళ్ళతోగాని స్నానం చెయ్యనివాళ్ళు తాకితే కరిచేట్టుండే

చన్నీళ్ళతోనే స్నానం చెయ్యడం మొదలు పెట్టారు. స్నానానికి ఇల్లుదాటి పోనివాళ్లు పెద్దకాలవకో చెరువుకో వెళ్ళి స్నానం చేస్తూ వచ్చారు. సంధ్యావందనం మర్చిపోయినవాళ్ళు సంధ్యావందన పుస్తకాలు ఎదుటబెట్టుకొని అయినా ఆ విధిని ముగిస్తూ ఉన్నారు. ముఖప్రక్షాళనంకూడా చెయ్యకుండానే కాఫీ టీలు సేవించే అలసులు పగలంతా ఉపవాసం ఉండి రుద్రాభిషేకం చేసుకొని రాత్రికి మాత్రమే భోజనం చేస్తున్నారు. ఇలా శాంతిదుర్గ, కాశీనాథ ప్రభువుల సంకల్పానికి అనుగుణంగా కాశీక్షేత్రానికి ప్రతిరూపంలాగా భాసిల్లింది.

పరిసర ప్రభావం మానవుడిమీద ప్రసరించితీరుతుం దనడానికి పైన చెప్పినవే చాలు. చిత్రమేమిటంటే అంత వరకూ ఆనందమనేది ఎక్కడ ఉంటుందో తెలియనట్టున్న హేమశిల్పికి కూడా అత్యధికమైన ఆనందం అనుభవంలోకి రాసాగింది.

ధనం దొంగలపాలు కావడానికి ముందుగూడా అతను ఎక్కువగా ఎవరితోనూ మాట్లాడేవాడుకాడు. ఎందుచేతనో అతను మనుష్యులకు దూరదూరంగానే ఉండేవాడు. తనవృత్తి సాగటానికి అవసరమైన వాళ్ళతో తప్ప మిగిలిన వాళ్ళతో ఎలాంటి సంబంధమూ పెట్టుకొనేవాడు కాడు. ధనంపోయిన తర్వాత ఆ స్వభావం మరీ బలపడుతూ వచ్చింది.

అటువంటివాడిప్పుడు ప్రపంచాన్నిచూచి ఆనందించటం నేర్చుకొన్నాడు. ఎక్కడెక్కడ ఎలాంటి సౌందర్యం

గోచరించినా ముగ్ధుడవుతున్నాడు. రూపగతం, శబ్దగతం మొదలుగా నానావిధాలుగా వ్యక్తమయ్యే ఈశ్వరకళా విభూతి అతనిలో నవచైతన్యాన్ని ఉద్దీపింప జేస్తున్నది. ఈ నూతనానుభూతి విగ్రహ నిర్మాణంలో అతని కౌశలాన్ని ఇనుమడింప జేస్తున్నది క్రుద్ధ నాగేంద్రుడిలోనూ, హింసోద్యుక్త మహావ్యాఘ్రంలోనూ అతనికి భయహేతు వేదీ పొడగట్టడంలేదు. తనలో ఇంత కళాత్మకదృష్టి ఉన్నదని అతనెప్పుడూ అనుకోలేదేమో! చిత్రమేమిటంటే అతనిలోని యీ మార్పు అతనికే చిత్రంగా స్ఫురిస్తోంది.

శాంతుడూ, పద్మాసనాసీనుడూ, శశిధరమకుటుడూ పంచవక్త్రుడూ, త్రినేత్రుడూ, శూలవజ్ర ఖడ్గ పరశుధారీ, నాగపాశ ఘంటాంకుశ సమేతుడూ నానాలంకార సంయుతుడూ పార్వతీయుక్తుడూ అయిన పరమశివుడు అతనికి కన్నుల కట్టినట్టున్నాడు. తన కంటికితగిలే సర్వపురుష కోటిలోనూ ఆ పరమశివుడి అంశ ఏకొంచమో ఉన్నట్టే భావన కలుగుతున్నది. ఈవిధంగా తాను నిర్మించే ఈశ్వర విగ్రహంలో తాను లోకంలో చూచేదీ మనస్సులో భావించి దర్శించేదీ అయిన సర్వసౌందర్యమూ నిక్షేపించటానికి నిరంతర యత్నం చేస్తున్నాడు హేమశిల్పి.

సహస్రకోటి భానుసదృశా, కేయూరహారోజ్జ్వలా, బింబోష్ఠీస్మిత దంతపంక్తిరుచిరా, పీతాంబరాలంకృతా, విష్ణు బ్రహ్మ సురేంద్ర సేవితపదా, తత్త్వస్వరూపా అయిన వశికూడా మీనాక్షులతో అతనికి సాక్షాత్కరిస్తున్నది. అని

మోహనయనుడై అతను సర్వాలంకారాలతో ధగధగలాడే ఆ జగజ్జనని తేజోవిశేషాన్ని నిరవధికంగా దర్శించటం అభ్యసిస్తున్నాడు. ఆ చంద్రసుందర వదనాన్ని ఎంతసేపు విలోకించినా తనివిపొందలేక పోతున్నాడు. ఎటునుంచి విన్నా ఆతల్లి నూపురకింకిణీ రవళులు వినగలుగుతున్నాడు. దృగ్గోచరమయ్యే సకలరమ్య పుష్పాలతోనూ మాలలుకట్టి ఆ భువనేశ్వరికి హృదయ పీఠాధివాసినికి హృదయంలోనే సమర్పించుకొంటున్నాడు.

అతను తన చిత్తంచేత అపరిమిత శ్రీ చందనం కల్పించి అమ్మను మైపూతగా అలంకరిస్తున్నాడు. అసంఖ్యాకాలైన కుసుమ రాజాలతో అర్చిస్తున్నాడు. దిగంతాలదాకా సౌరభం వెదజల్లే ధూపాలు కల్పిస్తున్నాడు కన్నులు మిరుమిట్లుగొల్పే దీపమాలికలు వెలిగిస్తున్నాడు. పంచభక్ష్య పరమాన్నాలు నివేదిస్తున్నాడు. కర్పూరసమేతమూ, ముక్తా చూర్ణ సంయుక్తమూ, పూగీఫలోపేతమూ నాగవల్లి దళయుతమూ అయిన తాంబూలం చేతి కందిస్తున్నాడు.

అమ్మ అతనిని జాలిగా వీక్షిస్తున్నది. చిరునవ్వుతో పలకరిస్తున్నది. శేముత్తి దీవిస్తున్నది. సంతాప జ్వాలలను చల్లారుస్తున్నది. అలౌకికానందం అనుగ్రహిస్తున్నది.

ఇప్పుడతనికి మేలుకొనివున్నా, కలగంటున్నా, నిద్రిస్తున్నా అంబికా సాన్నిధ్యం నిరంతరాయంగా ఉంటున్నది. ఒకసారి కన్నతల్లి ఆకారంలో దర్శనమిచ్చి క్షేమ సమా

చారా లమగుతుం దా వాత్సల్య స్వరూపిణి. మరొకసారి పదిపన్నెండేళ్ల బాలగా సాక్షాత్కరించి ఆటలకు పిలుస్తుంది. ఇంకొకమారు బోసినవ్వుల ముద్దులపాపగా చేతుల్లో చేరి ముత్యాల నవ్వులరాసులు పోస్తుంది. అక్కలాగా చెల్లెలు లాగా చెంతచేరి ముచ్చటలు చెప్పుతుంది. అతని అదృష్ట మేమో! ఎన్నిరకాల రూపాలతోనో అంబిక అతనిముందు నిలిచిందిగానీ ప్రేయసీ రూపానమాత్రం నిలిచిందికాదు. స్త్రీ సౌందర్యసారమైన మూర్తితో తల్లి సాక్షాత్కరించినా అతని హృదయంలో కాముకులవరంకలిగించ లేకపోయాడు.

పూర్వం ఏ స్త్రీని కన్నెత్తి చూడని హేమశిల్పి యిప్పుడు నిశ్శంకంగా ప్రతియువతిని వీక్షిస్తాడు. నవ్వుతూ పలకరిస్తాడు. ఏ కన్య కేలాంటి చీర అందమిస్తుందో చెప్పు తాడు. జడ ఎలా వేసుకొంటే బాగుంటుందో తెలియజెప్పు తాడు. నవ్వుతాడు. నవ్విస్తాడు. తానొక మగవాడనే విషయమే మరిచిపోతాడు; మరి ఆ దివ్య స్థితి ఎటువంటిదో సామాన్యులు ఊహించగలిగింది కాదు.

తనతో ఏదో మాట్లాడాలని వచ్చిన వారితో ఇప్పుడు ఎంతసేపు మాట్లాడినా తాను నిర్మిస్తున్న దేవతావిగ్రహాలను గురించి మాత్రమే. ఏ యే దేవాలయాలలో ఏ యే దేవతా మూర్తులు ఎలాఉన్నాయో తెలుసుకొంటున్నాడతడు. ఎవ రైనా ఎక్కడైనా ఒక దేవతావిగ్రహంలో ఇదీ ప్రత్యేకత అంటే వెంటనే తల పంకిస్తున్నాడు. తల పంకించాడంటే

ఆ విశిష్టత తన శిల్పంలోకూడా చూడాలని అతను నిశ్చయించుకున్నా డన్నమాటే.

హేమశిల్పిలోని యీ మార్పు గ్రామాన్నంతటినీ విస్మయ సముద్రంలో ముంచివేసింది. పదిమందీ పదివిధాలుగా అనుకోవడం మొదలు పెట్టారు.

"కొన్నాళ్ళ క్రిందట హేమశిల్పికి మతి చలిస్తుందేమోనని మన మందరం భయపడ్డాం. అతనిదిగులు పోగొట్టడానికి మన సర్వశక్తులా ప్రయత్నించాం. ప్రభువులుకూడా సమయానికతని కొక మహాకార్యం ఒప్పగించి కాలక్షేపానికి వీలు కలిగించారు. అతనూ ఆ పనిని చాలా నేర్పుతోనే నిర్వహిస్తున్నట్లు కనబడుతున్నది. కాని యిదేమిటి? నన్ను ముట్టబోకు, నా మాలకాకి అన్నట్టుండే మనిషి యింతగా మారిపోయాడు."

"అతని కిప్పుడు వివాహం చేసుకోవాలనే కోరిక బాగా కలిగినట్టుంది."

"అబ్బే! అదేంకాదు. హేమశిల్పి అటువంటి అజ్ఞాని యెంతమాత్రం కాదు."

"ఓయి నాయనా! తలక్రిందులుగా తపస్సు చేసిన మహామునీశ్వరులే నెరసిన గడ్డాలతో వాలిసకనుబొమలతో శృంగార నాయకపాత్రలు నిర్వహించారుగదా! యీ శిల్పి వాళ్ళముందు ఎంత ?

"దానికేం? యౌవనంలో అడుగుపెట్టే పెట్టకముందే విరక్తి అవలంబించి మహాయోగులైన వాళ్ళు యెంతమంది లేరు?"

"ఓ హో! హేమశిల్పి ఆ అవతార పురుషులూ ఒకటే అంటావు."

"ఏనాటివాడయ్యా అతను. ఎంతకాలంనుంచీ చూస్తున్నాం! ఎంతమంది తమ పిల్లల్ని అతని కివ్వాలని ప్రయత్నించలేదు? ఎవరికయినా సందిచ్చాడా అతను? నవయౌవనంలో లేని స్త్రీవాంఛ యిప్పుడు కలిగిందా అతనికి?"

"నువ్వు మళ్ళీ మొదటికి వస్తున్నావు. ఆ రోజుల్లో ఎవరి తోడ్పాటూ అక్కరలేకుండా గడుపుకొనే శక్తి ఉండేదతనికి. ఇప్పుడు ఓపిక సన్నగిల్లుతోందిగా! గృహకృత్యాలు చెయ్యడానికీ ఇంత వండిపెట్టడానికీ స్త్రీ ఉండాలని అతననుకో కూడదా?"

"అనుకోవచ్చునుగాని ఇప్పుడతనికి ఏ స్త్రీ లభిస్తుంది? వెనకనంటే ఎంతయినా సంపాదించేవాడు. కావలసినంత సొమ్ము నిలవవుండేది. అలాంటి రోజులన్నీ పోయి వయసు ఉడిగిపోతుంటే తన్నెవత్తెయినా ప్రేమించి పెళ్ళిచేసుకొంటుందని అతనెలా ఆశిస్తాడు?"

"అదేమీ లేకపోతే ఆడవాళ్ళకో అంత మగి కల్పించుకొని మాట్లాడటం ఎందుకు?"

"ఆడవాళ్ళతోనే ఏమిటి? మనతోనూ గంటల తరబడి మాట్లాడటం లేదూ? పూర్వమైతే సంపాదించిన ధనాన్ని చూచుకొని మురిసిపోతుంటే కాలం గడిచిపోయేది. ఇప్పుడు కాలక్షేపాని కింకో ఉపాయమేమీ లేదు. కాబట్టి అందరినీ పలకరించి ఏవో మాటలతో ఉల్లాసంగా కాలం గడుపుతున్నాడు."

"నీ అభిప్రాయం నిజమే అయితే పనిగట్టుకుని ఏ ఆడపిల్లనో పిలిచి పూలూ బుక్కాయీ యివ్వడమెందుకు? నీకూ నాకూ ఏదో ఒకటియిస్తూ వుండగూడదూ? అబ్బాయీ నువ్వు వెయ్యిచెప్పు; లక్ష చెప్పు? హేమశిల్పి కిప్పుడు పిచ్చిపట్టింది. అది మరో మరో పిచ్చికాదు. అక్షరాలా మదపిచ్చి."

"నువ్వు పూర్తిగా పొరబడుతున్నావు. అదిమదపిచ్చే అయితే ఆడవాళ్ళు తొందరగా గుర్తిస్తారు. ఈనాటికి ఏదో అల్లరి జరగనే జరిగేది."

"ఏం? ఎందుకు జరుగుతుంది? ఆడదాని కిష్టమై ఉండగూడదా?"

"పోనీ! అదీ ఒప్పుకొందాం. ఎవత్తో ఒకతి అతనికి అనుకూలురాలు కావచ్చును. కాని ఊళ్లో అందరు ఆడవాళ్ళూ అంతేనా?"

"నేనుమాత్రం అలా అంటానా? కాని శీలవతులయినవాళ్ళు అమాయకులుగా ఉండవచ్చును. అతనిలో ఈ దుర్బుద్ధి ఉన్నదని కనిపెట్టలేక పోవచ్చును."

"అలాగైతే ఇందాకటి నీ సిద్ధాంతాన్ని నువ్వే ఖండించుకొంటున్నావు."

"మనకీ సిద్ధాంత రాద్ధాంతాలు దేనికి? ఏ కట్టెను నిప్పంటే ఆ కట్టే కాలుతుంది. అదుగో! హేమశిల్పి యిటే వస్తున్నాడు. ఇక ఈ ప్రసంగం మానివేద్దాం."

ఇలా అనుకొని హేమశిల్పి అక్కడికివచ్చేసరికివాళ్ళు మరొక విషయాన్ని గురించి మాట్లాడటం మొదలుపెట్టారు. వాళ్ళ సంభాషణ ఏమాత్రమూ వినని హేమశిల్పి పంచదశీ స్తోత్ర పారాయణం చేసుకొంటూ వచ్చి కూర్చున్నాడు.

"లబ్ధ్వా సకృత్త్రిపురసుందరి తావకీనం
కారుణ్య కందళిత కాంతిధరం కటాక్షమ్
కందర్ప భావ సుభగాః ఖలు భక్తిభాజ
స్సం మోహయంతి తరుణీ ర్భువనత్రయేఽపి.

ఆ శ్లోకం అక్కడివాళ్ళ కెవరికీ బోధపడకపోయినా 'సుందరి' అనే పదం వినిపించినందువల్ల అదేదో సుందరీవర్ణనం అయివుంటుందని ఊహించారు. దాని అర్థం పూర్తిగా తెలుసుకుని అతన్ని పరాభవించాలనే సంకల్పంతో మొదటి నుంచీ అతనిపట్ల అసమ్మతి వెలిబుచ్చిన యువకుడు అతనితో యిలా అన్నాడు.

"ఏమండీ హేమశిల్పిగారూ! 'సుందరి' అంటున్నా రేమిటి? కొంపదీసి ఏ సుందరి అయినా మీ హృదయం దోచుకొని పోయిందా ఏమిటి?"

హేమశిల్పి అతని ప్రశ్న వినగానే రెండు చెవులూ మూసుకొని 'శివ శివా!' అన్నాడు.

"శివశివా అంటారేమిటండీ ? పురుషుడు స్త్రీని, స్త్రీని పురుషుడూ ప్రేమించటం ప్రకృతి సహజమే కానీ దానికి భిన్నంకాదుగదా!"

"కాదు గాని నాయనా! నేను స్మరించే సుందరి ఇహ లోక సుందరికాదు."

"ఇహలోకసుందరికాదంటే అమరలోకపు సుందరా? రంభా ? తిలోత్తమా! మేనకా! ఘృతాచా ?"

"ఆసుందరి త్రిపురసుందరి నాయనా! నువ్వుచెప్పిన వారి వంటిది కాదు. ఆమె త్రిలోకజనని.పరాశక్తి."

"ఆహా! అలాగా! అయితే అమ్మవారి సౌందర్యంతో భక్తుడికేంపని చెప్పండి? లోకంలో ఎవడైనా తల్లిదగ్గర నుంచి వాత్సల్యాన్ని పొందగోరుతుంటాడేగాని ఆమె అం దాన్ని వర్ణించి పరవశుడవుతాడా?"

"తల్లి అందం మోహజనకం కాదు నాయనా! అది భక్తిని పుట్టించేది మాత్రమే."

"అయితే మాత్రం? అయినా మీరిప్పుడు చదివిన శ్లోకానికి అర్థం ఏమిటో చెప్పండి."

"దీని అర్థమా! చాలా గొప్పది బాబూ! అందరూ వినవలసిందే. ఆ త్రిపురసుందరియొక్క కరుణాకటాక్షం ఒక్కసారి అయినా పొందిన పురుషుడు మన్మథుడివలె అతి సౌందర్యంతో ప్రకాశిస్తూ మూడులోకాలలోని యువతు

లనూ మోహింపజేస్తారు. విన్నారా ! దేవి చల్లని చూపు లోని ప్రభావం !"

విశ్వకర్మ జవాబు వినగానే ఆ యువకుడు పకపకా నవ్వుతూ అందరివైపూ చూచాడు.

"విన్నారా ! మన విశ్వకర్మగారి కోరిక యేమిటో ! ఆయనకు మూడు లోకాలలోని యువతుల్ని మోహింపజేసే సౌందర్యం కావాలట ! అందుకోసమే ఆయన త్రిపురసుంద రిని ప్రార్థిస్తున్నారు."

విశ్వకర్మ యీ విపరీత వ్యాఖ్యానానికి తెల్ల బోయాడు.

"నాయనా ! ఇది పంచదశీస్తోత్రంలోని శ్లోకం. పంచ దశి అంతా పారాయణం చేస్తూఉంటే మంచిదని చిన్న ప్పుడు మా గురువుగారు చెప్పారు. నేను అలా పారాయణం చేస్తున్నాను. అంతేకాని నాకు ఈ అందం ఏదో కావాలనీ దానితో ముల్లోకపు యువతుల్ని మోహింపజెయ్యాలనీ ఊహించటంలేదు. ఒక్క నా మాటే దేనికి? లోకంలో ఎంతమందో చేస్తున్నారు పంచదశీ పారాయణం, వారందరూ నువ్వు చెప్పినవిధంగానే కోరి చేస్తున్నారా అది?"

యువకుడు వెంటనే జవాబు చెప్పలేదు. శ్రోతలలో ఎవరైనా తనకు ప్రోత్సాహకరంగా మాట్లాడుతారేమోనని కొంచెంసేపు ఆగి, అందరినీ పరికించాడు. అతని సమా ధానం సంతృప్తికరంగా ఉన్నందువల్ల మిగిలినవారెవరూ ఏమీ మాట్లాడలేదు. ఆ యువకుడి ఉత్సాహం దిగజారి

పోయింది. పైగా తాను చేసింది తప్పేనేమో అనే జంకున్నూ కలిగిం దతనికి. దానితో కొంచెం సిగ్గుపడి మౌనంవహించా డంతటి వాదప్రియుడూనూ.

అప్పుడిలా అన్నాడు విశ్వకర్మ.

"పరాశక్తియొక్క మహిమలు అనంతాలు బాబూ! వాటిని వర్ణించటం దేవతలకూ మహర్షులకే సాధ్యంకాదు. మనుష్యులం మనం ఏపాటివాళ్ళం? ఈ శ్లోకం రచించటంలో ఆ మహాకవి ఉద్దేశం తనకు సాధ్యమైనంతగా దేవి మహిమాభివర్ణనం చెయ్యటమే.

"అయితే 'ఇలా స్తుతిస్తే దేవి సంతోషిస్తుందా? ఆవిడ కూడా పొగడ్తకు లొంగిపోయేదేనా?' అని యెవరైనా అనవచ్చును. కాని దేవిమహిమ యెంత గొప్పదో మనలాంటి వాళ్ళకు తెలియాలని మాత్రమే కవీశ్వరు లిలాంటి రచనలు చేస్తారు. దేవికటాక్షం పొందిన వాడికి తీరనికోరిక యేదీఉండ దనిమాత్రమే మనం ఇందువల్ల గ్రహించాలి.

"ఆ జగజ్జననిని అర్చించి యెందరెందరు ఎన్నెన్ని శక్తులు సంపాదించలేదు? కోరుకొంటే అలాంటి మహిమలన్నీ మనమూ సంపాదించవచ్చును. కాని అటువంటి కోరిక లేవీ పెట్టుకోకుండా ఉండటమే ఉత్తమం. మనకష్టసుఖాలన్నీ విచారించే భారం ఆ తల్లిమీదనే ఉంచి మనం నిశ్చింతులం కావాలి. కష్టంరానీ, సుఖంరానీ, అది మన మేలుకోసమే అని కుంగటం పొంగటం అనే రెంటికీ అతీతులంగా ఉండగలగాలి. చరచరాత్మకమై యీ విశ్వమంతటిలో ఆ జగ

జననినే సందర్శించ గలగాలి. అందుకు నిత్యసాధనకంటె ఉపాయం లేదు. అమ్మను ధ్యానించాలి. అమ్మను దర్శించాలి. అమ్మను పలకరించాలి. అమ్మమాటలు ఆలకించాలి. అమ్మ నిర్దేశించినట్టు నడవాలి. అదీ నాయనా జీవిత పరమార్థం! అదే బాబూ తపస్సారం! ఆ సామర్థ్యం సిద్ధించే లోపల ఎన్నిజన్మాలు ఎత్తవలసివస్తుందో నాకు. దుఃఖబహుళమైన యీలోకంలో వ్యామోహ పరంపరలన్నీ దరిచేరకుండా అమ్మ అడుగుల దగ్గరే ఎలా ఉండగలుగుతానో!

హ్రింకారమేవ తవ నామగృణంతి వేదా
మాతస్త్రికోణ నిలయే త్రిపురే త్రినేత్రే
త్వత్సంస్మృతౌ యమభటాదిభయం విహాయ
దీవ్యంతి నందనవనే సహలోకపాలైః"

చెంలనేత్రాలతో గద్గదస్వరంతో అలా దేవినిస్తుతిస్తూ మెల్లగా అక్కడినుంచి గృహోన్ముఖుడైన హేమశిల్పిని కంటికి కంపినంతవరకూ పరికిస్తూ అక్కడివారందరూ అన్యం మరిచిపోయారు.

## ౧౩

శాంతిదుర్గం ఇన్నాళ్ళనుంచీ ఎదురుచూచిన రోజు రానే వచ్చింది. మరునాడే దేవాలయంలో విగ్రహ ప్రతిష్ఠాపన జరుగుతుంది. కాశీనాథేశ్వర ప్రతిష్ఠా మహోత్సవం నేత్రపర్వంగా విలోకించటానికి ఎక్కడెక్కడి ప్రజలూ వచ్చారు. ఎంతమంది వచ్చినా అంతమందికీ భోజనాలు

పెట్టదగిన యేర్పాట్లు చేయించారు ప్రభువులు. అంతేకాక ఉత్సవదినాల్లో అరఘడియలూ విడవకుండా సత్కాలక్షేపం జరగడానికి దేశం నలుమూలలనుంచీ భజన సమాజాలనూ, పౌరాణికుల్నీ, హరికథకుల్నీ, సంగీతవిద్వాంసుల్నీ, నర్తకుల్నీ వేలకువేలు రూపాయలిచ్చి పిలిపించారు. ఉషఃకాలం ప్రారంభమవుతూ ఉండగానే సన్నాయిమీద స్వామికి మేలుకొలుపు పాట వినిపించాలి. దానితోబాటే విప్రోత్తములు సుప్రభాత శ్లోకాలు చదవటం ప్రారంభించాలి. అక్కడనుంచి వరసగా భజన సమాజాలూ, నర్తకీ నర్తక బృందాలూ, గాయక గాయనీ నికాయాలూ తమతమ విద్యా కౌశలాలను ప్రదర్శిస్తూ ఉండాలి. భగవన్నామం వినిపించకుండా క్షణమైనా వ్యర్థం కావడానికి వీల్లేదు.

స్వామి ఊరేగింపు వేడుకకు ప్రభువులు పాటి జమీందార్ల వద్దనుండికూడా ఏనుగులూ, గుర్రాలూ, లొట్టిపిట్టలూ మొదలైన జంతువులను తెప్పించారు. కత్తిసామూ, కర్రసామూ నేర్చినవారూ, మల్లయుద్ధ విశారదులూ అయిన యువకులూ, వృద్ధులూకూడా స్వామి ఊరేగింపు వేళలో ప్రదర్శనాలు నిర్వహించటానికి వచ్చారు. కూచిపూడి నాటక సమాజంవారు ప్రత్యేకాహ్వానం మీద వచ్చారు. ఔత్సాహికులైన నటులనేకులు కొన్ని సమాజాలుగా ఏర్పడి ఎవరి ఆహ్వానంతోనూ నిమిత్తం లేకుండా వచ్చారు.

ఉత్సవ కార్యక్రమాలలో ప్రభువులు స్వయంగా ముచ్చటపడి ఏర్పాటుచేసిన సంస్థాన ఘనపాఠుల వేదపఠ

నమూ, ఆదిభట్ల నారాయణదాసుగారి పార్వతీ పరిణయ కథాకాలక్షేపమూ, తిరుపతి వెంకటేశ్వరుల శతావధానమూ కొప్పరపు వారి ఆశుకవితా ప్రదర్శనమూ, వారణాసి బ్రహ్మయ్యశాస్త్రిగారి వాయులీనంలో, వారి సోదరులైన ఘంటయ్యశాస్త్రిగారి మృదంగంలో, ఆ యిద్దరికీ పినతండ్రి అయిన బలరామయ్యగారి గాత్రసంగీతమూ ప్రత్యేకంగా ద్వారం వారి వాయులీన వాద్యమూ మొదలైనవి. హరి నాగభూషణంగారి కచేరీ వారణాసి సోదరుల కచేరీకి పోటీగా ఉండాలనీ, బళ్ళారి రాఘవాచార్యులుగారి రామదాసు నాటకం, డి. వి. సుబ్బారావుగారి హరిశ్చంద్ర నాటకం, ప్రత్యేకంగా చూచితీరాలనీ, కుతూహలపడ్డారు కాశీనాథ ప్రభువులు. పిచ్చహరి సన్నాయి వాద్యంతో స్వామికి మేలుకొలుపు జరగాలని నిర్ణయించేశారు. మతద్వేషం పెట్టుకోకుండా పీరుసోదరులసన్నాయివాయిద్యమున్నూ ప్రత్యేక కార్యక్రమాల్లో చేర్చారు. బులుసువారి వేదార్థ ప్రవచనమూ, తాతా, దెందుకూరి, శ్రీపాద ప్రభృతుల శాస్త్రార్థాలు ఆ కార్యక్రమాల్లో అతివిశిష్టమైనవి. ఇలా ఆంధ్రుల సంస్కృతి సమగ్ర ప్రదర్శనకు అనువైన యేర్పాట్లు జరిగాయి.

'మహర్షు లెప్పుడో సత్రయాగాలు జరిపే వారని పురాణ కథల్లో వినడమేగాని ప్రత్యేకంగా చూడలేదు. ఈ కాశీనాథేశ్వర ప్రతిష్ఠ నిమిత్తంగా అలనాటి సత్రయాగాలెలా జరిగేవో తెలుసుకోవచ్చు' నని కరపత్రాలలో కార్య

క్రమ పట్టిక చూచి ఆస్తిక శిఖామణు లెందరో దూరాగమన ప్రయాసాలు లెక్కించకుండా శాంతిమర్గానికి విచ్చేశారు. దానితో ఆ గ్రామంలో ఇల్లిల్లూ ఒక పెండ్లి యిల్లు మాదిరి గానే శోభించింది. ఇళ్ళన్నీ జనంతో క్రిక్కిరిసిపోగా ఇంకా ఎందరో ఊరికి అవతలనే విశ్రమించవలసి వచ్చింది. అటు వంటి వారికోసం జమీందారుగారు సువిశాలమైన పందిళ్ళు వేయించి పెట్టారు. వాటితో ఊరు నలువైపులా నాలుగు రెట్లు పెరిగి నట్టయింది.

గదాధరుడికి ఇప్పుడు అమృత ప్రవాహంలో ఈదులాడుతున్నట్లే ఉన్నది. అతను కళాప్రియు డనేమాట నిజమే అయినా ఇప్పటి అతని అత్యధికోల్లాసానికి అదికాదు కారణం. నవీనాదేవి తల్లిదండ్రులతో సహా ఆ ఉత్సవాలు చూడటానికి వచ్చింది. అంతఃపురంలోనే బస చేసింది కూడాను. ఏ కొంచెమూ ప్రయత్నంతో పనిలేకుండా ఆమె కోకిలాలాపం అతని చెవికి సోకుతున్నది. అప్రయత్నంగానే ఆ లావణ్య తరంగిణి ఎదురవుతూ ఉన్నది. ఏదో ఒక సందర్భంలో ఒకరితో ఒకరు మాట్లాడటంకూడా తటస్థపడుతున్నది. ఒక్కొక్కప్పుడు అతనే ఆమె మాటలకు జవాబులు చెప్పడానికి తటపటాయించవలసి వస్తున్నది గానీ ఆమె ఏమాత్రము సంభాషణకు వెనుదియ్యటం లేదు. ఏ దివ్య సౌందర్యాన్ని తిలకించటానికి చిరకాలంగా అతను ఉవ్విళ్లూరుతూ ఉన్నాడో ఆదివ్య సౌందర్యం తనకు తానే సాక్షాత్క-

రించే సరికి అతను తిన్నగా కన్నెత్తి చూడలేక పోతున్నాడు. ఆ విచిత్రానుభవం అతన్ని ఉక్కిరి బిక్కిరి చేసి వేసింది.

నిత్యమూ ఉత్సవ విశేషాలు చూచి అంతఃపురానికి వచ్చిన పిమ్మట పదిమందీ తీరుబడిగా కూర్చుని ఆనాటి కార్యక్రమాలలో విశిష్టమైన వాటిని గూర్చి ముచ్చటించుకొనే వారు. ఆయా సందర్భాలలో నవీనాదేవికి సాహిత్య సంగీతాదులతో గల గాఢ పరిచయం వ్యక్తమవుతుంటే గదాధరుడు తన అల్పజ్ఞతకు లోలోపల లజ్జించవలసి వచ్చింది. ఇంతేకాదు. నవీనాదేవి వేషభూషణాదులలో ఎంత అధునాతన వ్యక్తిగా కనిపించినా సనాతన ధర్మాలమీద ఆమెకు గల భక్తివిశ్వాసాలు అపరిమితాలని అప్పుడే అతనికి తెలియ వచ్చింది. అతనైతే అత్యాధునికుడూ కాలేకపోతున్నాడు; సనాతన ధర్మపరాయణుడూ కాలేకపోతున్నాడు. హేమశిల్పి సృష్టించిన దేవతా విగ్రహాలలో దివ్యత్వం ఉట్టి పడుతున్నదని నవీనాదేవి అంటే ఆ దివ్యత్వం ఎలాంటిదో అతను భావించలేక పోయాడు. జీవితానికి పరమార్థమేమో గుర్తించని వ్యక్తికి ఆ భావన కలిగే అవకాశం ఏదీ?

శాంతి దుర్గంలో ఉత్సవాలైదురోజులూ ఐదు క్షణాలు లాగా గడిచి పోయాయి. చివరి ఒక్కరాత్రి గడిస్తే నవీనాదేవి తిరిగి వెళ్ళిపోతున్నది. పాపం! గదాధరుడికి ప్రపంచం సర్వం శూన్యం కాబోతున్నదనిపించింది. నవీనాదేవితో ఎన్నో మాట్లాడాలనీ తన హృదయం యావత్తూ ఆమెకు విప్పి చెప్పాలని అతను ఎంతో కుతూహల పడ్డాడు.

కాని ఆమె మొదట అతనికి ఏమాటా స్ఫురించేది కాదు. ఏదో ఒక మిషతో ఆమె ఉన్న చోటికి ఎన్నోసార్లు వెళ్ళాడు. కళ్ళారా ఆమెను చూచాడు. ఆమె కన్నెత్తి చూచేసరికి అతన్ని ఏదో జంకు ఆవేశించేది. తటాలున చూపులు మరల్చుకోవటం మాత్రం మానలేక పోయాడు.

దీనితో నవీనాదేవి హృదయం శంకాకులిత మైంది. "ఆయన యీ విధంగా ప్రవర్తించటానికి కారణం ఏమిటి? నామీద అనురాగం ఉందా; లేదా? పెద్దల బలవంతం చేత మాత్రమే నన్ను వివాహం చేసుకోబోతున్నారా? లేక నే నెలా ప్రవర్తించేదీ తెలుసుకోగోరుతున్నారా? ఈ విషయంలో నేనే లేనిపోని మమతలు పెంచుకుంటున్నానా? ఆయన మనస్సులో ఏమున్నదీ తెలుసుకోటం ఎలాగు?" ఇలా ఆమె లోలోపల మథన పడుతున్నది.

ఆ రాత్రి అందరూ హరికథా కాలక్షేపానికి వెళ్లారు. కొంతసేపు గడిచేసరికి నవీనాదేవి అక్కడ కూర్చోలేక పోయింది. అంతరంగ మథనంవల్లనే వచ్చిందో మరెందువల్ల వచ్చిందో ఆమెకు తలనొప్పి వచ్చింది అక్కడ కూర్చోలేక ఇంటికి తిరిగి వచ్చింది. గదాధరుడి గది తెరిచి ఉన్నది. దీపం మహోజ్జ్వలంగా వెలుగుతున్నది. ఆమెకు ఆశ్చర్యం కలిగింది. 'ఈయన హరికథ వినడానికి రానేలేదా? ఒంటరిగా ఏం చేస్తున్నట్టు!' అనుకొంటూ గదిలోకి తొంగి చూసిందామె. గదాధరుడు ఆమె రాకను గమనించలేదు. తల వంచుకుని యేదో వ్రాసుకొంటున్నాడు. అమృతాంజనం

అతని వద్ద ఉంటుందేమో అడుగుదామనుకొని ముందుకు రెండడుగులు వేసింది. కాని అతని పనికి ఆటంకం కలిగించి నట్టవుతుందేమో అని శంక కలగడం వల్ల నిల్చున్నచోటనే ఆగిపోయింది. అంతలో అతను తాను వ్రాసింది యిలా చదువుకోవటం మొదలుపెట్టాడు.

చి॥ నవీనాదేవికి
గదాధరుడు ఆశీర్వచనాలు.
దేవీ !

నిన్ను ఎలా సంబోధించాలో నాకు బోధపడకుండా ఉన్నది. నీయందు నాకున్న అనురాగాన్ని వ్యక్తం చెయ్యడానికి తగ్గ పదం భాషలో లేదనుకొంటాను. ఇలా అన్నప్పుడు నా సాహసానికి నువ్వు నవ్వుకోవచ్చు; భాషా సముద్రంలో పది బారలైనా ఈది యెరగని యితను యిలా అంటున్నాడేమిటని. కాని నాకు వచ్చిన భాషలో అనుకొన్నట్లయితే సరిపోతుందనుకొంటాను.

మనోహారిణీ ! నీ దివ్యరూపాన్ని తిలకించేటప్పుడు ఆనంద పారవశ్యంతో నా శరీరం నాది కాకుండాపోతున్నది. నీతో చెప్పాలనుకొన్న మాటలన్నీ మరిచిపోతున్నాను. పైగా నువ్వు నాకంటె ఎన్నో అంతస్తులు పైన ఉన్నట్టనిపిస్తున్నది. భర్తనై నిన్ను నేను ఎలా శాసించగలను! ఈజంకే నన్ను సూటిగా నీకళ్ళలోకి చూడనివ్వటం లేదు. ఏమనేది ? ఏం చేసేది? నువ్వొక మహారాజ్ఞివైతే నేనొక అల్పభృత్యు

ణ్ణవుతాను. ఈ భృత్యుడికి నిన్ను సేవించే భాగ్యం లభించి నట్టయితే దేవేంద్రపదవి కూడా అక్కర లేదు.

అమృత మూర్తీ! నీ వాలు చూపులు నాకు మణి భూషణాలు. నీ పలకరింపులు నాకు పంచభక్ష్య పరమాన్నాలు. నీ పాద స్పర్శ నాకు కోటి స్వర్గాలు. నా జన్మ తరించటానికి నీతో అనుబంధం కంటె మరొక ఉపాయం లేనే లేదు. నన్ను ఒక మనిషిగా, ఒక కార్య శూరుడుగా, తీర్చి దిద్దగల దానివి నువ్వే.

లోకపావనీ!

తుమ్మెదకూడా వాసనచూచి ఉండని గులాబికన్నెవు నువ్వు. అన్ని కంపులకూ అసహ్యం ఎరగని జంతువున్నేను. నన్ను నువ్వు స్వీకరించ గలవా? ఏమంటావు?

ఇట్లు
నీ జవాబుకు వెయ్యి చెవులతో
గదాధరుడు.

ఇలా వ్రాసింది ఎన్నిసార్లు చదువుకున్నాడో గదాధరుడు. ఆ లేఖ చదువుకొని జవాబియ్య వలసిన వ్యక్తి తన వెనకనే ఉన్నదని, లేఖాంశాలు అన్నీ విని విస్మయ పడుతున్నదనీ తెలియ దతనికి. చదువుకొని చదువుకొని సంతృప్తుడై లేఖను నీలవు కవరులో పెట్టి నవీనాదేవి పేరు వ్రాసి దానిని చేత బుచ్చుకొని కుర్చీలో నుంచి లేచాడు. దానిని ఆమెకు ఎలా అందించాలా అని ఆలోచిస్తూ గుమ్మంవైపు తిరిగాడు. అంతే. అతనికళ్ళు మిరుమిట్లు గొన్నాయి. అడుగు

ముందుకు పడలేదు. నిల్చున్నవాడు నిల్చున్నట్లే ఉండి పోయాడు.

నవీనాదేవి అతని అవస్థకు జాలి పడ్డది. మృదువుగా నవ్వుతూ ఇలా అన్నది.

"ఎక్కడికో కార్యార్థం బయలుదేరినట్టున్నారు. నేను మీకు అపశకునం కాలేదు గదా!"

"పాపం! గదాధరుడికి జవాబు తోచలేదు.

"నువ్వు - కాదు - మీరే! ఇలా వచ్చారేం? హరి కథ అయిపోయిందా?"

"అప్పుడే ఎలా అయిపోతుందండీ? తల నొప్పిగా ఉంటే అక్కడ కూర్చోలేక ఇలా వచ్చాను మీ దగ్గర అమృతాంజనం ఉన్నదా?"

గదాధరుడు ఆమె మాటలకు తబ్బిబ్బు పడ్డాడు. "అరె! తల నొప్పిగా ఉందా? ఎంతసేపటినుంచి? అయినా మీరు ఈ అయిదురోజులనుంచీ విశ్రాంతే లేకుండా ఉంటున్నారు. తల నొప్పి వచ్చిందంటే రాదూ? అమృతాంజనమైతే లేదుగానీ దానికంటెకూడా గొప్ప మందు నాకు తెలుసు. ఉండండి! ఇప్పుడే తయారుచేసి యిస్తాను."

ఇలా అని అతను డ్రాయరులో నుంచి పాతకార్డు ఒకటి తీసి గొట్టంలాగా మడిచి, రాగి పాత్రమీద ఉంచి దానిని అగ్గిపుల్లగీసి ముట్టిస్తూ "రండి! ఇలా కూర్చోండి! మందు వేస్తాను" అన్నాడు. ఆమె ఏమీ అభ్యంతరం చెప్పకుండా వచ్చి అతని ముందు కూర్చున్నది.

కార్డు పూర్తిగా కాలిపోయింది. అవశిష్టభస్మాన్ని అతను జాగ్రత్తగా అవతలికి నెట్టాడు. రాగిపాత్ర మీద ఆవిరి పోసినట్టు ద్రవ బిందువులు సన్న సన్నగా ఏర్పడి ఉన్నాయి. అతను ఆ ద్రవ పదార్థాన్ని రెండు చేతులా రెండేసి వేళ్ళతో మాత్రమే గ్రహిస్తూ «కొంచెం ముందుకు కూర్చోండి» అన్నాడు. ఆమె కొంచెం సందేహిస్తున్నట్టుండి «ఆదేనా మందు. నేను వేసుకొంటాను లెండి!" అన్నది. అంతవరకూ ఉల్లాసంతో వెలుగుతున్న అతని ముఖం దగ్ధావశిష్టమైన కార్డు మాదిరిగా నల్లబడి పోయింది.

ఆమె అతని ముఖంలోని విషాదచ్ఛాయను చూచి తెల్లబోయింది. "అదేమిటి? కోపం వచ్చినట్టుందే ! దేనికి? నేనేమన్నానని?» అని ప్రార్థనా స్వరంతో అడిగింది.

అతను వెంటనే జవాబు చెప్పలేక పోయాడు. మాటలు నేర్చుకొంటున్నట్టు అతికష్టంమీద "కోపం దేనికండి! ఏంలేదు. మీరు మందు వేసుకోండి» అన్నాడు చిరునవ్వు తెచ్చుకొంటూ. కాని నవీనాదేవి తృప్తిపడలేదు. "నేను మీ మనస్సుకు కష్టం కలిగించే ఉంటాను. లేకపోతే మీ ముఖంలో ఇందాక ఉన్న ప్రసన్నత ఇప్పుడెందుకు మాయమవుతుంది? తప్పేమిటో చెప్పండి! దిద్దుకొంటాను. అంతేగాని మనస్సులోని శంక మనస్సులోనే ఉంచుకోనకండి ! అది చాలా అనారోగ్యకరం» అన్నది.

గదాధరుడి కిప్పుడు కొంచెం ఉత్సాహం కలిగింది. దానితో ఇష్టసిద్ధికి ఉపాయమున్నూ స్ఫురించింది. అతను మెరిసే కన్నుల్తో ఆమెను వీక్షిస్తూ ఇలా అన్నాడు.

"ఈ మందు నా చేతులతోనే వెయ్యాలి. ఇది వట్టి మందుగాదు. దీనిలో మంత్రం కూడా ఉంది. మీ రేమో ఈ పాపిచెయ్యి తాకితే పూర్వజన్మ పుణ్యమంతా హరించుకొని పోతుందన్నట్టు ప్రవర్తిస్తున్నారు. నేను ఇంత కష్టపడ్డా మీకు తలనొప్పి తగ్గక పోతుందేమో నని మాత్రమే నా భయం."

నవీనా దేవి ఆ మాటలకు పక్కున నవ్వింది. నవ్వుతూనే యిలా అంది.

"ఆ మంత్రం ఏమిటండీ! నాక్కూడా ఉపదేశిస్తారా! మీ దయవల్ల నేనూ కాస్త లోకోపకారం చేస్తా నిప్పటి నుంచీ. తలనొప్పి వచ్చినప్పుడు కలిగే బాధ యెలాంటిదో ఇప్పు డనుభవిస్తున్నా గదా! మీరీ మంత్రం కనుక ఉపదేశిస్తే నాదగ్గరకి వచ్చిన వాళ్ళకందరికీ ఈ బాధనుంచివిముక్తి కలిగిస్తాను."

"అలాగే గానీ-ముందీ మందు రాయనివ్వండి."

"కాదండీ! అందులో వశీకరణౌషధం ఏమీ లేదు గదా!"

"అయితే మీకు తలనొప్పి ఉత్తుత్తి దన్నమాట. లేకపోతే అంత బాధలో ఉన్నవారు మందు రాయించుకోటానికి ఇంత అభ్యంతర పెడతారా?"

"మందాకేది అభ్యంతరం చెప్పేదాన్ని కాదండి! ఏదో మంత్రం అంటున్నారుగదా! ఆ మంత్రం ఏం మంత్రమో ఏమో! కొంపదీసి నేననుకొన్నదే అయితే?"

"నాకే మీరనుకొన్న మంత్రం వచ్చిఉంటే ఇదంతా దేనికి?"

ఇలా అని అతను తన దగ్గిరే ఉన్న ప్రణయలేఖ ఆమె కందించాడు. ఆమె కవరుమీద ఉన్న తనపేరు మాత్రం చదివి యిలా అన్నది.

"ఏమిటీ? నాకే యీ ఉత్తరం! ఏం వ్రాశారేమి టిందులో?"

"చదువుకోండి! తినబోతూ రుచులు విచారించటం ఎందుకు?"

"కొన్ని చదవదగినవి ఉంటాయి; కొన్ని చదవకుండానే చించి పారవెయ్యవలసినవీ ఉంటాయి. ఇది ఏ రకానికి చెందిందో అని అడుగుతున్నాను."

"ఆ నిర్ణయం చెయ్యవలసింది మీరు గాని నేను కాదు గదా!"

"నిర్ణయం చెయ్యడానికి చదవాలి గదా మరి? మీరే వ్రాశారు కాబట్టి విషయం ఏమిటో చెప్పండి! దాన్ని బట్టి చదవదగిందైతేనే చదువుతాను."

"మిమ్మల్ని మాటల్లో గెలవడం చాలా కష్టమేనే!"

"అయితే నన్ను గెల్చుకోవాలని మీరు ఉద్దేశిస్తున్నారా?"

"మాట మాటకీ ఇలా విపరీతార్థాలు తీస్తే నేనేం చెప్పేది నా మొహం?"

"అది చెప్పడ మెందుకండీ ? కనబడుతూనే ఉన్నదిగా ! అయినా నాకు తెలియక అడుగుతాను. ఎదటనే తిరిగే మనిషికి ఉత్తరం వ్రాసే అగత్యం ఏమిటండీ ?"

"మీ రింత సంభావణ పొడిగిస్తూ మందు నిర్లక్ష్యం చేస్తున్నారు."

"నాకు ఆ తలనొప్పి అలా ఉండగా మీ మాటలవల్ల కొత్త తలనొప్పి పట్టుకుంటోంది. ఇది మందుల్తో పోయేది కాదు. నే నడిగినదానికి జవాబు చెప్పండి మరి"

"నన్ను మీ యిష్టం వచ్చినట్టు ఆడిస్తున్నారు!"

"నాకేం మంత్రాలూ మాయలూ తెలియవండోయ్. సూటిగా మాట్లాడతాను అంతే."

"నేను వంకరగా మాట్లాడుతున్నా నంటారు."

"మీతో చాలా చిక్కే నే! రాజుగారి చిన్నభార్య మహాపతివ్రత అంటే పెద్దభార్య చెడ్డదనే అర్థం వస్తుందా? చిన్నభార్య విషయం వచ్చింది గాబట్టి ఆమె విషయమే చెప్పడం జరిగిందని యెందుకనుకో గూడదు?"

"మీరు నా నోరు నొక్కివేస్తున్నారు."

"రామ రామ ! ఇది కూడానా ! బాబోయ్! మీరు బలే మనుషులు. కొంచెం సేపుంటే ఇది నా గొంతు నులిమేస్తున్నదని పది మందినీ పోగుచేసేట్టున్నారు. మీ దగ్గిరికి రావడమే తప్పైపోయింది."

ఇలా అని నవీనాదేవి గిరుక్కున వెనకకు తిరిగింది. పాపం ! గదాధరుడికి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

"నవీనాదేవీ !"

అతి కరుణాస్పదంగా ధ్వనించిందా గొంతు. ఆమె తే నవ్వుతో మళ్లీ అతనివైపు తిరిగింది.

"ఆ ఉత్తరం సాంతంగా చదివి జవాబు చెబుతారు గదూ !"

"నేను చెప్పవలసిన జవాబేమిటో ఇందాకే చెప్పాను"

"అయితే అది చదవరు-అంతేనా !"

"ఎదురుగా ముఖం ఉండగా అద్దం దేనికి చెప్పండి ! మీరు నాకు తెలియజెయ్యాగోరే దేమిటో ముఖాముఖగా ఎందుకు చెప్పగూడదు ?"

"ఎందుకంటేనా? ఎందుకంటే... ఎందుకంటే..."

"ఆ 'ఎందుకంటే' అనేది యెన్నిసార్లనాలో చెబితే నేనంటూ ఉంటానండీ ! తక్కినమాటలు మీరు చెప్పండి. ఊఁ! ఎందుకంటే...ఎందుకంటే"

గదాధరుడి ముఖం సిగ్గుతో కందిపోయింది.

అంతలో మేడమెట్లు ఎవరో ఎక్కుతున్నట్లు అడుగుల సవ్వడి వినవచ్చింది. నవీనాదేవి మురిపెంగా కవరు చూచు కొంటూ "కవరు తీసి చదువుతాలెండి ! అయినా మీరేం వ్రాయరాని వ్రాతలు వ్రాయరుగా ! మీ మీద నాకు ఆ మాత్రం నమ్మకం ఉంది" అంటూ తన గదిలోకి వెళ్ళి

పోయింది. గదాధరుడు తన పిరికితనాన్ని తానే నిందించుకొంటూ గదిలోకి వెళ్ళి తలుపులు గడియ పెట్టుకొన్నాడు.

## ౧౪

గదాధరుడు నవీనా దేవికి ప్రణయలేఖ అందించి ఆమె అనుగ్రహాన్ని అర్థిస్తున్న ఆ రాత్రివేళనే శాంతిపుర్గాభిముఖంగా ప్రయాణం చేస్తున్న దొక యువతి. ఆమెకు దాదాపు ఇరవయి ఏళ్ళుండవచ్చును. మూడేళ్ళ బాలిక ఆమె భుజం మీద నిద్రపోతున్నది. అప్పుడే ఉదయించిన కార్తీక చంద్రుడి వెన్నెలలో ఆ బిడ్డ ముఖం రమ్యంగా ప్రకాశిస్తున్నది. ఆపిల్ల ఏరాజవంశంలోనో జన్మించవలసింది. ఆయువతి కెలా కలిగిందో! తల్లికీ బిడ్డకూ పోలికే లేదు. తల్లిది చింపిరి జుట్టు, గుంటకళ్ళూ ఎత్తుపళ్ళూ నల్లని ముఖమూనూ. అంత నల్లని ముఖానికి క్రింది పెదవి అందం తెస్తున్నది. అలాంటి అధరమే లేకపోతే ఆ స్త్రీని ఏ పురుషుడూ చేపట్టే వాడు కాడేమో! మనిషి చాలా చిక్కి ఉన్నది. దుమ్ముగొట్టుకొని చీలికలు పేలికలైన చీర కట్టుకొని ఉన్నది. జాకెట్టు కూడా అక్కడక్కడ చిరిగిపోయి ఉన్నది. కొంతదూరం నడిచిన తర్వాత బొడ్డున దోపుకొన్న పొగాకు ముక్క కొంచెం తుంచి నోట్లో వేసుకొని కూర్చుని బిడ్డను ఒళ్ళో పడుకో బెట్టుకొంటున్నది. ధూమపత్ర రసం కొంత ఆస్వాదించి పరిసరాలు లాలా జలంతో పవిత్ర పరచి కొత్త

శక్తితో బిడ్డను ఎత్తుకొని మళ్ళీ నడక సాగిస్తున్నది. విశ్ర మించినప్పుడు లోలోపల గొణుక్కుంటున్నది.

"ఇయ్యేలాడి అంతుకనుక్కుంటాను. యెన్ని బాసలు సేసిండు! యెంత నమ్మించిండు! యిట్టాంటోడని కానుకో నేక పొయ్యాను. కాపడితేనే కరిగి పొయ్యాను. పోలి అంటే పొంగిపొయ్యాను. ఆడాడించినట్టల్లా ఆడాను. బిడ్డ నెత్తాను. ఇప్పుడిట్టా వొగ్గేత్తాడూ!

నాకోసం గాకుంటేమానె! బిడ్డకోసమైనా రావొచ్చు గందా! అందుట్టోనూ యెట్టాంటి బిడ్డ! సెందురుడికైనా వొంకుంటుందిగాని నా బిడ్డ కొంకనేదే! సూసి యెత్తుకో కుండా వెళ్ళి పొయ్యేవోళ్ళు నేరే! అడిదేం గుండే రాయా? బిడ్డన్జూద్దారనే అనుకోడే.

యెప్పుడు సెప్పినా 'యింకా ఆగు' 'యింకా ఆగు' అనే. యెన్నాళ్ళంట ఆగేది! జమీా యీాడి సేతుల్లో కొచ్చే తలికి నా జలను యెల్లమూరిపోద్ది. అప్పుడంట నన్ను పిలుసు కెళ్ళి గద్దె యెక్కిత్తాడంట!

గొప్ప యింట పుట్టిండు. చెప్పినంతా సేత్తాడని వొళ్ళోవాలాను. సివరికిట్టా సేసిండు. నాను తన పెళ్ళం అని యెవురూ యిన్రదంట! యింటే జమీాదర్కదంట! అది ముందే యెందుకు సెప్పిండు గాదు? ఉహుం! అట్టా గయితే నన్ను ముట్టనియ్యనుగా?

యియ్యేలయితే యెక్కడి పెద్దోల్లూ ఆడేవుంటారు. 'నాసయ్యా! తమ పెద్ద కోడల్ని' అని పోతా జమీాదారు

బాబుకాడికి. సేర దీత్తడో! యెయ్యో రెండేలో యిత్తా పొమ్మంటాడో! కొడుకును గూడా గెంకేత్తడో!

యెయ్యా గియ్యా నా కొద్దంటా. మొగుడితో కాపరం సేసుకుంటా నంటా. 'నేకుంటే వో వొందెకరాలు రాసి పారెయ్య' మంటా, ఆ తర్వాత మొగు దుండనీ పోనీ! నా బిడ్డా నేనూ సుకంగా బతుకుతాం"

ఈ విధంగా అనుకొంటూ ఆ యువతి శాంతిదుర్గపు పొలిమేరల్లోకి వచ్చింది. 'యీడ రొవంత సేద దీర్చుకుంటే వొక్క బిగీన వూల్లోకెల్లి పోవొచ్చు' ననుకొంటూ ఒక చెట్టు క్రింద కూర్చున్నది. మళ్ళా కొంతపొగాకు కాడతుంపి నోట్లో వేసుకొన్నది. బిడ్డను పక్కగా ఇసక దిబ్బమీద పరుండ బెట్టింది. పయనపు బడలికతో తానూ కునికింది.

ఇసక దిబ్బమీద పరున్న పసిబిడ్డ నిద్రలో క్రిందికి దొల్లింది. అయితే అది అంతా ఒత్తయిన యిసకతో ఉన్న నేల కాబట్టి బిడ్డకేమీ దెబ్బ తగల్లేదు. కదలికకు మెలకువ మాత్రం వచ్చింది. చక్రాలవంటి కళ్ళు నలువైపులా ప్రసరింప జేస్తూ పరిసరాలు పరికించింది పాప. ఎదురుగా ఎక్కడో దీపాలు వెలుగుతున్నాయి. ఎఱ్ఱని పట్టు బట్టలలో మెడనిండా పూల దండలతో బల్లమీద ఎక్కి ఆడుతూ పాడుతూన్న హరిదాసుగారు కనిపించారు. పాప కదేమో చూడదగిన వింతగా తోచింది. నెమ్మదిగా అటువైపు పడక సాగించింది.

సగం దూరం వెళ్ళేటప్పటికి బిడ్డ అలసిపోయింది. బాటకు ప్రక్కగా ఒక కుటీరం కనిపించింది. కుటీరంలో

దీపం వెలుగుతున్నది. తలుపులు తీసే ఉన్నాయి. దీపం వెలుగులో చాపా దిండూ కనిపించాయి. శిశువుకు అది తన కోసం తల్లి వేసిన పక్క అని తోచింది. తిన్నగా కుటీరం లోపలికి వెళ్ళి దిండుమీద తల పెట్టుకొని పడుకున్నది. క్షణాల మీద గాఢనిద్రపోయింది.

అది హేమశిల్పి కుటీరమే. వైరాగ్యం వర్ధిల్లుతున్న కొద్దీ అతను ఏదియేమై పోతుందో అనే ఆందోళనకు దూర మౌతూ వచ్చాడు. 'జరగనున్నది తప్పకుండా జరుగుతుంది. జరగడానికి వీలులేనిది ఎన్నటికీ జరగదు.' అని విశ్వసించటం మొదలు పెట్టాడు. కాబట్టి హరికథ వినడానికి వెళ్ళుతూ తలుపులు మూయకుండానే వెళ్ళిపోయాడు. అందువల్ల ఆ శిశువు నిరాటంకంగా అతని కుటీరం ప్రవేశించి హాయిగా శయనించింది.

నాటి హరికథకులు నారాణదాసుగారే. 'శంభో' అన్న మహానాదంతోనే శ్రోతల్ని ఆకట్టి వేశారు. తర్వాత ప్రారంభించారు పార్వతీకల్యాణ కథ. దివ్యసభలో సమాధి నిష్ఠుడైన పరమేశ్వరుణ్ణి వర్ణిస్తూ తామూ సమాధి నిష్ఠు లయారు. సదస్యుల్ని పరచింతా పరాఙ్ముఖుల్ని కావించారు. గగన విహారులైన దేవతల్ని వర్ణిస్తూ తామూ గగన యాన వినోదం అనుభవించారు, ప్రేక్షకుల చేత అనుభవింప జేశారు. పతి వొంత కాదన్నా పుట్టింటికి బయలుదేరే సతి చిత్తవృత్తిని విశదీకరిస్తూ మహిళల కందరికీ వారివారి చిత్త వృత్తులు అద్దంలోవలె ప్రత్యక్షం కావించారు. సతీ మరణ

వార్తవిని క్రుద్ధుడైన రుద్రుణ్ణి ప్రత్యక్షీకరిస్తూ సభ్య సహ స్రాళ్ళ హుంకార మాత్ర వికంపితుల్ని చేశారు. దక్ష యాగ విధ్వంస ఘట్టంలో తామే వీరభద్రులై బీభత్సాన్ని సాకారంగా ప్రదర్శించారు. తారకాసుర పీడిత దేవ బృందాభివర్ణనంలో కరుణ రసాన్ని కాలువలు కట్టించారు. శివపరిచర్యాసక్త అయిన నగరాజకుమారి సౌకుమార్యాన్ని గూర్చి ముచ్చటిస్తూ అచ్చపు రాజకన్యగా అభినయించారు. చెఱకు విల్లెత్తి పూవుటమ్ములతో పరమేశ్వరుడి హృదయాన్ని భేదించే కామదేవుణ్ని ప్రత్యక్షీకరించటానికి వయసు మళ్ళిన దాసుగారు నూనూగు మీసాల నూత్న యువకులుగా రూపొందారు. కామదహనవేళ ఫాలలోచనం విప్పారు. ప్రళయాగ్ని విరజిమ్మారు. పార్వతీ కపట బ్రహ్మచారుల సంవాదంలో శృంగారంతో హాస్యం జోడించి యువతీయువ కులకు రోమాంచం కలిగించారు. పరమేశ్వరులై దేవముని సంఘాలతో ఓషధీ ప్రస్థపురానికి పెండ్లికొడుకుగా తరలి వెళ్ళారు. కల్యాణ మండిరంలో నవవధువై వింతకులుకులు ఒలి కించారు. పార్వతీ సమేతులై నందిని ఆరోహించి హిమగిరి కాననాలలో విలాసవార్ధులై విహరించారు.

అనంతరకూ వారణాసి బ్రహ్మయ్యశాస్త్రిగారివాయు లీన వివాదం మాత్రమే బ్రహ్మానంద సహోదరమని బల్ల గుద్ది చెప్పినవారూ, హరినాగభూషణంగారి జంత్రిగాత్రా ల్లోనే అమృతం ఉన్నదని నొక్కి వక్కాణించినవారూ,

చెళ్ళపిళ్ళవారి పద్య పఠనం కంటె శ్రావ్యమైంది లేదని వాదించేవారూ, కొప్పరపు సోదరుల జిహ్వాగ్రాలయందే వాగ్దేవి నెలకొన్నదని ప్రశంసించేవారూ, డి. వి. సుబ్బారావుగారి నాటకాన్ని చూడటమే మహాభాగ్యమంటే బళ్ళారి వారి అభినయ కౌశలమే సర్వోత్కృష్ట మనివివరించేవారూ, నారాయణదాసుగారి హరికథ వినడంకంటె ఈ జన్మానికి కావలసింది లేదనే ఏకాభిప్రాయానికి వచ్చారు. దాసుగారు వట్టి కథకులేనా మరి! ఆయన కంఠం మేఘగంభీరం, భావన శ్రుతి శిరస్సునంత విహారిణి. లయ బ్రహ్మ అనే బిరుదు ఆయనపట్లనే సార్థక మయింది. రాయడుశాస్త్రిగారి వంటివారి శాస్త్రీయ విచారణలోనే వంక లెన్నగల పాండిత్యం ఆయనసొమ్ము. కవిత్వం ఆయనను బాల్యంలోనే వరించింది. వీణాది వాద్యాలు ఆయనకు కైంకర్యం చేస్తూఉంటాయి. హరికథా కథనానికి ఎన్నికళలతో పరిచయం ఉండాలో! ఎంత శాస్త్ర పురాణ విజ్ఞానం కావాలో! ఎటువంటి శరీర దార్ఢ్యం అవసరమో! ఏనుగు పాదంలో అన్ని జంతువుల పాదాలూ ఇమిడినట్లు యదార్థ హరికథాకథన విద్యలో సర్వ విద్యలూ ఇమిడి ఉంటాయన్న పరమ సత్యం నాటి శ్రోతల కందరికీ అవగత మయింది.

హేమశిల్పి దాసుగారి కథవిని బ్రహ్మానందపడ్డాడు. ఆ మహా పురుషుడు అటువంటి సామర్థ్యం ఎలా సంపాదించ గలిగాడు! పరమోచ్చమైన ఆ స్త్రైర్యంవల్ల, ఆత్మతాదాత్మ్యం లోనే అన్ని విద్యలూ అణిగి ఉన్నాయని పండితులు చెప్పిన

మాటకు ఇంతకన్న లక్ష్యం ఏం కావాలి? కాబట్టి సర్వం భావనలోనే ఉన్నది. మట్టితో రాతితో లోహంతో చేసిన విగ్రహాలలో దేవుడుంటున్నాడంటే భక్తుల భావనా బలం వల్ల కాదా? దైవానుగ్రహం ఉంటేనేకాని ఆ దివ్యభావన అబ్బదు. అది అబ్బని వాళ్ళకు దేవ మందిరాల్లోని దేవతలు వట్టి బొమ్మలుగానే కనిపిస్తారు. వాళ్ళు ఏనాటికీ ఈశ్వర తత్త్వాన్ని గుర్తించ లేరు. ఆ దివ్య భావన అబ్బినవాళ్ళు క్రమంగా సర్వవిశ్వం బ్రహ్మమయంగా సందర్శించగలరు. జిజ్ఞాసువులున్నూ బ్రహ్మ విద్యను ప్రసాదించగలరు. ఔరా! భావన యెంత అద్భుతమైనది!

ఇలా ఆలోచించుకొంటూ గృహోన్ముఖుడైన హేమ శిల్పికి తనకు అలవడుతున్న దివ్యభావన చక్కగా దృఢపడినట్లైతే తన యిష్టదేవత బాల, బాలాకృతితో తనకు సాక్షాత్కరించి తన పరిచర్యల్ని స్వీకరిస్తూ ఈ జీవిత శేషాన్ని ఆనందామృతంతో నింపి వేయగలదనే విశ్వాసం ఏర్పడింది ఆ విశ్వాసమే ఫలిస్తే! ఇహ జీవితంలో తాను కోరుకోవలసిందేవ ముంటుంది !

ఈ విధంగా భావిస్తూ మెల్ల మెల్లగా కుటీరానికి వచ్చాడు హేమశిల్పి. దీపపు వెలుగులో పదహారు వన్నెల బంగారం ప్రోగుపడినట్టున్న పదార్థాన్ని చూచాడు. అతని కళ్ళు మిలమిల లాడాయి! 'బహుశః ఆనాడు నాధనం హరించిన చోరుడే పశ్చాత్తాపం పొంది దొంగిలించిన సువర్ణాలు ఇక్కడ పోసి వెళ్ళిపోలేదు గదా!' అనుకొన్నాడు. చెదురు

తున్న కళ్ళతో, తడబడుతున్న కాళ్ళతో వణుకుతున్న చేతుల్తో ఆ పచ్చని పదార్థాన్ని సమీపించి స్పృశించి చూశాడు వృద్ధ హేమశిల్పి ఆ పదార్థం చేతికి తగలగానే విద్యుదాఘాతం పొందినట్లు అదిరిపడ్డాడు. కరుకు కాసులకు బదులు సుతిమెత్తని పసిపాప శరీరం చేతికి తగిలింది మరి!

విస్మయావిష్టుడైన హేమశిల్పి కొంతసేపటి వరకూ కూర్చున్నవాడు కూర్చున్నట్టే ఉన్నాడు. సుడులు తిరిగే ఆలోచనల్తో కళ్ళు మూసుకున్నాడు. బాహ్య జగత్తు కన బడటం మానగానే అంతర్జగత్తు మనోగోచర మయింది. ఆ అంతర్జగత్తులో తను బిందు మాత్రంగా మెరిసిందొక జ్యోతి. అదే అంతకంతకు విస్తరిస్తూ మనోగగన మంతటా ఆవరించింది. ఆ జ్యోతిర్వలయం మధ్య కరచరణాద్యవయ వాలతో భాసించిందొక మూర్తి. అప్రయత్నంగా అతని పెదవులు కదిలాయి.

"ఈ ఆనందం నిత్యం నిలపరాదా అమ్మా! జాగ్ర త్స్వప్న సుషుప్తులు మూడింటిలోనూ నిన్నే చూచేభాగ్యం అనుగ్రహించరాదా? పరీక్షకు నిలవలేని పరమ జడుణ్నే గదా!

పృథివ్యాం పుత్రాస్తే జనని బహవస్సన్తి సరళాః
పరం తేషాం మధ్యే విరళవిరళో ఽహం తవసుతః
మదీయో ఽయం త్యాగస్సముచిత మిదంనో తవ శివే
కుపుత్రో జాయేత క్వచి దపి కుమాతా నభవతి."

వెంటనే తల్లి చిరునవ్వు వెన్నెలలు ఒలకబోసింది. పలుకు తేనెలు విరజిమ్మింది.

"నిన్ను విడిచి ఉండలే కనేగా నీ యింటికి వచ్చాను."

ప్రత్యక్షరస్ఫుటంగా వినిపించింది వాక్యం హేమశిల్పి ఒళ్ళు జలదరించింది. తటాలున కళ్ళు తెరిచి చూశాడతను. అప్పుడే ఆ శిశువు మేలుకొని సకుతూహలంగా అతని ముఖాన్ని పరికిస్తున్నది. అతని ఆనందం అవధులు దాటింది.

"నువ్వేనా అమ్మా! నువ్వేనా! నన్ను విడిచి ఉండలేక నా యింటికి వచ్చావా? ఇంత అనుగ్రహమా తల్లీ!" అన్నాడతను పొంగిపోతూ.

శాల అతనివంకవింతగా చూచింది. వెండి తీగల్లాగా మెరిసే అతని పొడుగాటి గడ్డం ఏదో ఆట వస్తువుగా భావించింది. చిట్టి చేతులు చాచి దాన్ని అందుకో బోయింది. పారవశ్యంతో అతను ఆ చిన్నారిని లేవనెత్తి గుండెలకు హత్తుకున్నాడు. శిశువు అతని ముఖాన్ని మెత్తమెత్తగా స్పృశించ సాగింది. అతను క్రమ క్రమంగా బాహ్యలోకంలోకి వచ్చి ఆలోచించటం మొదలు పెట్టాడు.

"ఎవరీ పసిపాప! ఎలా వచ్చిం దిక్కడికి? సొంత యింట్లో పరున్నట్లు నాచాపమీద జంకు లేకుండా ఎలా శయనించింది? ఈ పిల్ల తల్లి కూడా ఇక్కడికి వచ్చిందేమో! పిల్లనిక్కడ పడుకోబెట్టి పెరట్లోకి వెళ్ళిందేమో! ఆవిడ నన్ను బాగా ఎరుగున్నదేమో! దగ్గర చుట్టమేమో! అయినానాకు

తెలియని చుట్టాలెవరున్నారు? ఎంత ఆపురాలు కాకపోతే చొరవగా ఇంట్లో ప్రవేశించి బిడ్డ నిక్కడ పరుండ బెట్టుతుంది?

అలా కాకపోతే హరికథకు వచ్చిన దగ్గిర ఊళ్ళవాళ్ళేవళ్ళయినా ఈ కుటీరంముందునుంచి వెళ్ళారేమో! వెళ్ళేటప్పుడు బిడ్డను నడిపించుకు పోతున్నారేమో! వెంటనే వస్తోందనుకొని ముందుకు సాగిపోయారేమో! ఎంత మైమరపైనా ఇంతసేపటిదాకా పిల్లను మరిచి వెడుతూ ఉంటారా? వెనక్కి తిరిగి త్రోవపొడుగునా వెతుక్కుంటూ వస్తున్నారేమో! అలాజరిగినా మాత్రం ఈపసికందుతల్లికోసంవీధిలోనే ఏడుస్తూ కూర్చోవాలి గానీ నా యింట్లో కెందుకు వస్తుంది? అబ్బే, ఇలాగూ జరిగి ఉండదు. మరెలా జరిగి ఉంటుంది?

ఆతడు యిలా వితర్కించుకొంటూ కర్తవ్యంపాలు పోకుండా ఉండగా పాల బెంగతో పాప ఏడ్పు సాగించింది. అయ్యో! పాపం. పాపకు ఆకలయినట్టుంది. ఏడుస్తున్నదిఅని జాలిపడుతూ చిగుతిసి యేదయినా పెట్టి ఆ యేడ్పు మానిపించాలని గతదినం ఒక పుణ్యాత్మురాలు తనకు పొట్లం కట్టి యిచ్చిన లడ్డూలు కొయ్యపెట్టెలోనుంచి తీసి పాపాయికి కొంచెం కొంచంగా నోటికందిస్తూ వచ్చాడు. నోరు తియ్యబడుతూ ఉండడంవల్ల బిడ్డ యేడుపు చాలించింది.

అప్పుడతను నెమ్మదిగా ఆ అనాథ బాలవృత్తాంతం తెలుసుకొనడానికి ప్రయత్నం ప్రారంభించాడు. బాలికను ఎత్తుకొని పేట్లో చూచాడు. అక్కడ ఎవరూ కనిపించ



లేదు తిరిగి యింట్లోకి వచ్చాడు. ఇల్లు నలుమూలలా చూచి ఎక్కడా ఎవరూ లేరనే నిశ్చయం చేసుకొని వీధిలోకి వచ్చాడు. పాపాయి మళ్ళీ ఏడుపు మొదలుపెట్టింది. 'ఏం పాపా, ఏం కావాలి? అని అడిగాడతను. అమ్మ, అమ్మ, అన్నది చిన్నారి రోదనస్వరం హెచ్చిస్తూ. అతను జాలిపడి 'అమ్మ ఏదీ ఎక్కడుంది, అని అడగానే ఎదురుగా కొంతదూరాన ఉన్న ఇసక దిబ్బలవైపు చూపించింది. జమీందారుగారు అక్కడ వేద పాఠశాల ఒకటి కట్టించదలచి పునాదుల తీయిస్తున్నారు. పరాయిచోట్లనుంచి వచ్చిన కూలీలు కొంతమంది ఆ చేరువనే చిన్నచిన్న గుడిసెలు నిర్మించుకొని నివసిస్తున్నారు. ఈబిడ్డ ఆ కూలీల తాలూకేనేమో! అడిగి తెలుసుకొందామని హేమ శిల్పి పిల్లను ఎత్తుకొని ఆ యిసక దిబ్బలవైపు నడక సాగించాడు.

అక్కడికి వెళ్ళేవరకూ శిశువు ఏడుస్తూనే ఉన్నది. హేమశిల్పి ఆ గుడిసెలలోని కూలీలను పిలిచాడు అక్కడ ఎంతసేపటికీ ఎవరూ పలకలేదు. అందరూ హరికథ విన్నచోటనే ఉండిపోయారేమో. ఇప్పుడక్కడ తోలుబొమ్మలాట జరుగుతున్నది. అదిచూడకుండా వాళ్ళు తిరిగివస్తారా? అతను పదే పదే పిలవగా పిలవగా ఒక వృద్ధురాలు ఒక గుడిసెలో నుంచి లేచివచ్చింది. హేమశిల్పి శిశువును ఆమెకు చూపించి తన సందేహాం వెలిబుచ్చాడు, ఆమె బిడ్డను పరీక్షగా చూచి యిలా అంది 'అయ్యబాబు, యీపిల్ల దకూలోళ్ళయింట పుట్టదగిందేనా, యే రాచ బిడ్డో! యిక్క డెవుళ్ళకీ యిట్టాటి పాప లేదు. యెట్టా దారి తప్పొచ్చిందో"

చేసేది లేక హేమశిల్పి బాలతో తిరిగి తన కుటీరం వైపు మళ్ళాడు. కానీ నిసుగు ఇసకదిబ్బలమీదకే చెయ్యి చాపుతూ 'అమ్మ అమ్మ' అని గట్టిగా రోదించటం మొదలు పెట్టింది. ఆ వృద్ధుడు జాలితో గ్రహిస్తూ "ఎక్కడమ్మా అమ్మ?" అని ప్రశ్నించాడు 'అక్కడే! అక్కడే!' అన్నది బిడ్డ దృఢస్వరంతో. విస్మయంతో ఆ యిసక దిబ్బమీదకు ఎక్కి చూచాడతను. దిబ్బకు దిగువనే అచేతనమై పడిఉన్న ఒక యువతి శరీరం కనిపించింది నిలువుగ్రుడ్లతో, తెరుచుకొన్న నోటితో వికృతంగా ఉన్న శరీరం. ఆ అనాథ స్త్రీమూర్తినీ, ఆ మాతృహీన బాలికనూ పరికించగా అతని గుండె నీరై ప్రవహించింది.

## ౧౭

కాశీనాథ ప్రభువులు నవీనాదేవిమీద ఎన్నో ఆశలు పెట్టుకొన్నారు. ఆ విద్యావినయ సంపన్నురాలు తమయింటి కోడలైతే కుటుంబమర్యాద నిలవగలదనీ, గాదాధరాదులనంద రినీ సన్మార్గాన నడిపించగలదని ఆశించారు. పైపెచ్చువీణా వాదనంలో ఆమెకుగలనేర్పు వారినెంతో ముగ్ధుల్ని చేసింది. ఉత్సవాల నెపంతో వచ్చిన సంగీతవిద్వాంసుల సమక్షంలో నవీనాదేవిచేత వీణకచేరి చేయించినప్పుడైనా కొన్ని మెళుకువలు వారివల్ల ఆమె గ్రహించేట్టుచేస్తే ఆమె ఆ విద్యలో మరింత

రాణించగల దని కుతూహలపడ్డారు. అందువల్ల ఉత్సవాలు ముగిసినా విద్వాంసుల నందరిని తమకు అతిథులుగా మరి రెండురోజులు శాంతిదుర్గంలోనే ఉండవలసిందని అభ్యర్థించారు. పండితులు వారి కోరికను తిరస్కరించ లేక పోయారు.

సూర్యోదయానంతరం జాము ప్రొద్దు గడచిన తర్వాత ప్రభు మందిరంలో విద్వాంసు లందరూ సమావిష్టులయ్యారు. కుమార సమేతులై బంధుమిత్రులతో ప్రభువులు విచ్చేసిన పిమ్మట వేదికకు వెనక గల తెర తొలగించుకొని చేటీసమేతురాలై వచ్చి నిలిచింది నవీనా దేవి. సభావందనం చేసి పెద్దల అనుమతితో వేదికపై కూర్చున్నది. అంతలో పరిచారికలు వీణకొనివచ్చి ఆమె ముందు ఉంచి వెళ్ళారు. ప్రభువుల కనుసన్నతో విపంచి గ్రహించింది ఆమె.

"గిరిరాజ సుతా తనయ ! సదయ !
పరిపాలయ మాం - ఇభ రాజముఖ !"

అనే త్యాగరాజ కృతిని ప్రారంభించి వీణా నాదానికి తన కలకంఠం జోడించి గజానన స్తుతి ప్రారంభించింది. తల్లి ఒడిలో కూర్చుండి ముద్దు ముద్దుగా పలికే బాలలాగా వీణ ఆమె అంకం ఆశ్రయించి అలతి అలతి పలుకులు కండ చక్కెర పలుకుల మాదిరిగా వినిపిస్తూ క్రమ క్రమంగా అమృతలహరి వంటి నాదాన్ని ఆలపించటం మొదలు పెట్టింది. విద్వాంసులు విచికిత్సలో పడ్డారు; 'వింపచి స్వరం వల్ల ఆమె కంఠస్వరానికి నిండుదనం వస్తున్నదా! ఆమెగాత్రం వల్లనే వీణానాదానికి మాధుర్యం అతిశయిస్తున్నదా!' అని

ఇభరాజముఖుడూ, ఫణిరాజకంకణుడూ అయిన గణనాథుడు శ్రోతల హృదయంలో మెలగడం ప్రారంభించాడు.

శ్రోతలందరూ ఏకవారంగా శిరఃకంపం చేస్తుంటే భోగీశ్వరుడే పరవశుడై వేయి పడగలూ పంకిస్తున్నట్లున్నది. అందరి నేత్రాలూ ఆశ్చర్య విస్ఫారితాలవుతుంటే మానసంలో సహస్రదళ కమలం వికసిస్తున్నట్లున్నది అందరి చేతులూ లయబద్ధంగా తాళం వేస్తుంటే నాగ లోకం సాక్షాత్కరించి నర్తిస్తున్నట్లున్నది. పరిమిత వైశాల్యంగల మందిరంలో. కూర్చున్న సదస్యులకు అపరిమితానంద జగత్తు అనుభవ గోచరమవున్నది. త్యాగరాజస్వామికీ తమకూ అభిన్నానుభావించే బ్రహ్మయ్యశాస్త్రి గానాదబ్రహ్మంలో లీనులై తామున్నా ఫిడేలువాయిస్తున్నట్టు భ్రమించి ఉపాంశువుగా నాదోపాసన ప్రారంభించారు. ఘంటయ్యశాస్త్రి గారు మృదంగ వాదనంలో మణికట్టుకు ఎగువ భాగం కదలనియ్యరు. అటువంటివారు తాళంవేస్తే అభ్యాసంలో మోచేతులపైన కూడా కంపం వ్యాపిస్తుంటే నిగ్రహించుకోలేకపోయారు. హరినాగభూషణంగారు సంగీతం విషయంలో దేవతలైనా మెచ్చరు. అలాంటివారు 'భేష్! సెబాస్' అనకుండా ఉండలేకపోయారు. ఏ విద్యలోనైనా ఎవరికైనావంక లెన్నే నారాయణ దాసుగారు ఆనంద బాష్పాలు చెక్కిళ్ళవెంట దిగజారుతుంటే నిమీలిత నేత్రులై సమాధి స్థితులౌతున్నట్టు భాసించారు.

ఇక ప్రభువులూ తద్బంధువులూ సహజమైన గాంభీర్యాన్ని చిక్కబట్టుకొనటానికి నూతనోపాయాలు అన్వే

షించటం మొదలు పెట్టారు. పరిచారికల తెరిచిన నోళ్ళు తెరచినట్టే ఉన్నవి. పరిసరోద్యానాల నుంచి వీచే వాయువు గూడా తాను ఏ మాత్రం వేగంగా వీచినా ధ్వనిఉత్పన్నమై రసజ్ఞుల ఆనందానుభూతికి భంగం కలుగుతుందేమోనని, అప్పుడే ప్రాకటం నేర్చుకొంటున్న పసిపాపలాగా పారాడు తున్నట్టున్నది.

ఇలా సదస్యులు రసజగత్తులో విహరిస్తూ బాహ్య జగత్తు విస్మరించి ఉన్న సమయంలో హఠాత్తుగా వీధిలో పెద్ద సందడి వినిపించింది.

"అయ్యో! పాపం! దిక్కులేని చావు చస్తోంది. ఎక్కడనుంచి వచ్చిందో! ఎందుకు వచ్చిందో!"

"ఎంత చక్కటి పాపాయమ్మా! ఇప్పుడే తల్లిలేనిదై పోతోంది"

"ఈ బిడ్డను ఎవరైనా తీసుకుపోయి పెంచుకొంటారులే. ఆ తల్లికి ఈబిడ్డ ముద్దు మురిపాలు చూచే యోగం లేనట్టుంది"

"గబగబా వెళ్ళి ఎవరైనా పెద్ద వైద్యుణ్ణి తీసుకు వస్తే బాగుంటుంను. ఏ మందైనా వేసి బతికిస్తాడేమో!"

"ఇంకేం బతికించటం! నాడే అందడం లేదట."

"అసలు చలనమే లేందే ఒంట్లో! శవమే అనుకో వచ్చును"

"ఇదే మన యింట్లో మనిషైతే ఊరుకొనే వాళ్ళమేనా! వైద్యం చేయించకుండా ఉంటామా!"

"ఆ! చేయిస్తాం చేయించమూ? మా ఆవిడ ఇప్పటికి నాలుగేళ్ళనుంచీ మంచంలో ఉన్నది. ఏదో కూరగాయ వైద్యమేగానీ ఏవైద్యుడి చేతైనా మందిప్పించ గలిగానూ? మన బతుకు లెంత; మన మెంత?"

"అలాఅని చచ్చిపోతున్న మనిషిని కాపాడటానికి ప్రయత్నమే లేకుండా ఉంటామా!"

"మనకేం మళ్ళా, మావాళ్ళా? ఇలాంటివి దొరల వల్ల కావలసిన పనులేగాని మానవల్ల అయేవి కావు"

"దొరగారితో మనవి చేద్దాం పదండయ్యా! వారు ఆ అమ్మాయికి దివాణపు డాక్టరుచేత మందిప్పిస్తారు"

"దొరగారేదో పాటకచేరీలో ఉన్నట్టున్నారు. ఈ సమయంలో......"

"ఉంటేనేమయ్యా! కాస్త విసుక్కుంటారేమో! అయితేనేం? ఒకప్రాణి బ్రతుకుందేమో! ఆ పుణ్యం మనది కాదూ!"

"దొరగారిల్లాంటి వాటికెప్పుడూ కోపం తెచ్చుకోరు—బాబూ! బాబూ! బాబూ!"

ఆ ప్రార్థనాలాపాలు తారస్థాయికి చేరుకొనేసరికి సదస్యుల రసజగత్తు నామరూపాల్లేకుండా పోయింది. 'ఏమిటది? ఏమిటది?' అంటూ కాశీనాథ ప్రభువులుసభామందిరంనుంచి అవతలికి వెళ్ళి క్రిందికి చూచారు. మేడక్రింద ఎంతోమంది జనం మూగి ఉన్నారు. అందరి మధ్యా బంగారు ప్రతిమలాంటి బాలికను ఎత్తుకొని నిలుచున్నాడు హేమశిల్పి. ప్రభు

వును చూడగానే హేమశిల్పి అతి విషణ్ణతతో ఇలా నివేదించాడు.

"ఎవరో అమ్మాయి బాబూ! మన పాఠశాల కట్టే చోట పడిఉంది. ఈ పాప ఆ అమ్మాయి బిడ్డేనేమో! తొందరగా వైద్యం జరగకపోతే ఆఅమ్మాయి బతకనట్టుంది— అందుకని..."

కాశీనాథుల నేత్రాలు అశ్రుపూరితాలయినాయి. తక్షణం ఆస్థాన వైద్యుల్ని తీసుకొని రావలసిందని అనుచరులకు ఆజ్ఞ యిచ్చి స్వయంగా ఆ అనాథ యువతిని చూడటానికి బయలుదేరుతూ నవీనాదేవిని చూచి "అమ్మా! ప్రస్తుతానికి మీ వీణానాదం మధ్యలోనే నిలిపి వెళ్ళవలసి వస్తున్నది. ఇందుకు మీరు అన్యథా భావించకుగదా!" అన్నారు.

నవీనాదేవి అందుకు సిగ్గుపడుతూ ఇలా అన్నది.

"అనాథుల్ని వాళ్ళ గతికి విడిచిపెట్టే సమర్థుల్ని భగవంతుడు మెచ్చుకోడనే విన్నాను. అందుకు అన్యథా భావించవలసిన పనేమున్నది? పెద్దలు అనుమతిస్తే అక్కడికి వచ్చి ఆ ఆపన్నురాలికి నా చేతనైన సాహాయ్యం చెయ్యాలని కుతూహల పడుతున్నాను."

ఈ సంభాషణ ఇలా ఉండగా హేమశిల్పి ఎత్తుకొని ఉన్న శిశువును చూచి లోలోపలే మథనపడి పోతూ ఉన్న గదాధరుడు తలయెత్తి ఎవరి వంక చూడటానికైన్నా భయపడుతున్నట్టున్నాడు. చిత్రి—బాలిక కేవలం అతని నోట్లోనుంచి ఊడిపడట్టున్నది. నవీనాదేవి కూడా ఆ బాలిక తల్లిని చూడటానికి వస్తాననడం వినగానే అతను ఉలిక్కి

పడ్డాడు. నళీనాదేవి అతని ఉలికిపాటుకి హేతువు తెలి య విచిత్రంగా చూచింది. అంతలో గదాధరుడు తన్నుతాను సంబాళించుకొని తండ్రితో ఇలా అన్నాడు.

"ప్రభువులు సెలవిస్తే ఆ దీనురాలికి చెయ్యవలసిన సాయమంతా చేయిస్తాము మేము. వయోధికులైన దేవర వారూ, అంతఃపుర కాంతిలూ శ్రమపడి అంతదూరం రావల సిన పనిలేదు. పైగా ఇంతమంది విద్వాంసుల్ని రప్పించి సభ ముగియకుండానే మన పనులమీద మనం వెళ్ళిపోవడం బాగుండదు."

ప్రభువులు కుమారుడి సమయస్ఫూర్తికి సంతృప్తులై నారు. విద్వాంసులున్నూ గదాధరుడివైపు ప్రశంసాత్మక దృష్టులు సారించారు. ఒక్క నారాయణదాసుగారుమాత్రం అతనిని నఖశిఖ పర్యంతం పరికించి గుబురు మీసాల మాటున చిరునవ్వు దాచుకొన్నారు. గదాధరుడు గబగబా మేడమెట్లు దిగి హిమశిల్పితో కలిసి ఆ మరణాసన్న పడి ఉన్న చోటికి వెళ్ళాడు.

కాని ఆ యువతి మరణాసన్న కానేకాదు. మరణాతీతు రాలే అయిందప్పటికి. యౌవనంలో ఉన్నా సహజ సౌంద ర్యమూ-పోషణా లేకపోవడం వల్ల ఆకర్షణ కోల్పోయి ఉన్న ఆమె ముఖం ప్రేతకళతో పూర్తిగా వికృతమై పోయింది. ఆ ముఖాన్ని చూచినవారికి జాలికంటె హెచ్చుగా జుగుప్స కలుగుతున్నది. ఆస్థాన వైద్యులు వచ్చి పెదవి విరిచి వెళ్ళిపోయారు. గదాధరుడి ముఖంలో ఒక విధమైన సంతృప్తి తొలకరించింది. కాని ఎండ తగులుతున్నదనే

మిషతో అతను ముఖం సగం ప్రచ్ఛన్నమయ్యేట్టు చుట్టు కొన్న తలపాగా ఆ సంతృప్తి రేఖను ఎవరికీ కనిపించనియ్యకుండా దాచి పెట్టింది.

అప్పుడు 'ఈ అనాథ ప్రేతానికి అంత్య క్రియలు ఎవరు చెయ్యాలి? ఎలా చెయ్యాలి?' అనే మీమాంస లేవ దీశారొకరు. 'నేనూ చేసేది' అని యెవ్వరూ ముందుకు రాలేదు.

'ఏ కులమో తెలియనిదానికి ఎలా చేసేది?'

'ఏ మతమో మాత్రం ఎలా చెప్పగలం?'

'మెడలో మంగళసూత్రం ఉందిగాబట్టి హిందూస్త్రీ అని చెప్పవచ్చులే.'

'క్రైస్తవుల్లో ఒక తెగవాళ్ళున్నారు. వాళ్ళ ఆడ వాళ్ళు హిందూస్త్రీల మాదిరిగా మంగళసూత్రమూ తిల కమూ కూడా ధరిస్తారు."

ఇంతలో మృతవ్యక్తిని పరిశీలించిన ఒక వృద్ధురాలిలా అన్నది.

"చేతిమీద కనకదుర్గమ్మ పచ్చబొట్టుంది బాబూ! ఆ బిడ్డ మన మతంలో వున్నదే. పైగా మెళ్ళో అదేదో శివలింగకాయేమో! అంతా సూస్తే జంగమమ్మాయనిపిస్తది"

జంగాలు ఉలిక్కి పడ్డారు.

"అది లింగకాయా గాదు, పాడూ గాదు. నగానట్రా లేదని అదేదో మెళ్ళో కట్టుకొని వుంటుంది. బాగా చూసిరా అమ్మా!"

జంగాలిలా ఆ వృద్ధురాలిని ఆదేశించగా గదాధరుడు అడ్డు తగిలాడు.

"ఎవరైతేనేం? ఇది కాశీనాథేశ్వర క్షేత్రం కాబట్టి శైవమతానుసారం అంత్యక్రియలు జరిపించండి! అందుకు కావలసిన పైకం మేం భరిస్తాం."

అతనిలా అనేసరికి అందరి ముఖాలూ వికసించాయి. సొంతసొమ్ము ఖర్చుపెట్టేపనిలేదు. యువరాజావారు తృణమో పణమో అదనంగానే యిప్పిస్తారుగానీ గీసి గీసి యిప్పించరు. జంగాలకు సంతర్పణకూడా జరుగుతుంది. కాని కర్త అయినవాడు పదిసార్లు చన్నీళ్ళలో మునుగుతూ ఉండాలి రోజుకు ఒక్కసారే భోజనం చెయ్యాలి. ఇన్నింటికన్న కష్టం ఆ పదిరోజుల్లో బ్రహ్మచర్యం పాటించాలి. కాబట్టి జంగాలింకా ఆలోచనలో ఉన్నారు.

అంతలో గదాధరుడిలా అని ఒక్కసారి హిమశిల్పి ఒళ్లో పడుండి అప్పుడే నిద్రలేచిన పసిబిడ్డవంక చూచాడు. అప్పుడే శిశువుకూడా అతనివైపు కళ్లు త్రిప్పింది. అతనిలో ఏం ఆత్మీయత గమనించిందో గాని తియ్యగా నవ్వింది. అతను అందుకు సంతోషించినట్లే ఉన్నాడు గానీ ఎందుకో ముఖం ప్రక్కకు త్రిప్పుకొని కళ్లు తుడుచుకున్నాడు.

"యువరాజావారి దెంత జాలి మనసో! ముక్కూ మొహం తెలియని వాళ్లకోసం కన్నీళ్ళు పెట్టుకొంటున్నారు."

"యిలాంటి దరముదాత లుండబట్టే పెపంచకం నిలబడివుంది."

"దొరగారు మన పెబువులై పుట్టడానికి మనమెంత పున్నెం సేసుకున్నామో!"

అక్కడ ఉన్నజనం ఇలా తలకొక విధంగా అను కొంటూ ఉంటే హేమశిల్పి అందరి వంకా చూచి యీ విధంగా అన్నాడు.

"ఈ చంటిబిడ్డ తనంత తాను నాయింటికి వచ్చింది. తినే తన తల్లి చెంతకు నన్ను తీసుకొని పోయింది. తల్లి కోసం కొంతసేపే ఏడ్చినా నన్నుమాత్రం విడిచి ఉండడం లేదు. ఇదంతా ఆలోచిస్తే ఈ పసిపాప మంచిచెడ్డలన్నీ నేనే చూడాలని నాతల్లి బాలా త్రిపుర సుందరి సంకల్పించిందనే విశ్వాసం కలుగుతున్నది. కాబట్టి నా శక్తికి తగ్గట్టు ఈ అనాధ స్త్రీ అంత్యక్రియలూ నేనే చేస్తాను. నేటినుంచీ ఈ చిన్నారి పోషణా భారమూ నేనే వహిస్తాను. యువరాజా వారు దయచేయిస్తామన్న పైకం కాదన్నానని నామీద కోపం తెచ్చుకోరనుకుంటాను. ఎందుకంటే ఇప్పుడు నేను తింటున్నదంతా వారిసొమ్మేగదా!"

ఇలాఅని హేమశిల్పి గదాధరుడివైపు సాభిప్రాయంగా చూచాడు. గదాధరుడికి కొండంత బరువు తగ్గినట్టయింది. అతను హేమశిల్పిని చూచి "మాకు కోపం దేనికి? మేము వహించవలసిన భారం మరొకరు వహిస్తున్నందుకా? కాని ఒక్కమాట! ఈ బిడ్డను పోషించటానికి ఎప్పుడు ఎంత పైకం కావలసి వచ్చినా మా దగ్గర పుచ్చుకోవచ్చును. పిల్లను మాత్రం జాగ్రత్తగా పెంచాలనేదే మేం చెప్పేది." అని నెమ్మదిగా అక్కడనుంచి లేచి దివాణంవైపు నడిచాడు

## ౧౬

హేమశిల్పికిప్పుడు ఇహజీవితంకూడా రసవంతమనిపిస్తున్నది. ఇంట్లో ఉన్నంతసేపూ వృత్తికి సంబంధించిన పనిచేస్తూ ఉన్నా ఆ దైవదత్త పుత్రికకు ఏవేవో ఉపచారాలు చేస్తూనే ఉంటాడు. తాను తెల్లవారక ముందే చన్నీటి స్నానం చేస్తున్నా బిడ్డకుమాత్రం వేణ్ణీళ్ళుపెట్టిఉంచుతాడు. తాను నిద్రలేచే సరికి బాల మేలుకోక పోతే మేలుకొలుపు పాటలు పాడుతాడు. పిల్ల ఎంత మారాం చేసినా విసుక్కోకుండా బుజ్జగిస్తూ కాలకృత్యాలు జరిపిస్తూ ఉంటాడు. రుచ్య వస్తువులతో బాలభోగం జరుపుతూ ఉంటాడు. ఏవేవో ఆట వస్తువులు ఇచ్చి, పాప వాటితో ఆడుకొంటూ ఉంటే తన అనుష్ఠానం తీర్చుకుంటాడు. దేవాలయానికి వెళ్ళుతూ బిడ్డనుకూడా ఎత్తుకు వెళ్ళుతుంటాడు. బజారులో కనబడ్డ ఏ ఆటవస్తువైనా ఏ ఉపాహారమైనా కొనిపెట్టి సంతోషపడుతూ ఉంటాడు. చిన్నారి చిరునవ్వు చూస్తే దేవేంద్ర పదవి లభించినట్టు పొంగిపోతూ ఉంటాడు.

ఇప్పుడతను ఎవరితో మాట్లాడినా ఆపాపనుగురించే. ఏది వర్ణించినా ఆ బిడ్డ అభిరుచుల్ని గురించే. ఎవరినేసలహా అడిగినా శిశువును ఎలా పెంచాలనే విషయాన్ని గురించే. అయితే అతని యీ మాట లిప్పుడు ఎవరికైనా ప్రియంగానే ఉంటున్నాయి. ఒక్కరుకూడా అతనిని మనస్సులో నైనా విసుక్కోవడంలేదు. పైగా తమంతట తామే అతన్ని పిలిచి బిడ్డ యోగక్షేమాలు విచారిస్తూ ఉన్నారు. ముఖ్యంగా స్త్రీలు అతనితో పనిగట్టుకొని మాట్లాడుతూ 'పాపకోసం'

అని ఏవేవో కానుకలు ఇస్తూ ఉన్నారు. విశేషం ఏమిటంటే దివాణం నుంచి బిడకు రోజురోజూ రకరకాల కానుకలు లభించటం వీటితో ఆ బాల పేద అయిన హేమశిల్పియింట్లో పెరుగుతున్నా రాజపుత్రికలతో సాటిగా భోగాలు అనుభవిస్తున్నది. వీతస్పృహులైన కాశీనాథులుగూడా ఆ కుమారిపట్ల ఎంతో ఆదరాభిమానాలు చూపుతున్నారు. గదాధరుడు రోజూ ఏదో ఒకవేళకు హేమశిల్పి కుటీరానికివచ్చి శిశువుతో కొంతసేపు ముచ్చటలు చెబుతూ వినోదిస్తున్నాడు. కాని లోకులకిదేమీ అసహజంగా తోచలేదు. అంత ముద్దువచ్చే బిడ్డతో కాలక్షేపం చెయ్యటానికిఎవరుకుతూహలపడరు?

ఇలా కొన్నాళ్లు గడవగా హేమశిల్పి తన పెంపుడు కూతురికి ఏపేరు పెడితే బాగుంటుందో అని ఆలోచించ సాగాడు. సువర్ణంలాగా మెరుస్తున్నది కాబట్టి సువర్ణ అని పిలిస్తే సరిపోతుందని ఒకరు అన్నారు. దేవదత్త అయిన పుత్రిక కనక దేవదత్త అనే పేరుపెట్టవలసిందన్నారింకొకరు. చాలా అందమైనపిల్ల కాబట్టి రంభ అనే పేరు సార్థకం అవుతుందని కొంతమంది అన్నారు. 'నీ యిష్టదేవత బాలా త్రిపురసుందరిగదా! ఆపేరే పెట్టు' అన్నారు కాశీనాథ ప్రభువులు. హేమశిల్పికి ప్రభువు లన్నమాట నచ్చింది. బిడ్డకు ఆపేరే పెట్టాడతను.

బాలా త్రిపురసుందరి అనేపేరు ఆబిడ్డకు తగిఉన్నదనే అందరూ అభిప్రాయపడ్డారు. అయితే అక్షరాలు ఎక్కువగా ఉన్నాయి కాబట్టి కొంతమంది ఆమెను బాల అంటే, కొంతమంది త్రిపురసుందరి అంటూ పిలుస్తున్నారు. మరికొంత

మంది త్రిపుర అంటున్నారు. ఇంకా కొంతమంది సుందరి అనే అంటున్నారు. ఎవరు ఏపేర పిలిచినా పలుకేదైవంలాగా బాలా త్రిపురసుందరికూడా తన్నెవరెలా పిలిచినా పలుకుతున్నది ముద్దుమాటలతో ముచ్చటలు చెబుతున్నది. క్రమంగా శాంతిదుర్గంలో హేమశిల్పికన్నా, గదాధరుడికన్నా, కాశీనాథ ప్రభువులకన్నా కాశీనాథేశ్వరుడికన్నా బాలా త్రిపురసుందరికే ప్రాముఖ్యం అబ్బుతూ వచ్చింది. రోజూ ఏదో ఒకవేళలో బాలా త్రిపురసుందరిని స్మరించని వారు అక్కడ మచ్చుకైనా కనిపించటంలేదు.

## ౧౭

ప్రస్తుతం శాంతిదుర్గంలో చాలా మార్పులు వచ్చాయి. ఏ సుముహూర్తాన కాశీనాథేశ్వరస్వామి ప్రతిష్ఠ జరిగిందో అదిమొదలుకొని క్రమక్రమంగా గ్రామం అంతటా ప్రశాంత వాతావరణం నెలకొన్నది. గదాధరుడి జీవితం శాంతి మహా సముద్రములో నావలాగా ఒడిదుడుకులు లేకుండా సాగిపోతున్నది. నవీనాదేవి అతని గృహలక్ష్మి అయింది. 'కార్యేషు దాసీ కరణేషుమంత్రీ' అన్న కులధర్మపత్నిలక్షణాలు ఆమెలో మూర్తీభవించాయి. కాబట్టి కాశీనాథులు కైలాసవాసులైనా గదాధరుడికి గృహవిషయాలుగానీ సంస్థానవ్యవహారాలుగానీ ఎటువంటి మనఃక్లేశానికి తావునివ్వకుండా సాగిపోతున్నాయి. ప్రతి సంవత్సరం స్వామికల్యాణోత్సవాలు కాశీనాథులున్నప్పటి మాదిరిగా నేజరుగుతున్నాయి. అయితే గదాధరుడికొక్క విషయంమాత్రం అభీష్టానుసారంగా చక్కదిద్దుకొనడానికి

సాధ్యపడలేదు. అది ఇలాంటిదని అతను నవీనాదేవికి చెప్ప లేదు చెప్పినట్టయితే ఆమె దానిని చక్కబరిచిఉండేదేమో!

బాలా త్రిపురసుందరి యిప్పుడు పదహారేళ్ళ ఎలజవ్వనంలో ఉన్నది. అయినా హేమశిల్పివద్ద ఆమె నాలుగైదేళ్ల పసిపాపలాగానే మెలుగుతూ ఉంటుంది. అతనితో కబుర్లు చెప్పుకొంటూ ఉండటంకంటె ఆమెకు ప్రియమైందిమరొకటి లేదు. శాంతిదుర్గంలో ఆమెయీడు యువతులూ ఉన్నారు; యువకులూ ఉన్నారు. ఆబాలగోపాలమూ ఆమెతో సంభాషించటమే మహాద్భాగ్యంగాభావిస్తూఉన్నారు. గదాధరుడు ఆమెకోసం యిప్పటికీ ఎంతోడబ్బు వెచ్చిస్తున్నాడు. తండ్రి నెలకొల్పిన వేదపాఠశాలకు అనుబంధంగా సంస్కృతపాఠశాలా, సంగీత పాఠశాలకూడా నెలకొల్పాడతను. ఇందుకు కారణం బాలా త్రిపురసుందరిని చదువుల సరస్వతినిచెయ్యాలనే సంకల్పమే. అతని సంకల్పం చాలావరకు ఫలించింది కూడాను. సంస్కృత పాఠశాలలోని అధ్యాపకులలో ఒకరు ఆంధ్రంలోకూడా మంచి పాండిత్యం ఉన్నవారు. వారివద్ద ఆమె తెలుగు కావ్యాలుకూడా చదువుతున్నది అంతో యింతో కవిత్వం చెప్పడమున్నూ ప్రారంభించింది. చిత్రలేఖనం ఆమెకు తోబుట్టువులాగా ఉన్నది. అయితే ఇన్ని కూడా ఆమెకు హేమశిల్పితో ముచ్చట లిచ్చినంత ఉత్సాహాన్ని ఇవ్వడంలేదు. ఇదే గదాధరుడికి ఏమీ తోచనియ్యకుండా ఉన్నట్టున్నది. ఎందుకో అతనికంత అసహనం!

నాడు కార్తీక పౌర్ణమి. నవీనాదేవి గదాధరుడూ పగలంతా ఉపవసించి దేవాలయంలో స్వామికి అభిషేకం

20)

చేసికొని తీర్థప్రసాదాలు గ్రహించి దివాణానికి బయలు దేరారు. అంతలో హేమశిల్పి బాలా త్రిపురసుందరితో స్వామి దర్శనానికి వస్తూ వారికి ఎదురైనాడు. తండ్రీకూతు ళ్ళిద్దరూ ప్రభు దంపతులకు నమస్కరించారు. నమస్కారం స్వీకరిస్తూ నవీనాదేవి బాలా త్రిపురసుందరి నిలా పలక రించింది.

"నువ్వుగూడా ఉపవాసం ఉన్నావా బాలా?"

అంతలో హేమశిల్పి కలగజేసుకొని రాణి కిలావిన్న వించాడు.

"నేను ఎంత చెప్పినా వినకుండా ఉపవాసం ఉంది తల్లీ! రోజూ ముప్పూటలా అన్నం తినే వయస్సులో ఈ నిష్ఠలూ నియమాలూ ఎందుకో అడగండి!"

వెంటనే గదాధరు డిలా అందుకొన్నాడు.

"బాలా! మే మొకటి చెబుతాం వింటావా?"

"అదేంమాట మహారాజా! మీరు ఆజ్ఞాపించాలి"

'మహారాజా!' అని ఇతరులు తన్ను పిలవడం గదా ధరుడి కెంతయినా ప్రియం. కాని బాలా త్రిపురసుందరి అలా అనడం అతనికి ప్రియం కాలేదు.

"నువ్వు మమ్మల్ని అలా సంబోధించనక్కరలే దమ్మా! మనదంతా ఒకే కుటుంబం."

ఇలాఅని గదాధరుడు వాత్సల్యం ఉట్టిపడేట్టు చూచా డామెవైపు. కాని ఆమె వినయ మధురంగా మందస్మితం స్తూ అతని కిలా బదులు చెప్పింది.

"ప్రభువులు అన్నది అక్షరాలా యథార్థమే అయినా ప్రజలు తమ ధర్మాన్ని విస్మరించ కూడదు. మనుషు లందరూ పరమేశ్వరుడి సంతానమే. అయినా ఆ పరమేశ్వ రుణ్ని సందర్శించటానికి వెళ్ళినప్పుడు ఆలయంచుట్టూ ప్రద క్షిణం చెయ్యవలసిందే అంజలి బంధంతో దర్శనం చెయ్య వలసిందే ఆత్మ ప్రదక్షిణం చేసి సాష్టాంగ నమస్కారం చెయ్యవలసిందే. 'నువ్వు నాకు ఎందుకు నమస్కరించలేదు? ఎందుకు కొబ్బరికాయ కొట్టడం లేదు?' అని స్వామి ప్రశ్ని స్తున్నాడా? అవిధేయతకు శిక్షిస్తున్నాడా! ఏమీ లేదు. అయినా మనుషులింత వంగి వంగి నమస్కారం చెయ్యడం దేనికి? తమ జన్మం తరించటానికి కాదూ?"

ప్రభువుగారిక జవాబు చెప్పలేక పోయారు. వారు రాణీగారి సాయం అభిలషిస్తున్నట్టు కనిపించారు. అంతట నవీనాదేవి బాలా త్రిపురసుందరితో ఇలా అంది.

"నువ్వు చెప్పింది ఎంతైనా యుక్తి యుక్తంగా ఉందమ్మా! కాని పరమేశ్వరుడే ఎదట నిలిచి ఆజ్ఞాపిస్తే ఆజ్ఞ పాలించవద్దూ?"

బాలా త్రిపురసుందరి అందుకు సవినయంగా ఇలా బదులు పలికింది.

"పాలించ వలసిందే మహారాజ్ఞీ! కాని జన్మజన్మాంత రాలనుంచీ వస్తున్న వాసన ఒకటి అడ్డు తగులుతుంది. ఆ వాసన విముక్తి అంత సులభంగా జరిగే పనికాదని మీకూ తెలుసు. ఎన్నో వేల దివ్యవర్షాలు తపస్సు చేసిన మహర్షు

ల్నయినా వాసనలు వీడకుండా ఉంటాయట! మరి నావంటి అజ్ఞానురాలి కిలా విడిచి పోతాయివి?"

తన బాల అంత సముంజసంగా మాట్లాడినందుకు హేమశిల్పి నేత్రాలు సవదీప్తితో తళతళ లాడాయి. కాని ప్రభువుకు ఆ మాటలు ఎలా ధ్వనిస్తాయో అనే జంకు ఉదయించింది. అందువల్ల ఏదో మిషతో అక్కడినుంచి వెళ్ళి పోవడమే ఉత్తమ మనుకొన్నాడు. వెంటనే అతడు బాల నిలా మందలించాడు.

"అమ్మా! ప్రభువులు ఉపవసించి ఉన్నారు. నువ్విక్కడ అదీ యిదీ మాట్లాడుతూ ఉంటే ఎలాగు? నీ పాండిత్యం ప్రదర్శించటానికి ఏలినవారు రేవు సభ పెట్టిస్తారులే. అపరాధం మన్నించ వలసిందని వేడుకో."

బాల తండ్రి అభిప్రాయం గ్రహించిందో! తండ్రి మాట పాలించటమే ధర్మంగా భావించిందో! తామర మొగ్గలాంటి దోసిలి సంధించి గదాధరుడితో ఇలా అంది.

"మన్నించండి మహాప్రభూ! ఇటు మీకూ భోజన కాలం అతిక్రమించటానికి కారకురాల్నయాను - అటు మా నాన్నగారికీ అటువంటి కష్టమే కలిగించిన దాన్నయాను. బిడ్డ చేసిన తప్పు తల్లిదండ్రులు గాకపోతే మరెవరు మన్నిస్తారు?"

నవీనాదేవి యీ మాటలకు చాలా సంతోషించింది.

"నీతో ఎంతసేపు మాట్లాడినా మాట్లాడాలనే ఉంటుందమ్మా! రేపొకసారి రా! మీ నాన్న అన్నట్టు సభ కూడా ఏర్పాటు చేయిస్తాం."

అని క్రీగంట భర్తవైపు చూచింది రాణీ. చూపులతోనే ఆ తండ్రీ కూతుళ్ళకు సెలవిచ్చి రాణీని అనుసరించారు రాజావారు.

ఆ రాత్రి హేమశిల్పీ, బాలా త్రిపురసుందరీ చాలా సేపు ప్రభు దంపతులను గురించి ముచ్చటించుకొన్నారు.

"నాన్నా! రాణీగారు చాలా తెలివిగలవారు కాదూ?"

"ఔనమ్మా! వారి బుద్ధిబలం వల్లనే రాజావారు ఈ సంస్థానాన్ని ఏల గలుగుతున్నారు!"

"మరి అలాంటి రాణీగారు దొరక్కపోతే రాజాగారికి సంస్థానం నిలిచేది కాదుగా నాన్నా!"

"అదీ నిజమే నమ్మా! అయితే రాజాగారి పుణ్యం చాలా గొప్పది. దానివల్లనే ఇలాంటి రాణీగారు లభించారు వారికి"

"నువ్వేం తక్కువ పుణ్యాత్ముడివా నాన్నా! ఎరగని నేరం పైబడ్డందుకు పైసా తక్కువగాకుండా సొమ్ము సమకూర్చి, ఆ శైవ మఠానికి పంపాలని అంతా సమకూర్చావు. ఆ దుర్మార్గు డెవడో ఆ సొమ్ము అపహరించుకు పోయాడు. అసలు నువ్విలా ఒంటరిజీవితం ఎందుకు గడపవలసివచ్చింది? ఎంతటి పుణ్యులిలా ఉండగలరు?"

హేమశిల్పికి ఆ మాటలు సంతోష విచారాల్ని రెంటినీ కలిగించాయి. అతను బిడ్డ మూర్ధం ఆఘ్రాణిస్తూ ఇలా అన్నాడు.

"రాజావారి పుణ్యం నవీనాదేవి రూపాన ప్రత్యక్షమైతే నా పుణ్యం నీ రూపాన ప్రత్యక్షమైంది తల్లీ! నేను ఒంటరివాణ్ణెలా అవుతాను-నువ్వుండగా?"

బాల అతని ఒళ్లోకి ఒరిగి ఇలా అన్నది.

"నావల్ల నీకు అంతా కష్టమేగా నాన్నా! నన్నొక్క పని చెయ్యనియ్యవు. ఇంత పెద్ద వయస్సులో గూడా అన్ని పనులూ నువ్వే చేసుకొంటావు నీకింత శ్రమ కలిగించే దాన్ని నీ పుణ్యఫలాన్నెలా అవుతాను?"

"పిచ్చితల్లీ! నువ్వు నాకళ్ళయెదుట తిరుగుతుంటేనే చాలు. బ్రహ్మానందం కలుగుతుంది నాకు ఈ ఆనందం రాజావారి కేదీ?"

"నీదంతా పిచ్చిగానీ నే నేమౌతాను నాన్నా నీకు? దిక్కుమాలినదాన్ని గదా! జాలికొద్దీ పెంచుతున్నావు. ఏ ఋణం నేను ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోగలనా?"

"అలా అనకు తల్లీ! నువ్వు నా యింటికి వచ్చావు. అంధకార బంధురమైన నా జీవితంలో ఆనంద దీపం వెలిగించావు. నువ్వే అలా ప్రత్యక్షం కాకపోతే నిరంతర విషాదంతో నేను ఎప్పుడో ఘోరమరణం పొంది ఉండేవాణ్ని."

బాలా త్రిపురసుందరి యిందుకు రెండు చెవులూ మూసుకొని యిలా అన్నది.

"అబ్బో! అవేం మాటలు నాన్నా! నాగుండె పగిలిపోతున్నది. నువ్వు వెయ్యేళ్ళు జీవించవలసిన వాడివి."

హేమశిల్పి మందహాసం చేశాడు.

"నామీద నీకింత మమత దేనికమ్మా! ఆడపిల్లవు. ఇవ్వేళ కాకపోతే రేపైనా నిన్ను ఒక అయ్యచేతిలో పెట్టక తప్పదు నాకు. అప్పుడు నన్ను విడచి నువ్వు వెళ్ళవద్దూ?"

"పో నాన్నా! నిన్ను విడిచి నే నెక్కడికీ వెళ్ళను. ఏ అయ్యా కొయ్యా నా కక్కర్లేదు."

ఇలాఅని బాల అతన్ని గాఢంగా కౌగలించుకొన్నది. హేమశిల్పి హృదయంలో వాత్సల్యరసం కట్టలు తెంచుకొన్నది.

"అలాగే తల్లీ! నువ్వెక్కడికీ వెళ్ళవద్దు. ఆ కొయ్య యెవడో నువ్వున్న చోటికే వస్తాడు. ఇక నిద్రపో, రాత్రి చాలా గడచిపోయింది."

ఇలా అని అతను బిడ్డవెన్ను చేత్తో నిమురుతూ కూర్చున్నాడు. పది నిమిషాలు గడిచాయో, లేదో! బిడ్డ సుఖంగా నిద్రపోయింది దీపపు వెలుగున ఆ అమాయిక ముఖం సంతృప్తిగా చూచి అతనిలా అనుకొన్నాడు.

"అమ్మ నన్ను సంతోషపెట్టడాని కిలా చేస్తున్నది. ఈ సంతోషం యెల్లకాలం నిలుస్తుందా? అది యెలాసాధ్యం? ఈడువచ్చిన పిల్లకు వివాహం చెయ్యవద్దూ? చేసిన తర్వాత అత్తవారింటికి పంపవద్దూ? నే నేమంత ఐశ్వర్యవంతుణ్ణని అల్లుడు ఇల్లరికానికి అంగీకరిస్తాడు? అబ్బా! మమత యెన్నెన్ని రూపాల పరీక్షిస్తూ వుంటుంది!"

ఇలా భావిస్తూ అతను దేవీధ్యాన పరాయణుడైనాడు. తర్వాత 'రాను. రాను. మా నాన్నను విడిచిరాను. నిలువెత్తు ధనం పోసినా సరే! నాకు మా నాన్నే యెక్కువ.' అని

బాల కలవరించే వరకూ అతనికి బాహ్య లోకం స్ఫురణకు రాలేదు. అప్పుడే కూసింది తొలికూడి.

ఇక్కడ ఇలా వుండగా అక్కడ దివాణంలో రాజ దంపతులకూ నిద్రపట్టలే దారాత్రి.

"మనవంశం మనతోనే అంతరిస్తుందేమోనని మాకు చాలా చింత కలుగుతున్నది" అన్నాడు గదాధరుడు.

"మనం ఏదో మహాపాపం చేసివుంటాం కాబట్టే ఎంత మందికైనా ఇష్టార్థసిద్ధి కలిగించే కాశీనాథేశ్వరుడు మన ప్రార్థన ఎందుకు ఆలకించక పోవాలి?"

అన్నది నవీనాదేవి.

"కాని ఆపాపం మాదేగాని రాణీగారిది కాదు. మా మూలాన మీకున్నూ పరితాపం కలుగవలసి వచ్చింది."

"రాణీగారున్నూ ఇలాగే అనుకోవచ్చుగా! తెలి యని పూర్వజన్మకథనుగురించి ఎవరెలా అనుకొన్నా కాదన డానికి ఏ లేదీ?"

"తెలియనిదీ కాదు, పూర్వజన్మాదూ మహారాజ్ఞీ. ఆ పాపం మేము ఈ శరీరంతోనే ఆచరించాము. ప్రాయ శ్చిత్తంచేసుకొనే గుండెధైర్యంలేక యిలాపశ్చాత్తాపాగ్నిలో వేగి పోతున్నాము."

నవీనాదేవి విస్మయంతో భర్తముఖం తనవైపు తిప్పు కొని పరికించింది. అతని కన్నులు అశ్రుధారలు స్రవిస్తు న్నాయి. ఆమె హృదయం ద్రవించింది.

"ఏమిటది మహారాజా! మీలోనే మీరు ఎందుకు తపించాలి? మీ అర్ధాంగికి అందులో భాగం పంచిపెట్ట

రాదూ? దుఃఖం ఆత్మీయులతో కలిసి అనుభవిస్తే భారంగా తోచదని వినలేదూ?"

"విన్నాం దేవి! విన్నాం. కాని యిప్పుడింత సానుభూతిచూపే మీరే ఆ పాపంయొక్క స్వరూపంవిన్నతర్వాత మమ్మల్ని ఎంతమాత్రమూ క్షమించలేరు."

ఇలా అంటున్నప్పుడు గదాధరుడి గొంతు దుఃఖభారంతో పూడిపోయింది. నవీనాదేవి కారుణ్యం పెల్లుబికింది.

"సందేహించకండి ప్రభూ! భర్తకంటె భారతస్త్రీకి దైవంలేదు. ఆమె భర్త సుఖదుఃఖాలలో పాలుగొని తీరుతుంది. అలా చెయ్యగలిగినప్పుడే ఆమె యదార్థమైన ఆనందం అనుభవించగలుగుతుంది. మీ ధర్మపత్నిని ధర్మనిర్వహణానందంనుంచి వంచించకండి మహారాజా! అంతకన్న నిర్ఘృణత మరొకటి ఉండదు. అది యెలాంటి దారుణవిషయమైనా విని భరించగలదు మీ పాదదాసి. మీ అభీష్టానుసారం ప్రవర్తించగలదు ఇందుకు కాశీనాథేశ్వరుడే సాక్షి."

గదాధరుడప్పుడు లజ్జతో కంపించే స్వరంతో ఇలా చెప్పటం మొదలుపెట్టాడు.

"రాణిగారినే మేము వంచించాము అయితే ఆవంచించటం రాణిగారి శాశ్వతి సాహచర్యాన్ని కోరిమాత్రమే. నిజానికి మా వంచనవల్ల బాధపడ్డ వ్యక్తులు వేరేఉన్నారు. వారిలో ఒకరు బాలా త్రిపురసుందరి తల్లి. రెండవవ్యక్తి బాలా త్రిపురసుందరీ దేవే! ఇంకేంచెప్పాలి. బాలా త్రిపురసుందరి మా ప్రథమ ప్రణయఫలం. మన వంశాంకురం.

"యౌవనారంభదశలో మాకు దూరాలోచన లేక పోయింది. దిక్కూ మొక్కూ లేని ఒక కన్యను చేపట్టాం. రాజ్ఞీపీఠం మీద కూర్చోబెడతామని మాటయిచ్చాం. సంతానలాభం పొందాం.

"తర్వాత మీతో పరిచయం కలిగింది. ఆ యువతి మీద ఏవగింపు కలిగింది. ఆ రహస్యం బయట పడకుండా ఇంతకాలమూ ప్రయాసపడ్డాం. అదే యిప్పుడు మా హృదయాన్ని విధ్వంసం చేస్తున్నది.

"మహారాజ్ఞీ! మీరు నిర్బంధించటంవల్ల ఇది చెప్పక తప్పిందిగాదు. మీరు మాతో ఏకీభవించినట్లయితే బాలా త్రిపురసుందరిని మనవద్దకే తెచ్చుకోవచ్చును. బిడ్డను సంరక్షిస్తే జనని ఆత్మకు సంతృప్తి కలగవచ్చును. ఇక మీ అభిప్రాయం నిస్సంకోచంగా తెలిపితే భవిష్యత్తును గురించి ఒక నిర్ణయం చేసుకోగలుగుతాము."

నవీనాదేవి అతనిమాటలు పూర్తిఅయినా కాకముందే "ఆః" అంటూ చైతన్యం కోల్పోయింది. "వైద్యులు! వైద్యులు! ఆస్థాన వైద్యుల్ని అవశ్యం పిలుచుకొని రావాలి" అని గదాధరుడు కేకలువేస్తూ పరిచారకులకోసం పరుగులెత్తాడు.

## ౧౮

ఒకనాటిసాయంకాలం బాలాత్రిపురసుందరి క్రొత్తగా సృష్టించుకున్న పూలతోటలో తిరుగుతున్నది. హేమశిల్పి

ఒక శిలాఫలకంమీద కూర్చుని ఏయే అంట్లు ఎవరివద్దనుంచి తెచ్చింది, ఏజాతి ఎటువంటి దయిందీ ఉత్సాహంతో చెబుతున్నాడు.

హఠాత్తుగా తోటబయట జోడుగుర్రాల బగ్గీ ఆగింది. బాలా హేమశిల్పులు ఆ సవ్వడికి కుతూహలంతో అటువైపు చూచారు రాజదంపతులు ఎలాంటి గౌరవసత్కారాలూ అభిలషించకుండా సరాసరి లోపలికి వచ్చారు. హేమశిల్పి సంభ్రమంతో వారికి ఎదురువెళ్ళి అమితభక్తి గౌరవాలతో ఆహ్వానించి తోటలోకి తీసుకొని వచ్చాడు. ఒక సుదీర్ఘ శిలాఫలకం మీద కూర్చోవలసిందని అభ్యర్థించి పూలసజ్జలో నాలుగురకాల పువ్వులూ కోసి సజ్జ రాణియెదుట ఉంచాడు. బాలకూడా వినీతవృత్తితో వచ్చి హేమశిల్పి ప్రక్కనే నిలబడింది.

నవీనాదేవి ఆ బాలను చేరబిల్చి ఒళ్లో కూర్చుండ బెట్టుకొని ముంగురులు సవరిస్తున్నది. అంతలో గదాధరుడు హేమశిల్పితో ఇలా అన్నాడు.

"అయ్యా! భిక్షార్థులం. కాదనకుండా మా వాంఛితాన్ని ఈడేర్చాలి."

హేమశిల్పి తాను సృష్టించేశిల్పంమాదిరిగానే స్తంభించాడు. ప్రభుదంపతులు తనకోసం పనిగట్టుకొని రావడం-భిక్ష అర్థించడమూనా? తనవల్ల ఏదైనా అపచారం జరిగిందేమో! దానిని తనచేతనే ఒప్పించి శిక్ష విధించటానికే వారు వచ్చారేమో! కాని తన కేహాని జరిగినా అంతగా చింతించవలసిన పనిలేదు. బాలనుగూడా శిక్షిస్తారేమో!

ఒక్కొక్కప్పుడు ప్రభువులు ఎంతైనా కాఠిన్యం వహిస్తారు. మందహాసంతోనే చంద్రహాసం విసురుతారు.

అతను క్షణకాలం అలా స్తంభించినా ఇష్టదేవతాను గ్రహంవల్ల తమోవిముక్తుడై జరగవలసిందేదో జరిగేతీరుతుం దనీ దానికోసం చింతించటం అవివేకమనీ నిశ్చయం చేసుకొన్నాడు. ప్రభువుకు సవినయంగా ఇలా బదులు పలికాడు.

"ప్రభూ! తెలిసిగాని తెలియకగాని నేను ఏదైనా అపరాధం చేసినేమో! అందుకు నన్ను శిక్షించటం తప్పని సరి అయితే ఇంకేం మనవిచేసుకోగలను? కాని ఒక్కటి మాత్రం వరం కోరుకొంటున్నాను. నాబిడ్డ యీ బాల యే పాపమూ ఎఱుగనది. ఈమెనుమాత్రం కనికరించండి!"

తండ్రి అలా అనేసరికి బాలాత్రిపురసుందరికి మహా భయం కలిగింది. ఆమె నవీనాదేవి అడుగుల మీాద తల మోపి "తల్లీ! మహారాజ్ఞి, మానాన్నగారు చేసినతప్పే దయినా ఉంటే వారి బదులుగా నన్ను శిక్షించండి. వారిని క్షమించండి. వారైనా తెలిసి యేతప్పూ చెయ్యరు. వారిని క్షమిస్తామని అభయం ప్రసాదించండి దేవి, అభయం ప్రసాదించండి." అని దీనాతిదీనంగా విలపించసాగింది.

గధాధరుడు కర్తవ్యమూఢుడై నవీనాదేవి వైపు చూచాడు. ఆమె బాలత్రిపురసుందరిని లేవనెత్తి అక్కున చేర్చుకొని చెక్కిళ్ళు చుంబిస్తూ ఇలా అన్నది

"భయపడకు బాలా! మీానాన్న మంచితనం ఎరగని వాళ్ళు ఈ చుట్టునట్ల ఎవ్వరూ లేరు. ఆయనేమిటి – ఒకరికి ద్రోహం చెయ్యడమేమిటి? పైపెచ్చు మా వల్లనే ఆయనకూ

నీకు కూడా అపకారం జరిగింది. అయితే అది ఎలాంటి అపకారమో మీకు ఇంతవరకు తెలియదు. ప్రభువులు సెల విచ్చేది సాంతంగా విను. అప్పుడు నువ్వే మమ్మల్ని క్షమించ వలసి ఉంటుంది. క్షమిస్తానంటావో! క్షమించనంటావో!"

ఇలా అని రాణి భర్తవైపు ప్రోత్సాహకరమైన చూపు నిగిడించింది. వెంటనే శాంతిదుర్గేశ్వరుడు పేద విశ్వకర్మతో ఇలా సంభాషణ సాగించాడు.

"విశ్వకర్మగారూ! నిన్న మీరు తోటచుట్టూ కంచె వేయించాలంటే రాతిగోడే పెట్టిద్దాం అని మేమన్నాము గుర్తుందా?"

"ఔను ప్రభూ!"

"ఈ ప్రొద్దునే పునాదులు తీయటానికి మనుషులు వచ్చారుకూడా గదా?"

"చిత్తం మహారాజా! అప్పుడే ఏనాడో పోయిందను కొన్న నా బంగారంకూడా బయట పడింది. ఆ విషయం తమకు ఎలా విన్నవించాలో తెలియక..."

హేమశిల్పి యిలా తడబడుతుంటే ప్రభువు ఒక్క దీర్ఘనిశ్వాసం విడిచి యిలా అన్నారు.

"అయ్యో! అందుకు సిగ్గుపడవలసింది మేముగాని మీరా? మా తమ్ముయ్యగారు అంత నీచకార్యానికి ఒడి గట్టారంటే మాకు తలగొట్టినట్టుండడంలేదూ? అయితే

ఒకటి. పోయిన సొమ్ము మీకు దొరికింది. దొంగతనానికి పాల్పడ్డ వారిని పరమేశ్వరుడే శిక్షించాడు. పాపం ఎప్పుడో ఒకప్పుడు బయటపడుతుందంటూ రిలాంటి నిదర్శనాలనుబట్టే. ఆనాడు చాలామంది పాపం ఒక పరదేశినిఅనుమానించారు. అవునా?"

"కాని, నేనుమాత్రం అలాఅనుకోలేదుమహారాజా;"

"ఔను. అదీ మాకు గుర్తులోఉన్నది.ఆ నస్యపేటిక ఆ పరదేశి యెక్కడో పోగొట్టుకుని ఉంటాడు. వన దుర్గానికివెళుతూ వుండగా దొరికిందన్నారు మాతిమ్మయ్యగారు."

"అలాగండీ !"

"అలాగేఅన్నారు. మేమూ ఔనేమో అనుకొన్నాం. కొన్నాళ్ళు వారు దానిని వాడుతుండగా చూస్తూవచ్చాం. అందువల్లనే మీరు కోల్పోయిన సొమ్ము మేమే యిస్తామన్నాం కాని అప్పట్లో మీరు అందుకు అంగీకరించలేదు."

"నిజమే మహాప్రభూ !"

"ఈనాడు ఆగోతిలో రాళ్ళమధ్య ఇరుక్కొని వున్న తిమ్మయ్యగారి కళేబరమూ, బంగారుకొరడా ఇంతకాలం మేము దాచిపెట్టిన రహస్యాన్ని బట్టబయలు చేశాయి. ఏమైనా విశ్వకర్మగారూ, మీరీ దొంగతనం విషయం ఎవరి దగ్గరా ప్రస్తావనకు తేకుండావుండాలని మేమర్థిస్తున్నాము."

"ఎంతమాట, తమ దయవల్లగాదా నేను బ్రతుకుతున్నది. ఆ విషయం ఎవరివద్ద మాత్రం ఎలా ప్రస్తావిస్తాను?"

"అమ్మయ్య, ఇప్పటికి ఒకవరం యిచ్చారు. ఇక రెండవది అడుగుతాను."

"అలా అనకండి ప్రభూ, సెలవియ్యండి."

"హేమశిల్పిగారూ, మీరూ పెద్దలయినారు. మీ అమ్మాయికి వివాహోచిత వయస్సు సమీపించింది. కాబట్టి యిప్పటినుంచీ అమ్మాయి బరువు బాధ్యతలు మాకు విడిచి పెట్టి మీరు విశ్రాంతి తీసుకోండి."

"తీగెకు కాయ బరువా ప్రభూ!"

"కాని మాట సత్యమే అయినా అమ్మాయిని మేము చూచినట్లు మీరు చూడలేరుగదా, ఇక్కడున్నప్పటికంటె మా సంరక్షణలో సుఖంగావుండటానికి అవకాశాలున్నాయి గదా! మాపిల్ల అనేసరికి ఏజమీందారీసంబంధమో వస్తుంది గదా! ఆలోచించండి."

అంతలో బాలా త్రిపురసుందరి ప్రభువుతో ఇలా అన్నది.

"మహారాజా, నన్ను మా నాన్నగారి వద్దనుంచి విడదియ్యకండి. పేదయింట పుట్టాను, పేదయింట పెరిగాను. పేదబుద్ధులే తప్ప గొప్ప బుద్ధులు ఎరగను. మీరు నన్ను ఏ జమీందారు కుటుంబంలోనో పడవేసినా ఆ కుటుంబపు హోదాకు తగ్గట్టు నే నుండలేను. అప్పుడు మీకూ కష్టం తోచవచ్చును. అదిగాక అసలు విషయ మేమిటంటే నాకు వివాహం చేసుకోవాలనే కోరికలేదు. మా నాన్నగారిని

సేవిస్తూ బ్రహ్మచారిణిగానే ఉండటానికి నిశ్చయించుకొన్నా న్నేను."

ఇందుకు ప్రభుదంపతులతోబాటు హేమశిల్పి కూడా విస్మయం పొందాడు.

"అదేమిటమ్మా?"

ముగ్గురూ ఏక కంఠంతో అలా ప్రశ్నించగా బాలా త్రిపురసుందరి అలవోకగా నవ్వి యిలా అన్నది.

"ఇందులో అంతగా ఆశ్చర్యపడవలసిన పనియేము న్నది? వివాహం చేసుకొని నా తల్లి యేమాత్రం సుఖంగా బ్రతికిందో నేను చూడకపోయినా ఊహించుకో గలను. ఆవిడ అంత దుర్మరణం పొందడానికి వెనక ఎంత విషాదగాథ ఉందో! నా కన్నతండ్రి ఆమెను అంతదయగా చూచాడన్న మాట! ఆవిడ మట్టిలో కలిసిపోయినా ఆవిడమీద కనికరం చూపలేక పోయాడు. ఆవిడ సంతానాన్ని కాబట్టే నన్ను కూడా దిక్కుమాలిన దాన్నిగా విడిచిపెట్టాడు అప్పుడు ఈ నాన్నగారే చేరదియ్యకపోతే నేనూ జీవిత పరమార్థం తెలుసుకోకుండా దుర్మరణంపాలు అయేదాన్ని కదా!

"నాన్నగారి సంరక్షణలో, నాన్నగారి శిక్షణలో నేను ఇంతదాన్నయాను. వారి ముఖం చూచి మీవంటి పుణ్యా త్ములందరూ నా విజ్ఞానార్జనకు తోడ్పడ్డారు. మీ అందరి ఋణం తీర్చుకోవాలంటే తపస్సును మించిన సాధనం లేదు నాకు. అదీగాక నన్ను పెంచిన తండ్రికూమ గార్హస్థ్యం

అంటే ఏమిటో తెలియకుండానే ఉన్నారు. వారికి పనికి రానిది నాకు మాత్రం ఎలా పనికి వస్తుంది?

"అయ్యా! వివాహం జీవిత పరమార్థం కాదు. మానవులు సాధించవలసింది వేరే ఉన్నది. అది బ్రహ్మవిద్య. దానికి సహకరించని వాటిని వేటినైనా త్యజించ వలసిందే. కాబట్టి నన్ను నిర్బంధించకండి! నాకు రాజ్య భోగాలతో నిమిత్తం లేదు. సాంసారిక సౌఖ్యాలతో అంతకన్న అవసరం లేదు."

ఇలా ప్రజ్వలిత నేత్రాలతో ఆమె ఏదో దివ్యావేశం కలిగినట్లు మాట్లాడుతూ ఉంటే హేమశిల్పి ఆమెలో పరతత్వాన్ని దర్శిస్తున్నాడు. నళినాదేవి తనలో లోపించిన ఒక శక్తిని ఆమెయందు దర్శిస్తున్నది. గదాధర ప్రభువు తన దర్పాన్ని మరిచి ధారాపాతంగా అశ్రువులు వర్షిస్తున్నాడు. అవి హర్ష బాష్పాలో! దుఃఖబాష్పాలో!

బాల మాటలు విరమించగానే ఆ ప్రభువు శోకోద్వేగంతోనే యిలా ఘోషించాడు.

"అమ్మా! బాలా! ఆ రాక్షసుణ్ని నేనేనమ్మా! నీ తల్లికీ నీకూ తీరని ద్రోహం చేశాను. నా నడవడే నీకింత విరక్తి పుట్టించింది. నా పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోనియ్యి తల్లీ! ఎంత దుష్టుణ్నయినా నిన్ను కన్నతండ్రిని. పెంచినతండ్రి మీద ఉన్న ప్రేమలో సహస్రాంశమైనా కన్నతండ్రిమీద చూపించ వమ్మా! నా మాట కాదనకమ్మా!"

ఇలా అని ప్రభువు లేచి వెళ్ళి ఆమె రెండు చేతులూ పట్టుకొన్నాడు.

"ఇవి చేతులు గావు తల్లీ! కాళ్ళు అనుకో! పెద్ద వాణ్ణి కాబట్టి నీ పాదాలు నేను స్పృశిస్తే నీకు ఏమి కీడు కలుగుతుందో అని జంకుతున్నా నంతే. అమ్మా! నీ తల్లికి నేను చేసిన ద్రోహం వల్లనే ఈ వివాహానికి సంతానం లేకుండా పోయింది. అసలానాడు - అంటే నీ తల్లి యిక్కడ దుర్మరణంపొందుతున్ననాడే నా ద్వితీయ వివాహం రసహీన మౌతుందనే సూచన కనిపించింది. కాని దాన్ని నేను లెక్క చెయ్యలేదు. ఎంతో మధురంగా ఈ నవీనాదేవి వీణ వాయిస్తూ గానం ప్రారంభించిన తరుణంలోనే నీతల్లి మరణ వార్త తెలసింది. అప్పుడే యీ హేమశిల్పిగారి బుజంమీద ఉన్న నిన్ను గుర్తించాను నేను. కాని యీమెను వివాహం చేసుకోటానికి ఆటంకం కలుగుతుందనే భయంతో నిన్ను గానీ నీ తల్లిని గానీ ఎరగనట్టే నటించాను.

"తల్లీ! బాలా! త్రిపురసుందరీ! చేసిన తప్పు ఒప్పుకొంటు న్నాను. నన్ను క్షమించి నా యింటికి రావూ! రావూ?"

నవీనాదేవి భర్తయొక్క దీనావస్థ చూడలేకపోయింది. బాలా త్రిపురసుందరిని గాఢాలింగనం చేసుకొని "నాన్న గారిని కనికరించు బాలా, వారికి గాని, నాకుగాని నీకంటె ఆప్తు లెవరున్నారు? మా దుఃఖం ఎవరు తీరుస్తారు?" అని వేడుకొనటం మొదలు పెట్టింది.

హేమశిల్పికిన్నీ ప్రభుదంపతుల దుఃఖం కన్నీరు తెప్పించింది

"అమ్మా, నువ్వు దివాణంలో ఉంటే మాత్రమేం? రోజూ వచ్చి నిన్ను చూచిపోతూ ఉంటాను. తల్లి దండ్రుల మాట విను. నువ్వు ఇందుకు భిన్నంగా మాట్లాడితే నేను భరించలేను."

బాలా త్రిపురసుందరి యిందరి మాటలూ విని తల పంకించి యిలా అన్నది.

"నన్ను కొంచెం ఆలోచించుకో నివ్వండి. రేపు ఏ సంగతీ చెబుతాను"

గదాధర ప్రభువు ఈ మాటలతో కొంచెం తేరు కొన్నాడు.

"అలాగే నమ్మా, ఆలోచించే చెప్పు. నాతల్లి నన్ను తిరస్కరించదని నాకు తెలుసులే"

ఇలా అని నవీనా దేవితో కూడా దివాణానికి వెళ్ళి పోయాడు. హేమశిల్పి బాలతో తన కుటీరం ప్రవేశిం చాడు.

## ౧౯

"మనం ఇంకా ఎంతదూరం వెళ్ళాలి నాన్నా!"

ఎన్నడూ విశేషదూరం నడచి వెళ్ళడం అలవాటు లేని బాల ఆయాసపడుతూ అడిగింది హేమశిల్పిని. హేమ శిల్పికూడా వార్ధక్య కారణంగా నడవడానికి శ్రమపడుతూనే

ఉన్నాడు. అయితే ఏదో పట్టుదల అతనిచేత ముందంజ వేయిస్తున్నది. కాని బాల ఆయాసపడుతూ 'ఎంతదూరం వెళ్ళాలి' అని అడిగేసరికి అతని గుండె కరిగి పోయింది.

"చాలా దూరమే వెళ్ళాలమ్మా. నేను చెప్పినట్టు విని ఉంటే నువ్వు ఈ శ్రమ పడవలసిన అవసరమే ఉండేది కాదు." అన్నాడతను నిస్సహాయత సూచిస్తూ. కాని బాల ఉత్సాహాన్ని తెచ్చుకొంటూ ఇలా అన్నది

"నేను ఆ శాంతిదుర్గంలో – అందులోనూ ప్రభు భవనంలో ఉండవలసివస్తే ఇంతకంటె ఎక్కువ వ్యథే అనుభవించ వలసివచ్చేది. నాన్నా. ఒక మహా దుఃఖం అనుభవించడానికి బదులు స్వల్ప దుఃఖం అనుభవించి మిగతా జీవిత మంతా సుఖమయం చేసుకోవడం తెలివిగల పని కాదూ?"

"అక్కడ నువ్వు ఎలాంటివ్యథా పొందేపనే ఉండేది కాదు. అంతా నీ భ్రమ మాత్రమే నమ్మా. గదాధర ప్రభువు లిప్పుడు పూర్తిగా మారిపోయారు. వారి వల్ల మీ అమ్మకు ఒకప్పుడు జరిగిన అన్యాయాన్ని బట్టే నువ్వు వారిని అసహ్యించు కొంటున్నావుగాని వారిలో ఈనాడు కలిగిన మార్పు నువ్వు లెక్కకు తీసుకోవడంలేదు."

"కాదు నాన్నా! నేను ఆయన రక్తం పంచుకొని పుట్టినదాన్నే అయినా నాకు బుద్ధి తెలిసింద మొదలుకొని నిన్నే 'నాన్నా' అంటూ వచ్చాను. నిన్ను 'నాన్నా' అని పిలిచిన నోటితో మరొకర్ని అలా పిలవడం నాకు సాధ్యం కాదు. అంతేకాదు. 'బాల ఫలానా గదాధర ప్రభువు

కూతురు' అని యెవరైనా అంటే వినడం కూడా నాకు బాధాకరమే. నేను నీకూతురి ననే అనుకొంటున్నాను. 'హేమశిల్పిగారి కూతురు' అని మాత్రమే లోకం నన్ను పేర్కొనడం నాకు ప్రియంగా ఉంటుంది."

"పిచ్చితల్లీ! ఎందుకమ్మా ఈ వ్యర్థ జీవిమీద నీకింత మమత? గధాధర ప్రభువు ముందు ఈ హేమశిల్పి విలువ యేపాటిది?"

శాల యీ మాటలకు మందహాసం చేసింది.

"నాన్నా, ఆనాడు - అంటే, మా అమ్మ శాంతి దుర్గం పొలిమేరల్లో జీవితం చాలించిన నాడు నేను నీ యింటికే రాక, ఎటో పోయిఉంటే, ఏం జరిగేది? గదాధర ప్రభువుకూ నాకూ ఉండే రక్తసంబంధం ఎవరికైనా తెలుసేదేనా? అమ్మతో పాటు నేనుకూడా అప్పుడే ఏదో కారణాన మరణిస్తే ఏమయ్యేది? కృతఘ్నుడైన ఆ ప్రభువు మాకు పారలౌకిక క్రియలైనా చేయించేవాడేనా? ఇప్పుడైనా తనకు నవీనా దేవియందు సంతానం కలగలేదు కాబట్టి, ఆయన నన్ను తన బిడ్డనుగా చెప్పుకొంటున్నాడు గాని, ఆవిడకే బిడ్డలు పుడితే, నన్ను అభిమానించే వాడేనా? కావలసింది నిర్వ్యాజ ప్రేమ నాన్నా! దానికి భిన్నమైంది మనస్సు కెన్నటికీ శాంతిని కలిగించదు. ఔనా?"

హేమశిల్పి మఱి జవాబు చెప్పలేక పోయాడు ఏదో పూర్వానుభూతి స్ఫురణకు వచ్చి దీర్ఘంగా నిశ్వసించాడు.

"అమ్మా! నిర్వ్యాజప్రేమ అనేది ఒక్క భగవంతుడి వల్ల పొందదగిందేనమ్మా! లౌకిక మైనదంతా సవ్యాజమే.

ఇది నీకు ఎలా నచ్చజెప్పాలో నాకు తెలియడం లేదు. పాపం! గదాధర ప్రభువులు ఈ పాటికి మనయింటికి వచ్చి మన పలాయన వృత్తాంతం తెలుసుకొని ఉంటారు. మనలేఖ చదువుకొని ఎంత విషణ్ణులై పోతారో!" ఇలా అంటూ ఉండగానే హిమశిల్పి కళ్ళు చెమర్చాయి. కంఠం బొంగురు పోయింది. ముందుకు అడుగు వెయ్యలేక పోయాడు. బాల అతని పరిస్థితి గమనించి "కొంచెంసేపు ఇక్కడ విశ్రమిద్దాం నాన్నా! నువ్వుకూడా అలసి పోయావు. ఈ మామిడిచెట్టు నీడను కూర్చుంటే మార్గాయాసం కొంత ఉపశమిస్తుంది" అన్నది. హిమశిల్పి కాదనలేదు. ఇద్దఱూ చెట్టునీడను కూర్చున్నారు.

"ఇంతకూ మన గమ్యం ఏది నాన్నా?"

మౌనంగా కాలం గడపడం దుర్భరంగా తోచిన బాల యిలా ప్రశ్నించే సరికి హిమశిల్పి కొంచెంసేపు ఆలోచనా ధీనుడై నట్టుండి యిలా అన్నాడు.

"అమ్మా! ఇక్కడికి కింకా అఱవై మైళ్ళ దూరంలో ఉన్నది ఆ ఊరు. శాంతిదుర్గానికి రాకముందు అదే నా నివాసస్థలంగా ఉండేది. ఊళ్ళోవాళ్ళు అందఱూ నన్నెంతో అభిమానిస్తూ ఉండేవారు. ఆ అభిమానాన్నే నిలుపుకో గలి గితే నాకు శాంతిదుర్గానికి రావలసిన పనే ఉండేది కాదు."

ఇంత వఱకు చెప్పేసరికి అతని కళ్ళు చెమర్చాయి. గొంతులోనుంచి మాట పెల్లగిల రాలేదు. తర్వాత మనస్సు చిక్కబట్టుకొని ఒక్క నిట్టూర్పు విడిచి 'అదమ్మా! మనం వెళ్ళవలసిన చోటు' అని సంభాషణ ముగించటానికి ప్రయ

త్నించాడు. కాని బాల అతని ప్రయత్నాన్ని సాగనివ్వలేదు.

"అదంటే ఏది నాన్నా? ఆ ఊరు పేరేమిటో, ఇక్కడినుంచి ఏ దిక్కుగా వెళ్ళాలో చెప్పకపోతే నాకెలా తెలుస్తుంది? అక్కడ ఉన్న విశేషాలేమిటి? మనకు కాలక్షేపమెలా జరుగుతుంది? శాంతిదుర్గం మాదిరిగా ఉంటుందా ఆ ఊరు? కవులు గాని, పండితులు గాని ఉన్నారా అక్కడ?"

బాల కురిపించే ప్రశ్నల వర్షానికి జవాబు లియ్యక తప్పలేదు హేమశిల్పికి. అతను నెమ్మదిగా ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

"ఇక్కడినుంచి ఉత్తరదిక్కుగా ప్రయాణం చెయ్యాలమ్మా, ఆ గ్రామం చేరుకొనడానికి. అది శాంతి దుర్గమంత పెద్దది కాదుగాని కుగ్రామం మటుకు కాదు. అయితే నేను అక్కడినుంచి బయలుదేరిన నాటికి ప్రయాణ సౌకర్యాలు లేని ఊరది. చుట్టుపట్టు లన్నీ అరణ్యమయాలు. అయితేనేం! ప్రకృతి సౌందర్యమంతా అక్కడే మూర్తీభవించి ఉంటుంది. గ్రామస్థులు నీతిధర్మాలకు కట్టుపడ్డవాళ్ళు. ఏనాటిదో శైవమఠం ఒకటి అక్కడ ఉన్నది. మిగతా విద్వాంసులమాట యెలా ఉన్నా శైవమత సిద్ధాంతాలు కూలంకషంగా తెలిసిన పండితులు ఒకరో యిద్దరో ఆ మఠంలో తప్పకుండా ఉంటారు. ఒహో! ఏం గ్రామ మది! రెండో కైలాసమే అనుకో! అందుకేనేమో దానికి శివదుర్గమనే పేరు. గ్రామంలో చాలాభాగం శైవుల యిండ్లే. శైవులు కానివారు కొంత మంది ఉన్నా, వారికి శివభక్తి లోపంలేదు.

శివదుర్గానికి చేరువనే కొండవాగు ఒకటి ప్రవహిస్తూ ఉంటుంది. అయితే ఇతర కాలాలలో ఆ వాగు ఎండిపోయి నట్టు కనబడుతుంది గానీ ప్రతి శివరాత్రికీ నీరు పుష్కలంగా వస్తుం దెక్కడినుంచో. శివరాత్రినాడు అక్కడికి శ్రీశైలా నికి చేరినంతమంది యాత్రికులు చేరుతారు. నిజంగా ఆ రోజున కన్ను లున్నఫలం అబ్బుతుం దెవరికయినా. ఆరోజు ఆ వాగు ఒడ్డు ఒక మహాపట్టణంలాగా వెలిగిపోతుంది. ఎందఱు భక్తులు! ఎందఱు పండితులు! ఎంతమంది వర్తకులు! తెల్లవార్లూ శివ సంకీర్తన వినిపిస్తూనే ఉంటుంది. ఎంత పుణ్యక్షేత్ర మహాత్మ్యమది! అక్కడి శివలింగం శ్రీరామచంద్రుడే ప్రతిష్ఠించిం దని చెబుతారు. అభాగ్యుణ్ణయిన నాకు జీవితం అక్కడే గడిపేభాగ్యం లేకపోయింది."

హేమశిల్పి మళ్ళీ విషణ్ణుడయినాడు. అయినా బాల అతన్ని విషాదం భజిస్తూ కూర్చోనివ్వలేదు. హృదయంలోని దుఃఖ భారాన్ని ఇతరులకు వెళ్ళడించి వారి సానుభూతి పొందితే గుండె బరువు కొంత తగ్గుతుంది కదా! కాబట్టి అతనివల్ల ఆ వృత్తాంతం ఏమిటో విని అతన్ని అనునయించా లని ఆమె నిశ్చయించుకొన్నది.

"మళ్ళా ఆగావేం నాన్నా? అటువంటి పుణ్యక్షేత్రం విడిచి నువ్వు శాంతిదుర్గానికి రావలసిన కారణం ఏమిటి? గ్రామస్థులు నీమీద ఎంతో ఆదరాభిమానాలు చూపే వారని చెప్పావు గదా! నువ్వు ఒకరి సొమ్ము ఆశించేవాడివి కావుకదా! గంగి గోవువంటి నీమీద కక్ష గట్టిన దుర్మార్గ

లెవరు? అలాంటి వారెవరైనా ఉన్నా గ్రామస్థులకు నువ్వెలాంటివాడివో తెలియనా? తెలిసి యెలా సహించారు? చెప్పు నాన్నా! ఆప్తులతో పంచుకొంటే ఎంతదుఃఖమైనా తగ్గిపోతుందంటారు. నాకు నీ చరిత్ర వినిపించటానికి సందేహిస్తా వెందుకు? నేను నీకు పరాయి దాన్ననే అనుకొంటున్నావా? నువ్వలా అనుకోనేట్టయితే నాకింక దిక్కెవరున్నారు?»

పాపం! బాల మఱి మాట్లాడలేక పోయింది. దుఃఖావేశం ఆమెను వివశను చేసింది.

హేమశిల్పి బాల మాటలకు నీరై పోయాడు. «లేదు తల్లీ! లేదు. నువ్వు పరాయిదానివే అని నేననుకొన్నట్లయితే గదాధర ప్రభువుకు నిన్ను అప్పగించకుండా ఇలా ఎందుకు తీసుకువస్తాను! ఈ ముసలివాడికి తల్లి గానీ తోబుట్టువు గానీ కూతురుగానీ సమస్త బంధువులూ నువ్వేనమ్మా! నీ మనస్సుకు నేను నొప్పి కలిగించగలనా! విను మఱి నా పూర్వ వృత్తాంతం.

«అక్కడ వుండగా నాపేరు శైలేంద్రుడు. గురువుల దగ్గఱ శైవాగమాలన్నీ చదువుకొన్నాను, కుల వృత్తిలోనూ ప్రావీణ్యం సంపాదించాను. చిన్నతనంలోనే తల్లిదండ్రుల్ని కోల్పోయినా నోటి మంచితనం వల్ల గ్రామస్థులందఱికీ ప్రీతిపాత్రుణ్ణయాను. ఇన్నిటికంటెనూ ముఖ్యమయినది మఠాధిపతుల అనుగ్రహం నామీఁద ప్రసరించటం. వారు నన్ను కన్నబిడ్డ కన్న మిన్నగా చూచుకొనేవారు. నా కంటె

ముందుగా వారి శుశ్రూషచేసే భక్తు లెందఱో ఉండేవారు. అయినా వారు బాధ్యతగల యేపని అయినా నాకే ఒప్పగించేవారు. చివరకు వెండిబంగారాలు సంరక్షించే భారం కూడా నామీద మోపి నిశ్చింతులై ఉండేవారు.

"అమ్మా! తర్వాత జరిగిందే చెప్పడానికి సిగ్గుపడవలసి వస్తున్నది. ఇంత వఱకిది యెవరితోనూ చెప్పలేదు నేను. నన్నింతగా గుచ్చి గుచ్చి అడిగిన అప్తులున్నూ కనబడలేదు.

"ఆ శివపురంలో ఆశ అనే అనాథ బాలిక ఉండేది. ఆమెకూడా నా మాదిరిగానే బాల్యంలోనే దిక్కులేనిదై ఉండటంచేత నాకు ఆమెమీద ఒక విధమైన సానుభూతి ఉండేది. ఆమెకున్నూ నాపైన అటువంటి భావమే ఉండేది. అది సహజం కదా!

"ఆమె శైవమఠంలో పరిచారికగా పనిచేస్తూ ఉండేది. కావటానికి పరిచారికే అయినా ఒక మహారాజ్ఞికి ఉండదగిన ఉత్తమలక్షణా లుండేవామెలో. తన పనేమో తానేమో కాని యెవరితోనూ అనవసర ప్రసంగాలు చేసేది కాదు. అయితే ఆదరించి పలకరించే వారుంటే మనస్సిచ్చి మాట్లాడేది. మాటనేర్పు ఆమె సొమ్మే అనుకొనేవాణ్ణి నేను- ఎంత దిగుల్లో ఉన్నవాళ్ళనైనా తన మాటలతో ఇట్టే నవ్వించే శక్తి పరమేశ్వరు డామెకు ప్రసాదించాడు. ఇప్పుడు నీమాటలువింటూ ఉంటే ఆమె గుర్తుకు వస్తూఉంటుంది నాకు. మాటలే కాదమ్మా! ఆమెకూ నీకూ ఎన్నో విషయాలలో పోలికలున్నాయి. నా కదే ఆశ్చర్య మనిపిస్తూ ఉంటుంది. ఆశ

యెక్కడ! నువ్వెక్కడ! ఒక ఊరూ కాదు. చుట్టరికమూ కాదు. ఆమె పోలిక నీకు ఎలా వచ్చింది! అందుకేనేమో మనిషిని పోలిన మనుషులుంటా రంటారు.

"బాలా! అటువంటి ఆశ నాకు ఎంతో అప్పురాలుగా తోచింది. అవును. నన్ను చూచి జంకిపడ్డవాళ్ళు నాకు ఆప్తులు కాకపోవడం ఏమిటి? రోజురోజుకీ మా యిద్దటి మధ్యా స్నేహం వృద్ధి పొందసాగింది. చివరకు వివాహ బంధంతో మా స్నేహాన్ని శాశ్వతం చేసుకోవాలని నిశ్చయించుకొన్నాము. అలా నిశ్చయించుకొన్నది మొదలుకొని నేను ధన విషయంలో శ్రద్ధ వహించాను. అంతకుముందు నేను ఒంటరివాణ్ణి. ఎక్కడ ఉన్నా, ఏం తిన్నా ఎలాగో కాలక్షేపమై పోయేది. ఇంకొక వ్యక్తి పోషణబాధ్యత మీద బడ్డప్పుడు అలా జరగడానికి అవకాశ మేది? ఇది మాయిల్లూ వాకిలీ అనేవి యేర్పాటు కావాలిగా సంసారికి! మరొక మాట యేమిటంటే పువ్వులాంటి ఆశకు సకలభోగాలూ సమకూర్చాలనే ఆకాంక్ష నాలో బలీయమైంది. మంచి విలువైన బట్టలూ నగలూ ధరిస్తే, ఆశ మరెంత అందంగా కనిపిస్తుందో! ఆ సౌందర్యం యూపత్తూ కన్నులవిందుగా చూడాలనే తహతహ ప్రారంభమైంది. చివరకా ఉద్వేగమే నన్ను మూర్ఖుణ్ణి చేసి, దుఃఖావమానాలలో ముంచి, శివమార్గం నుంచి శాంతిమార్గానికి తటిమివేసింది."

ఇలా చెబుతూ హేమశిల్పి హఠాత్తుగా మాటలు చాలించాడు. అతని కళ్ళవెంట బాష్పాలు సంతత ధారగా జాలువార సాగాయి. పెదవు లదరడం మొదలుపెట్టాయి.

అతను కూర్చున్నవాడు కూర్చున్నట్టే క్రిందబడి గిలగిల తన్నుకో జొచ్చాడు. బాల అతని అవస్థ చూచి అదిరిపడింది. 'నాన్నా నాన్నా'అంటూ ఎలుగెత్తి పిలుస్తూ శోకించటం మొదలుపెట్టింది. అంతకంటె అతనికి ఎలా ఉపచారం చేసి స్వస్థత చేకూర్చాలో ఆమెకు తెలియలేదు. అసలది మూర్ఛ అనే రోగమనే ఆమెకు తోచలేదు. అంతవరకూ మూర్ఛా వశులైన వాళ్ళను ఆమె చూడనేలేదు పాపం!

## ౨౦

«ఆశా!»

"ఏం కావాలండీ?"

"కొంచెం సేపిలా కూర్చో!"

«దేనికి?»

"నీతో కొన్నిమాటలు చెప్పాలి."

"ఎక్కడి పని అక్కడే ఉంది. కబుర్లు వింటూ కూర్చోటానికి తీరిక యెక్కడిది?»

"పని యెప్పుడూ ఉన్నదేగా ఆశా! నా కడపటి మాట విని పోదూ?»

"ఛా! అవేం మాటలండీ!"

"అంతే. నాకు తెలుసు."

"ఏమిటి మీకు తెలిసింది? మీరు హడిలి పోవడం,

దగ్గరున్న వాళ్ళని హాడల గొట్టడం. ఈ రెండేగా మీకు తెలిసింది? కాస్త జ్వరం వస్తే అంత భయపడతారెందుకు?"

"నేను భయంతో అనడంలేదు ఆశా! నా శరీర పరిస్థితే అలాఉంది. ఏ క్షణాన ప్రాణం పోయినా పోవచ్చు. ప్రాణం విడిచేముందు చేసిన తప్పులు నీముందు ఒప్పుకొని మరీ జీవితం చాలించాలని ఉన్నది. ఈ ఒక్కకోరికా తీర్చవా ఆశా!'

విలాసు దీనతదీనంగా మాట్లాడుతుంటే ఆశ జాలితో కరిగిపోయింది. మెల్లగా వచ్చి అతని శయ్యప్రక్క నిలబడది. "చెప్పండి మరీ!" అన్నది అతని చెయ్యి తన చేతిలోకి తీసుకొంటూ.

విలాసుడు ఒక్కసారి కన్నెత్తి ఆమె ముఖంలోకి చూచి వెంటనే రెప్పలు వాల్చుకొని విషణ్ణ స్వరంతో ఇలా అన్నాడు.

"నేను నీకు చాలా ద్రోహం చేశాను ఆశా!"

ఆశ చిఱునవ్వుతో అతని ముఖం తేఱిపాఱజూచింది.

"కళ్ళు మూసుకొని మాట్లాడుతున్నారేం? నా ముఖం చూడడం మీకిష్టం లేదా?"

చప్పున విలాసుడు కళ్ళు తెఱిచాడు. అతని కనుకొనల నుంచి అశ్రువులు జాఱాయి.

"నీ ముఖం చూడలేక పోవడమా? నిత్యమూ ఈ సుందరవదనం చూడగలగాలనేకదా ఎంతటి పాపానికయినా ఒడిగట్టాను."

"అదేమిటండీ!"

"నీకు తెలియదా ఆశా!"

"బాగుంది. మీరేం చేశారో నాకెలా తెలుస్తుంది?"

"నీకు తెలుసు"

"నాకు తెలియదు."

"అబద్ధ మాడకు ఆశా! నీకు తెలుసు."

"అబద్ధమా! మీతోగాని, యితరులతోగాని నే నెప్పుడయినా అబద్ధ మాడానని మీరు ఋజువు చేయగలరా?"

"చెయ్యలేను కాని నిన్ను పెండ్లాడడం కోసమని నేను నిన్నూ మరొక వ్యక్తినీ మోసగించాను. అవునా?"

"ఏమో"

"అంటే సగం వరకు నామోసం నీకు తెలసినట్టే"

"అదెల్లాగు?"

"ఎప్పుడయితే 'ఏమో' అని అన్నావో అప్పుడే నా మీద నీకు కొంత అనుమాన మున్నట్లు స్పష్టపడుతోంది."

"ఒక్కమాట వినండి! అప్పు డడిగితే మీ కేమీ తెలియ దన్నారు. తెలియదంటే నిజంగా తెలియదేమో అనుకొన్నాను– దోషమంతా అతనిదే అనుకొన్నాను. పైగా అప్పటికి నేను మీ దాన్నైపోయాను. నాకు మీరే దైవం. దైవాన్ని శంకించవచ్చునా? కాబట్టి నేను మిమ్మల్ని శంకించగూడ దనుకొన్నాను. అంతటితో ఆ కథ మరచిపోవా లనుకొన్నాను. మరచిపోయాను కూడా. ఇప్పుడదంతా త్రవ్వటా లెందుకు?"

"ఈ పశ్చాత్తాపాగ్ని నుంచి శాంతి ఎలా పొందేది? అసలు శైలేంద్రుడే కనిపిస్తాడేమో! కనిపిస్తే..."

"ఆగారేం? కనిపిస్తే?"

"అతని రెండుకాళ్ళూ పట్టుకొని 'తప్పు చేశాను శైలేంద్రా! నీకు తీరని ద్రోహం చేశాను. మాయని మచ్చ కల్పించాను. నన్ను క్షమించు లేదా నీ కసి తీరేట్టు శిక్షించు కావాలంటే ఆశను చేపట్టు' అని అతనితో చెబుదామనుకొంటున్నాను."

"ఔను చెప్పవలసిందే."

ఆశ పెదవిపై చిఱునవ్వు మెఱిసింది.

విలాసుడు ఆ చిఱునవ్వు చూచి ఆశ్చర్యపడ్డాడు.

"నువ్వు మనఃస్ఫూర్తిగా అంటున్నావా ఆశా!"

ఆశ పకపకా నవ్వింది.

"నేనూ అదే ప్రశ్న మిమ్మల్ని అడగాలనుకొంటున్నానండీ!" అన్నది.

విలాసుడు అవమానితుడైనట్టు భావించాడు.

"నేను చిత్తశుద్ధిగానే చెబుతున్నాను ఆశా! అతడు నిన్ను స్వీకరించి నా అపరాధాన్ని క్షమించటానికి అంగీకరించేట్టయితే నేను ఎంతో సంతోషిస్తాను."

"అవును. ఈమధ్య నవలల్లో నాటకాల్లో కథల్లో ఇల్లాంటివే ఉంటున్నాయి."

"అంత పరిహాసంగా మాట్లాడుతావేం ఆశా! చేసిన పాపం ఒప్పుకొని అందుకు ప్రాయశ్చిత్తం చేసుకోవడం మంచిపని కాదూ?"

"కాదని యెవరన్నారు?"

"మఱి అలా మాట్లాడడ మెందుకు? నవలల్లో నాట

కాల్లో కథల్లో ఇల్లాంటివే వుంటున్నాయంటే నిత్యజీవితంలో అల్లాంటి వాటికి తావు లేదనేగా?"

"కాకపోతే ఏమిటండీ! తనతో కాపరం చేస్తున్న స్త్రీని ఏ పురుషుడైనా మఱొకడికెలా అప్పగిస్తాడు! అప్పగించినా అది యెలా ఊరుకుంటుంది! అది ఊరుకున్నా అవతలివాడు దాన్నెలా అంగీకరిస్తాడు! హృదయమనేది వున్న వాళ్లెవళ్లూ ఇల్లాంటి వాటి నంగీకరించరు."

"ఎందువల్లనో!"

"ఎంగిలికూటి కాశపడే వాళ్ళుగూడా మనుషులేనా? వాళ్ళు కేవలం జంతువులే. మానవతి అయిన స్త్రీ ఒక రోజైనా సరే ఒక క్షణమైనా సరే ఒక పురుషుడి కౌగిలిలో చిక్కి తర్వాత వేఱొకడితో సుఖపడ గోరుతుందా?"

"విషయం వచ్చింది కాబట్టి అడుగుతున్నాను ఆశా! మన వివాహానికి పూర్వం నువ్వు శైలేంద్రుణ్ణి ప్రేమించ లేదా? అతనితో—"

ఆశ వెంటనే రెండుచెవులూ మూసుకొన్నది.

"శివ శివా! ఈ రోజిలా మాట్లాడుతున్నా రేమండీ? మీకు మతి చలించలేదు గదా!"

"అంత బాధ పడతావెందు కాశా! నేనదొక తప్పుగా భావించటం లేదుగా! పైగా ఈ రోజున అయినా అతను వచ్చినట్లయితే నిన్ను అప్పగించటానికి సిద్ధంగానే వున్నానుగా!"

పకాలున నవ్వింది ఆశ.

"అతను ఈ రోజున వస్తాడు! నన్ను స్వీకరిస్తాడు!

ఎముకల గూడుగా, తోలుబొమ్మగా మిగిలిన నాకు ఈఆనందం కావలసిందే మఱి! దేనికండీ యీ పిచ్చిమాటలు!"

"అయితే వయస్సు మీ-అని పక్షంలో అంగీకరించే దానివే నన్నమాట"

"మీరు 'ఈరోజున అతను వస్తే—' అని చెప్పిన దాని కిజవాబు. మానవతి తత్త్వం ఎలా ఉంటుందో ఇది వఱకే చెప్పాను. అది మీరు వినిపించుకోలేదో, వినికూడా మళ్ళీ అడుగుతున్నారో నాకు తెలియకుండా ఉన్నది."

"మఱి ఆ రోజుల్లో అతనితో నువ్వు ఏకాంత సంభాషణలు జరపలేదూ? అలా మాట్లాడుకొనే టప్పుడు మీ మాటలు పరస్పర సౌందర్యాన్ని గుఱించి నడవలేదూ? అటువంటి మాటలు నడిచేటప్పుడు మీ మనస్సుల్ని మీరు నిగ్రహించుకో గలగారా? మానవమాత్రులకు అది సాధ్యమని నే ననుకోను"

"మేము ఏకాంత సంభాషణలు జరిపినా అవి మీ రూహించినంత దూరందాకా పోలేదు. వివాహ మైతేచేసుకోవా లనుకొన్నాం. అది యెందుకంటే ఒకరికొకరు తోడుగా ఉండేందుకు. నాకు మగదిక్కు లేదు. మగదిక్కే యేమిటి? ఏ దిక్కూ లేదు. అతనూ అటువంటివాడే. ఉపులకోసం ముఖం వాచిపోయిన వాళ్ళం. ఒక పవిత్ర స్నేహాన్నే మేము కాంక్షించాం."

"మఱి వివాహం జరిగినా కూడా శరీర సంబంధం లేకుండా ఉండా లనుకొన్నారా?"

"అల్లాగేమీ అనుకోలేదు. వివాహమైతేగాని ఆ ఆలోచనలు మనస్సులోకి రానీయగూడదనుకొన్నాన్నేను. ఆ అభిప్రాయాన్ని అతనికి స్పష్టంగా తెలిపాను. దాని కతను అంగీకరించాడు. మీకు తెలియదూ! అతను స్త్రీలకెంత దూరంగా ఉండేవాడో!"

"ఆహా! ఈ ఏభై ఏళ్ళ వయస్సులోనే నువ్వింత నోరూరిస్తున్నావే! తొలిజవ్వనంలో ఉన్న నిన్ను ఒంటరిగా కలుసుకొన్నప్పుడు అతను ఎలా నిగ్రహాన్ని పాటించగలిగేవాడా అనేది నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది."

"ఒక్క మీకే కాదండీ! చాలామందికిది విచిత్రంగానే కనిపిస్తుంది. లోకంలో ఎక్కువమంది క్షణికోద్రేకానికి వశపడి పోతారు. మిగిలిన కొద్దిమంది వివేకానికే అగ్రపీఠం ఇస్తారు. శైలేంద్రుడు ఆ కొద్దిమందిలో వాడు."

"నీకు నిజంగా శైలేంద్రుడి పవిత్రత మీద అంత విశ్వాసమే ఉంటే అతను మఠ ద్రవ్యం అపహరించాడని యెలా నమ్మగలిగావు?"

"మీరు ఒక విషయంలోనుంచి మరొక విషయంలోకి వస్తున్నారు. స్త్రీ వ్యామోహం లేనివాడు దొంగ కాడని చెప్పగలమా! దొంగ అయినవాడు స్త్రీ వ్యామోహానికి కూడా లొంగిపోతాడనగలమా! కొందరిలో రెండు దుర్గుణాలూ ఉంటాయి, కొందరిలో ఒకటే ఉంటుంది–కొంతమందిలో ఏ దుర్గుణమూ ఉండదు. లోకంలో కొన్ని పుల్లటి వస్తువులున్నాయి. కొన్ని పులుపూ చేదూ కలిసినవి ఉన్నాయి. కొన్ని కేవలం తియ్యటివి; మరికొన్ని తీపి

పులుపూ కలిసినవి. రకరకాలయిన యీ రుచుల మాదిరిగానే మానవుల గుణాలు కూడా అనేక విధాలు."

"నువ్వు యేది మాట్లాడినా ఇంత విమర్శచేసి యెలా మాట్లాడ గలుగుతా వాళా! పెద్ద చదువు లేవి చదువుకో లేదు గదా!"

"పెద్దల మాటలు వినడం కంటె చదువులేం కావాలి చెప్పండి-వివేకమే కావాలంటే? శైవమఠంలో పురాణాలు వినేటప్పుడు మొద్దులాగా కూర్చున్నా ననుకొన్నారా?"

"మళ్లీ ఒక సందేహం."

"అసలే ఒంట్లో బాగా లేదంటున్నారు. ఇంతసేపు దేనికి మాట్లాడుతున్నారు? దేహం ఉన్నంతవఱకు సందేహం ఉండేదే. కొంతసేపు మాట్లాడకుండా ఉండండి. అలసట తగ్గుతుంది."

"మనస్సులో ఆరాటం ఉన్నప్పుడు అలసట యెలా తగ్గుతుంది ఆశా! నా సందేహం తీర్చు. శైలేంద్రుడు దొంగే అని నువ్వెలా నమ్మగలిగావు? అప్పుడీ వివేకమంతా ఏమై పోయింది?"

"గ్రామస్థు లందఱూ ఎలా నమ్మగలిగారు? అందఱూ అవివేకులేనా? ఆ పరిస్థితులలా కలిసివచ్చాయి. దొంగనగలు అతని దగ్గఱ కన్పించాయి. వాటిని తనకు అమ్మిన వ్యక్తి పేరు అతను చెప్పలేదు. అందఱూ అనుమానించినట్టే నేనూ అతన్ని అనుమానించాను. పైగా అప్పటికి నా వయస్సెంత చెప్పండి!"

"పది హేనో పదహారో అనుకొంటాను."

"అవును గదా! ఆ వయస్సులో నాకు పెద్దవాళ్ళు చెప్పేవి నమ్మడమే తెలుస్తుంది గానీ విమర్శించి సత్యాసత్యాలు నిర్ణయించడం ఎలా తెలుస్తుంది? మీరు చెప్పారు; నేను నమ్మాను. అంతలో శైలేంద్రుడు పెద్ద లేఖ ఒకటి వ్రాసి పంపాడు. అదిచదువుకోనే సరికి నేను సంకటావస్థలో పడ్డాను నిజంగా అతను దొంగ కాదేమో అనీ అనుకొన్నాను. ఎవరో దొంగతనం చేసి అది అతనిమీదకు తోసివేశారని కూడా నమ్మాను అయితే అతను ఆ దొంగపేరు తనకు తెలుసు ననికూడా ఎందుకు బయట పెట్టడంలేదు? తన బతుకు బజారు పాలుచేసిన వ్యక్తికి చేసిన వాగ్దానాన్ని నిలుపుకొంటా నంటాడేమిటి? అదే నాకు అతని తత్త్వం గ్రహించటానికి ఒక ఆటంక మయింది"

"ఆ దొంగను నేనే అంటే నమ్ముతావా ఆశా!"

"మీరు మనః స్ఫూర్తిగానే చెప్పితే నేను నమ్మక యేం చేస్తాను?"

"నమ్మి నట్టయితే నన్ను అసహ్యించుకోవూ?"

"ఆ దశ దాటిపోయింది దండీ!"

"ఎప్పటితో?"

ఆశ మెడలోని మాంగల్యం అతనికి చూపి కళ్ళకద్దుకొంటూ ఇలా అన్నది.

"ఇది నా మెడలోకి వచ్చినప్పటితో."

"రేపు శైలేంద్రుడు వచ్చి 'విలాసుడే మఠ ద్రవ్యం అపహరించి ఆ నేరం నామీదకు తోసివేశాడు.' అని పదిమందిలోనూ అన్నట్టయితే నువ్వేం చేస్తావు?"

"ఎప్పుడో ఇక్కడినుంచి వెళ్ళిపోయిన శైలేంద్రుడు, ఇక్కడ తనది అనేది ఏమీలేని శైలేంద్రుడు, వృద్ధుడై కాలు కదిలించలేని స్థితిలో ఉండవలసిన శైలేంద్రుడు రేపు ఇక్కడికి వస్తాడా? వచ్చి పంచాయితీ జరిపిస్తాడా! జరిపించి మీదొ గతానాన్ని సాక్ష్యబలంతో నిరూపణ చేయిస్తాడా! ఏమిటండీ మీ మాటలు?"

"ఏమో ఆశా! రాత్రి నాకు ఆవిధంగా కలవచ్చింది. ఒక్క యీరాత్రే కాదు. ఈమధ్య చాలా రోజులనుంచీ అటువంటి కల వస్తోంది. నిష్కారణంగా ఇటువంటి దెందుకు తటస్థిస్తుంది?"

"మీ భయమే అందుకు కారణమై ఉంటుంది."

"భయానికి కారణం?"

"కొంతమంది భయానికి కారణం ఏమీ ఉండదు. అది వాళ్ళ మనో దౌర్బల్యమే.

"అలాగెందు కనుకోవాలి? మనకు తెలిసినంత వఱకు శైలేంద్రుడు చాలా పట్టుదల మనిషి. ఏదోఒక రోజున తన నిర్దోషిత్వం నిరూపించుకొనడానికి అతను ప్రత్యక్షం కావచ్చును."

"శైలేంద్రుడు పట్టుదల గల మనిషే, కాదనను. కాని అతను ఇక్కడనుంచి వాలాశుడై వెళ్ళాడు. వెళ్ళికూడా ముప్పై సంవత్సరాలై ఏళ్లు గడచిపోయాయి. అతనిని ఈ ఊరే మఱచిపోయింది. అతని తరం వాళ్ళందఱూ దాటిపోయారు. మిగిలింది మన మిద్దఱం. మిమ్మల్ని బట్టి నేనూ అతనికి శత్రు వర్గం లోనిదాన్నే. అయినా మనం ఇంకా జీవించి ఉన్నా

మనీ, ఈ ఊళ్ళోనే ఉంటున్నామనీ అతని కెలా తెలుసు? ఎప్పటి సంగతు లప్పుడు తెలుసుకొంటూనే ఉన్నాడంటారా! అలా తెలుసుకొంటూనే ఉంటే తన తరం వాళ్ళందఱూ దాటిపోయిన పిదప ఎవరిముందు ఈ అపకీర్తి మాపుకొందామని వస్తాడు?"

ఆశ మాట లింకా ముగియలేదు. 'అమ్మా! అమ్మా!' అని యెవరో తలుపు తట్టడం వినిపించింది. "వచ్చా! వచ్చా!" అని తొందరగా వెళ్ళి తలుపు తీసింది ఆశ.

పరిసరాలకు వన్నె కల్పించే జవ్వని ఒకతె ఎదురుగా నిలబడి ఉన్నది. ఆశను చూడగానే నమస్కరించి ఆమె యిలా అన్నది.

"మా నాన్నకు చాలా దాహంగా ఉందమ్మా! కాసిని మంచినీ ళ్ళిస్తారా?"

ఆశ ఆ జవ్వనికి అనతి దూరంలో కూర్చుండి ఉన్న వృద్ధుణ్ణి చూచింది. పిపాస దుర్భరంగా ఉండడం చేతనేమో అతను వసారా గుంజకు చేరగిలబడి కళ్ళు మూసుకొని ఉన్నాడు. ఆశ అతనిని చూచి జాలిపడి తొందరగా ఇంట్లోకి వెళ్ళి మజ్జిగలో కొంత నిమ్మరసం పిండి ఉప్పువేసి తెచ్చి "బాబూ! ఇదిగో! తాగండి!" అని గ్లాసు అతని చేతికి అందించింది. అతను కళ్ళు తెఱచి గ్లాసు అందుకొని మజ్జిగ త్రాగి కొంత తేఱుకొన్నాడు. కృతజ్ఞతా పూర్వకంగా ఆమెపైపు చూపులు సారిస్తూ "చల్లని తల్లివమ్మా! పోయే ప్రాణం నిలబెట్టావు. నీ పేరేమిటి తల్లీ!" అన్నాడు.

"ఆశ."

'ఆశ' అన్న పేరు వినగానే ఆ జవ్వని ఉలిక్కిపడింది. వృద్ధుడు చకితుడయాడు.

"ఆశ! ఆశ!" అంటూ అతను పరీక్షగా ఆమె ముఖం లోకి చూచాడు. ఆశ కూడా విస్మయంతో అతన్ని పరికిం చింది. అతను శైలేంద్రుడు!

## ౨౧

ఆశను గుర్తించిన శైలేంద్రుడు క్షణకాలం కూడా అక్కడ కూర్చోలేకపోయాడు. "బాలా! వెడదాం రా తల్లీ!" అని ఆమె రాకకోసం ఆగకుండానే గబగబా లేచి వీధివైపు నడవసాగాడు. బాల మాత్రం వెంటనే అతనితో కదలలేక పోయింది.

"మన్నించుకోవాలి ఏమీ అనుకోబోకండమ్మా! పెద్దతనం వల్ల మా నాన్న మతి స్థిమితత లేక ఉన్నట్లుండి హఠాత్తుగా ఎటో వెళ్ళిపోతూ ఉంటాడు. అంతేకాని చేసిన మేలు మఱచి పోయేవాడు కాదు. కీడు చేసిన వారికయినా అప కారం తలపెట్టే వాడుకాడు. పెద్దవాడి మీద కోపగించు కోకండి తల్లీ! మీ మేలు మఱచిపోలేం. మా నాన్న ప్రాణం నిలిపిన పుణ్యం మీది."

ఇలా అని ఆశకు నమస్కరించి అవనత వదనంతో

శైలేంద్రుణ్ణి అనుసరించబోయింది. కాని ఆశ ఆమెను చెయ్యి పట్టుకొని యిలా అడిగింది.

"మీ దే ఊరమ్మా! ఇక్కడికి ఏం పని మీద వచ్చారు?"

"మాది శాంతిదుర్గం అని ఇక్కడికి ఎంతో దూర గ్రామం. ఈ శివదుర్గం పుణ్యక్షేత్ర మని విని చూచిపోదామని వచ్చాం తల్లీ!" అని ఆశకు బదులు చెపుతూ శైలేంద్రుడి వైపే చూస్తున్నది శాల. అతను వంచిన తల యెత్తకుండా పోతున్నాడు. ఆశ కూడా శైలేంద్రుణ్ణి గమనిస్తూ శాలను తిరిగి యిలా ప్రశ్నించింది.

"మీ అమ్మగా రెక్కడ? వారిని కూడా తీసుకు రాలేదా?"

"మా అమ్మగారు నా చిన్నతనంలోనే గతించారమ్మా!"

"అలాగా తల్లీ! తల్లిలేని బిడ్డను పెంచటం ఎంత కష్టం! మీ నాన్నగారు నిన్ను పెంచడానికి చాలా కష్టపడి వుంటారు."

"అదంతా నాకేం తెలుస్తుందమ్మా! నన్ను ఒక రాజకుమారిని పెంచినట్టే పెంచారాయన."

"మీ తల్లిగారి పుట్టిల్లు? ఆమెవైపు చుట్టాలెవరూ మిమ్మల్ని చూడలేక పోయారా, మీ నాన్నగారి మీదనే వదిలి పెట్టకపోతే?"

"అమ్మగారి పుట్టిల్లూ నాకు తెలియదు. ఆమెవైపు బంధువుల్నీ ఇంతవరకు చూడలేదు నేను. తల్లి అయినా

తండ్రి అయినా చుట్టపక్కాలయినా నాన్నగారే నాకు."

"అయ్యో పాపం. మీ అమ్మగారు పోతే, మీ నాన్నగారు మళ్ళీ పెళ్ళి చేసుకోలేదా నీసంరక్షణార్థమైనా? లేకపోతే మీ నాన్నగారివైపు చుట్టాలైనా నీమీద జాలి చూపకపోయారా!"

"అసలు నా తల్లి యెవరో యెవరికీ తెలియదమ్మా! శాంతిదుర్గపు గొలిమేరల్లో మరణించిన తల్లివద్ద ఏడుస్తుంటే నన్నుచూచి జాలిపడి తెచ్చి పెంచారీ నాన్నగారు. మా అమ్మ యే జాతికి చెందిందో కూడా యెవరికీ తెలియదు. ఆమె మెడలో లింగకాయ ఉండట వల్ల శైవమతస్థురాలని మాత్రం తెలిసిందట! దిక్కులేని ఆ శవానికి ఈ నాన్నగారే అంత్యక్రియలు చేశారు. ఈయన ఆజన్మ బ్రహ్మచారి. మరింకా నన్నెవరు ఆదరిస్తారు చెప్పండి! ఈ మా నాన్నగారున్నూ యెక్కడినుంచోవచ్చి ఒంటరిగా ఆ శాంతిదుర్గంలో నివసిస్తున్నారు. వీరి బంధువులెవరో, వీరి పూర్వనివాసస్థల మేదో ఆ వూళ్లో ఎవరికీ తెలియదు."

ఈ సంభాషణలో ఇద్దరున్నూ శైలేంద్రుని పోక మరచినట్లున్నారు. అంతవరకూ ఇంట్లో పడుండి వీరి సంభాషణ ఆలకిస్తున్న విలాసుడు తొందరగా లేచి బయటికివచ్చి 'అత నింకెవ్వరో కాదు ఆశా! మన శైలేంద్రుడే అయి ఉంటాడు. ఇంకా జాగు దేనికి? త్వరగా వెళ్ళి అతని పాదాలమీద పడదాం పద! నేను చేసిన మహాపాపంనుంచి నాకు విముక్తి

ప్రసాదించడానికి పరమేశ్వరుడే శైలేంద్రుణ్ణి ఇక్కడికి తీసుకొనివచ్చాడు. రా ఆశా! ఆలస్యమయితే అత నింకెక్కడికైనా పారిపోతాడేమో!' అంటూ ఆయాసంలోనే శయిలేంద్రుణ్ణి కలుసుకొనడానికి బయలుదేరాడు. ఆశ మందహాసం చేస్తూ 'ఒంట్లో ఏమీ ఖులాసాగాలేని మీరు రావడమెందుకండీ! అమ్మాయి నిక్కడ విడిచిపెట్టి ఆయన వెళ్ళలేదు ఎక్కడో ఒకచోట కూతురికోసం కనిపెట్టుకొని ఉంటారు. నేను వెళ్ళి వెతికి పిలుచుకొని వస్తానుగదా! మీరు ఇంట్లో వుండండి!' అని అతనిని వారించింది కాని అతను తన అనారోగ్యాన్ని కానీ ఆమె మాటల్నికానీ లక్ష్యం చెయ్యలేదు. తన చేతికర్రతో ముందుకు నడుస్తూ ఇలా అన్నాడు.

"మనిషికి బాగుపడే అవకాశాలు పదేపదేరావు ఆశా! వచ్చినవాటిని సద్వినియోగం చేసుకోవడంలోనే ప్రకాశిస్తుంది వివేకం. ఇన్నాళ్ళనుంచీ నాకు ఒకే విధమయిన కల వస్తున్నదంటే ఎందుకనుకొన్నావు? ఇదిగో! ఇలా జరగబోతున్నది. ఇప్పుడయినా వివేకం కలిగి, పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకొని, ఉత్తమగతిపొందే యోగ్యతసంపాదించుకోవలసిందని యీశ్వరుడు నన్ను హెచ్చరించదలచుకొన్నాడు. ఆ హెచ్చరిక నేను పాటించి తీరాలి."

ఆశ అతనిని నివారించటం అసాధ్యం అని తెలుసుకొని, బాలను 'రా తల్లీ! మీ నాన్నగా రెక్కడున్నా వెతికి తీసుకొనివద్దాం. మేము యెవరమో అని నువ్వు ఆలోచించవలసినపనిలేదు. మీ నాన్నగారు ఈ ఊరువిడిచి శాంతి

దుర్గానికి రావడానికి మేమే కారణం. మావల్ల ఆయనకు ఎంతైనా ద్రోహంజరిగింది. నిజానికి మాపాపం ఎంతమాత్రం క్షమార్హం కాదు. నువ్వు నన్నుల్ని కనికరించి మా అపరాధాన్ని మన్నించేట్లు నాన్నగారికి నచ్చజెప్పాలి' అని పరితప్త హృదయంతో మరేమీ మాట్లాడలేక కన్నీళ్ళతోనే వేడుకొన్నది. బాలకూడా విషయం కొంతవరకు తెలసినట్టున్నా, పూర్తిగా ఊహించలేకపోయింది. ఏవి యేమైనా తండ్రిదగ్గఱకు వెళ్ళడం తనకూ సమ్మతమే కాబట్టి అశతో కలిసి విలాసుడి వెనక నడవసాగింది.

## ౨౨

"ఈ ఊళ్ళో ఒకప్పుడు శైలేంద్రుడనే శైవబ్రహ్మచారి ఉండేవాడు. మీరు అతన్ని ఎరుగున్నారా?"

ఒక పెంకుటింటి అరుగుమీద కూర్చున్న ఒక వృద్ధ బ్రాహ్మణుణ్ణి చూచి పై విధంగా శైలేంద్రుడు ప్రశ్నించాడు. ఆ బ్రాహ్మణుడు శైలేంద్రుణ్ణి ఆపాదమస్తకం పరికించి తల అడ్డంగా త్రిప్పి యిలా అన్నాడు.

"నేను ఈ ఊరికివచ్చి యిరవై సంవత్సరాలయింది. ఈ యిరవై సంవత్సరాలలోనూ శైలేంద్రుడనే పేరు నేనే నాడూ వినలేదు బాబూ! అతను మీకుబంధువా? మిత్రుడా? పాపం! మీరు అతనికోసం వచ్చారేమిటి? అతను లేకపోతే

మాత్రం మీకీ ఊళ్ళో ఆతిథ్యానికి కొరత ఉంటుందా? ఈ పూట మా యింట్లో భోజనంచేసి తీరికగా అతనినిగూర్చి తెలుసుకోవచ్చు: లోపలికి దయచేయండి "

శైలేంద్రుడా గృహస్థు సౌజన్యానికి ముగ్ధుడైనాడు. కాని, అతని లక్ష్యం వేరుగా ఉన్నది. అతను ఆ గృహ యజమానికి మనసారా వందనంచేసి "అయ్యా! నేను ఒకానొక పనిమీద ఇక్కడకు వచ్చాను. భోజనానికి అప్పుడే తొందర లేదు. నేను ఈ రోజు ఇక్కడే గడపవలసివస్తే తప్పక మీ యింట్లోనే భోజనం చేస్తాను. ఇక్కడ వెనక ఒక పూరిల్లు ఉండేది. అది మీరు కొని పెంకుటిల్లుగా మార్చి కట్టారు కాబోలును. అదేమిటో ఊరు యావత్తూ యిల్లాగే ఉన్నది. వెనకటి యిళ్ళుగానీ మనుష్యులుగానీ కనబడటంలేదు" అనుకొంటూ ముందుకు సాగిపోయాడు వృద్ధ బ్రాహ్మణుడు సందుమలుపు తిరిగేవరకూ శైలేంద్రుణ్ణే పరికిస్తూ 'ఎవరబ్బా అతను! నేను ఈ గ్రామానికి రాకపూర్వం ఇంకొకసారి యిక్కడికివచ్చి వెళ్ళాడన్నమాట. అప్పటికీ ఇప్పటికీ ఊరు చాలా మారిపోయిందనుకొంటున్నాడు. మారదు మరి! శరీరమే రోజురోజుకీ మారిపోతుండె. పరబ్రహ్మం ఒక్కటితప్ప మారిపోని వస్తువేది?' అనుకొంటూ ఇంట్లోకి వెళ్ళాడు.

అది రచ్చచావడి. చాలామంది పెద్ద లక్కడ కూర్చుండి ఏవేవో ముచ్చటలు చెప్పుకొంటున్నారు. నెమ్మదిగా శైలేంద్రు డక్కడికి చేరుకొన్నాడు. చేతికర్రమీద ముంజెయ్యి బలంగా మోపి కూడా నిటారుగా నిలవలేక కొంచెం వంగి వినయపూర్వకంగా వారి నిలా అడిగాడు.

"అయ్యా! ఈ గ్రామంలో ఒకప్పుడు శైలేంద్రుడనే శైవుడు వుండేవాడు. మీలో ఎవరైనా అతనిని ఎరుగు న్నారా!"

పెద్దలు విస్మయంతో ఒకరిముఖం ఒకరు చూచు కొన్నారు. 'శైలేంద్రుడా!' అని అందరూ కొంతసేపు ఆలో చనా ధీనులయినారు. చివరకు అందరూ చప్పరింపుతో తమ అనభిజ్ఞతను ప్రకటించారు. అక్కడ ఉన్నవారిలో వయోధికుడయిన రామచంద్రరావుగారు శైలేంద్రుడితో ఇలా అన్నారు.

"అయ్యా! తరతరాలనుంచీ మాది యీ వూరే. పైగా ఈ ఊరి కరణీకం మాది. నా కిప్పుడు అరవయ్యోపడి పైబడింది. ఇంతవరకు శైలేంద్రు డనే పేరు నే నెన్నడూ వినలేదు. అయితే నా చిన్నతనంలో కొంతకాలం మేన మామల యింట్లో పొరుగూళ్లో గడచింది. ఆ రోజుల్లో శైలేం ద్రుడనే వ్యక్తి యెవరైనా ఈ గ్రామంలో ఉండేవాడేమో! నేను ముప్పది యేళ్ళనుంచీ ఈ ఊళ్ళోనే ఉంటున్నాను. ఇక్కడ నాకు తెలియని మనుష్యులెవ్వరూ లేరు. మీకు కావలసిన శైలేంద్రుడు ఇక్కడ ఎంతకాలం కిందట ఉండే వాడు?"

శైలేంద్రుడు డీ మాటలు విని దీర్ఘంగా నిట్టూర్చాడు.

మీరు కరణంగారి కుమారులా బాబూ! ఇంకా వారినీ వీరినీ అడగటం దేనికి? నలభైఅయిదు సంవత్సరాల క్రిందట ఇక్కడ శైవమఠం ఒకటి ఉండేది. అది యేమైందో

ఏమో! ఈ ప్రాంతంలోనే వుండాలి. పెద్ద రాతిగోడలతో కట్టిన భవంతి అది. మీరు దాన్ని చూచి ఉంటారనుకొంటాను. అదేమైపోయింది! కట్టడంతో బాటు మఠ యజమానులూ, భక్తులూ కూడా అదృశ్యులైనట్టున్నారు!"

"శైవమఠమా!"

పెద్దలందరూ ఏకగ్రీవంగా అన్నారీ మాట. 'అవును. ఒకప్పు డిక్కడ శైవమఠం ఒకటి ఉండేది. అయితే ఎందువల్లనో కాని మాకు లోకజ్ఞానం కలిగేసరికి దాని కాపేరు మాత్రమే ఉండేది. మఠంలో ఎవ్వరూ ఉండేవారు కారు. పర దేశస్థులైనరైనా వస్తే అందులో బస చేసేవారు. చివరకు మిషనరీవారు వచ్చి దానిని పాఠశాలగామార్చారు. అదిగో! ఆ పాఠశాలే ఒకప్పటి శైవమఠం"

ఎప్పటి విషయాలనో స్మృతికి తెచ్చుకొంటూ అత్యుత్సాహంగా చెప్పుకుపోసాగారు రామచంద్రరావుగారు.

"ఆఁ! అతను ఇప్పటికీ ఉన్నాడు. శైవమఠం వ్యవహారాలు అతనే చూచేవా డప్పుడు. మఠానికేమీ ఆదాయం లేదనీ సొంతసొమ్మే ఖర్చుపెట్టవలసి వస్తోందనీ చెప్పేవాడు మా నాయనగారితో. చివరకు మఠం తన్ను ముంచివేసిందనీ, ఆ కట్టడమైనా అమ్మే ఏర్పాటు చేసిపెట్టినట్లయితే తన్ను రక్షించినట్టవుతుందనీ మొరపెట్టేవాడు. అప్పుడే వచ్చారు మిషనరీ లీగ్రామానికి. మా నాయనగారిని పాఠశాల పెట్టడానికి తగిన స్థలం ఏదయినా ఇప్పించ వలసిందని అడిగా రాదొరలు. అప్పుడు నాయనగారే ఆ శైవమఠం

యజమానిని పిలిపించి మాట్లాడించారు. అతనే ఆ కట్టడాన్ని మిషనరీవారికి విక్రయించి సొమ్ము పుచ్చుకున్నాడు. అబ్బో! అది ఏనాటి సంగతి! కనీసం నలభై ఏళ్ళయినా జరిగి ఉంటుంది."

శైలేంద్రుడిక అక్కడ నిలబడలేక పోయాడు. కాని సమాచారం వీలయినంత బాగా తెలుసుకోవాలనే కుతూహలం అతనిని అవతలికి పోనివ్వలేదు. అతను మెల్లగా నిలుచున్న చోటనే చదికిలబడి రామచంద్రరావుగారి నిలా ప్రశ్నించాడు.

"ఆ శైవమఠం యజమాని యిప్పటికీ ఉన్నాడంటున్నారుగదా బాబూ! అతని పేరేమిటి? వెనకటిరోజుల్లో శైవ మఠానికి ఆదాయం బాగానే ఉండేదే! అదంతా ఎలా కట్టుపడి పోయిందో! పైగా చరాస్తి కావలసినంత ఉండేది. అప్పుడు గ్రామస్థుల్లో ఎక్కువమంది శైవులు. మిగతా వారైనా శివభక్తి శూన్యులుకారు. డబ్బులూ పళ్ళూ మొదలైనవి యెన్నో స్వాములకు సమర్పించేవారు. ఆ భక్తి అంతా యేమై పోయిందో?"

"అది యెప్పటిమాటో గదండీ! తర్వాత దేశం మారింది! మొదట్లో బ్రహ్మసమాజం, తర్వాత క్రైస్తవ మతం హిందూమతం మీద దాడి చెయ్యలేదూ! విగ్రహారాధన గానీ, వర్ణభేదాలు గానీ అజ్ఞానులకే గాని జ్ఞానులకు కాదని బ్రహ్మసమాజం ప్రచారం చెయ్యలేదండీ! వర్ణాంతర వివాహాలనూ, విధవా వివాహాలనూ ఎంతమందివిద్యాధికులు

ప్రోత్సహించలేదు! దానితో పూర్వపు సాంఘిక నియమాలు చెదిరి పోలేదూ! మరి క్రైస్తవ మత ప్రచారకులు ఉచిత విద్య పొందవచ్చు ననీ, విద్యావంతులే కాదు, విద్యా విహీను లయినా క్రైస్తవులయితే చాలు-ఏదో ఒక ఉద్యోగం సంపాదించుకోగలరనీ ప్రచారం చెయ్యడంతో పేదలూ, విద్యా విహీనులూ అయినవారు చాలామంది క్రైస్తవులుగా మారిపోయారు. క్రైస్తవ మతం స్వీకరించక పోయినా క్రైస్తవులతో స్నేహం పెంచుకొంటూ హిందూ మతా చారాన్ని తృణీకరిస్తూ వచ్చారు కొందరు. అసలు మాకు మతమూ లేదు, కులమూ లేదు, దేవుడూ లేడంటూ మరొక అడుగు ముందుకు వెళ్ళారు కొంతమంది. ఇటువంటి పరిస్థితిలో శైవ మతానికి ఆదాయం క్షీణించిందంటే క్షీణించదా! అదిగో! అటు చూడండి! ఆ వచ్చే వృద్ధుడే ఆనాటి శైవమతాధిపతి. రా రా విలాసబాబూ! ఈయన యెవరో శైవమతం వివరాలు తెలుసుకోగోరుతున్నారు సమయానికి వచ్చావు. ఒంట్లో బాగా కులాసాగా వుంటోందా! ఈమధ్య కనిపించటమే లేదు" అంటూ రామచంద్రరావుగారు ఆశ ఆలంబనంతో మెల్లగా వస్తున్న విలాసుణ్ణి ఆహ్వానించారు.

'విలాసబాబు' అనే సంబోధన వినిపించేసరికి శైలేంద్రుడు తృళ్ళిపడ్డాడు. వెనకకు తిరిగి ఆశ చేయూతలతో వస్తున్న విలాసుణ్ణీ, వారి వెనకనే నలుదిక్కులూ పరికిస్తూ వస్తున్న బాలనూ చూచాడు. అతని శరీరం తీవ్రాగ్ని జ్వాలల మధ్య మాడిపోతున్నట్టనిపించింది. ఇటుకు కంతలో చిక్కిన గోవు లాగా తల్లడిల్లిపోయాడు పాపం! అంతమంది

పెద్దమనుష్యుల ముందు విలాసుడిపై ద్వేషం గానీ నిరాదర భావం గానీ ప్రకటించటానికి సాహసించ లేకపోయాడు. అతనితో మాట్లాడనూ లేకపోయాడు. ఏమాట చెప్పి విలాసుడికి ఆశకూ దూరంగా పోవాలో ఊహించుకో లేకపోయాడు తాను శైవమత వృత్తాంతం తెలుసుకో గోరినట్టు అందరిముందు మాట్లాడి, ఆ వృత్తాంతం వినిపించగలవ్యక్తి వచ్చేసరికి తనకేం పట్టనట్లు వ్యవహరించడం ఎవరిలో ఎటువంటి అభిప్రాయాన్ని కలిగిస్తుందో అని మధనపడ్డాడు. ఇంతలో విలాసుడు అతనిని సమీపించి పాదాలపై వ్రాలి యిలా విలపించాడు.

"శైలేంద్ర! ని జీవితం నాశనం చేసిన దుర్మార్గుణ్ణి నేను అని యిందరిముందూ అంగీకరిస్తున్నాను. నువ్వు క్షమ తప్ప ద్వేషం తెలియని మహానుభావుడివి. నా అపరారాధాన్ని మన్నించి యింటికి రా. నా జీవిత శేషం నీకు సపర్యచెయ్యడంలో గడిపి నేనూ ఆశా కూడా కొంతైనా పాపపరిహారం చేసుకొంటాం. నా ప్రార్థన అంగీకరించు శైలేంద్ర! ఈ పశ్చాత్తాపాగ్ని నన్ను నిలువునా దహించి వేస్తున్నది. నువ్వు క్షమించానంటేగాని నీ పాదాలు విడవను."

అక్కడి పెద్దమనుష్యులందరూ ఈ విచిత్ర సన్నివేశం చూచి ఆశ్చర్యంతో స్తంభించారు.

"ఇతనేనా శైలేంద్రుడనే వ్యక్తి! ఒకప్పుడు ఇతను కూడా ఈ గ్రామంలో ఉండేవాడా. విలాసబాబు పరమ

భక్తుడని ప్రసిద్ధిగదా! అటువంటివాడు ఈ శైలేంద్రుడికి ద్రోహం చేశాడా! అందువల్లనే యీ శయిలేంద్రుడు స్వగ్రామము విడిచిపెట్టి ఎక్కడికో వెళ్ళాడా! వెళ్ళినవాడు ఈనాడు తిరిగి ఎందుకు వచ్చాడో? విలాసబాబుమీద పగ తీర్చుకోవాలనా!"

ఇలా ఎన్నో ఆలోచలలు అక్కడివారి హృదయాలలో మొలకలెత్తాయి. అన్నిటినీ మించిన కుతూహలం మరొకటి! 'ఈ నవయౌవనవతి యెవరు? శైలేంద్రుడికీ ఈమెకూ ఉన్న బాంధవ్యం ఎలాంటిది! అబ్బా! ఈమె ఏ రాజపుత్రికగానో కనిపిస్తున్నదే! ఈమె వృత్తాంతం తెలుసుకొంటే బాగుండును' అనే ఆ కుతూహలం.

అంతలో శయిలేంద్రుడు మనస్సును అదుపులోకి తెచ్చుకొని తన చేతిసంచిలోనుంచి సువర్ణాలను విలాసుడి ముందు క్రుమ్మరిస్తూ ఇలా అన్నాడు.

"విలాసబాబూ! ఇదంతా విధివిలాసమే కాని మన ప్రయత్నాల ఫలితం కాదు. జరిగిందేదో జరిగింది. దాన్ని గురించి విచారించకు. ఇదిగో! నా ఆధిపత్యంలో ఉండగా దొంగలెత్తుకొని పోయారన్న ధనం నామీదపడ్డ అపవాదం తొలగించుకొనడానికే ఇన్నాళ్ళూ అన్యస్థలంలో శ్రమించి యీ ధనం సమకూర్చాను అయితే నా ఓర్పు పరీక్షించటానికేమో అన్నట్లు ఇటీధనం ఒకసారి నేలపాలైపోయింది. లేకపోతే పదహారేళ్ళ క్రిందటే ఈ ధనంతో నే నిక్కడికి తిరిగివచ్చేవాణ్ణి. కాని భగవతి బాల నాకీ అమృతమూర్తిని ప్రసాదించదలచి నన్నక్కడే నిలిపివేసింది. ఈ బాలికను

చూచుకునే నేను తోడి మానవుల్ని ప్రేమించటం నేర్చు కొన్నాను. లేకపోతే నేను దొంగననే అపవాదం మాపు కొనే తృప్తిపడేవాణ్ణికాని, నీవంటివాళ్ళమీద ద్వేషాన్ని చంపుకోగలిగేవాణ్ణి కాదు.

"ఇక నా తుది మాటలు విను. ఎన్నో ఉత్తమాశయాలతో నిర్మితమైన శైవమతం నామరూపాలు రెండూ లేనిదై పోయిందని తెలుసుకొన్నాను. ఈధనంతో మతాన్ని పునరుద్ధరించు! ఆ స్త్రీత్వాన్ని ప్రచారం చెయ్యి. హిందూమత పావిత్ర్యాన్ని లోకానికి చాటించు. సర్వ మత సామరస్యమే హిందూధర్మమనీ, అదే శైవమత పరమార్థమనీ ప్రజలకు తెలిసేట్టు ప్రబోధం చెయ్యి. ఆ స్త్రీకత నశించిందా ప్రజలు అధోగతి పాలైనా రన్నమాటే. భద్రం విలాస బాబూ! ఈ బాల నీకు ఈ కార్యక్రమంలో అండదండలుగా నిలుస్తుంది. ఆశా! ఈమె నా కూతురని విన్నావు గదా! జాగ్రత్త! ఈమె రక్షణాభారం నీకు ఒప్పగిస్తున్నాను-అమ్మా! బాలా! ఇటు రా తల్లీ!"

బాల గబగబా శైలేంద్రుడి దగ్గరకు వచ్చింది. శైలేంద్రుడామెను చేరదీసికొని "అమ్మా! నాకు పిలుపు వచ్చింది. రాగ ద్వేషాలకు తావులేని పరమ పదానికి చేరుకొంటున్నాను. నువ్వు ఆశనూ విలాసబాబునూ తల్లిదండ్రుల్లాగా చూచుకొంటూ వారు చెప్పినట్టు నడుచుకో తల్లీ!-హా! జగజ్జననీ!-శాంభవీ!" అంటూనే నేలకు ఒరిగిపోయాడు. 'అయ్యో!' అన్న ఆర్తనాదం శత కంఠాల నుండి ఒక్కసారి వెలువడింది. అది యింకా సద్దుమణగలేదు. జనసమూ

హాన్ని ఒత్తిగించుకొంటూ ఇద్దఱు అపరిచిత వ్యక్తులు శైలేంద్రుడి వద్దకు వచ్చారు. వారు అతన్ని చూచి పిలువునా నీరయినారు. ఇద్దఱి గుండెలనూ చీల్చుకొంటూ 'హేమశిల్పి బాబూ!' అన్న పిలుపు కరుణాతి కరుణంగా వినిపించింది. ఇంకెక్కడి హేమశిల్పి! అత నెప్పుడో ఎవరి పిలుపూ అందని చోటికి పయనించాడు.

ఆ యిద్దఱు వ్యక్తులూ ఎవరో కారు, నవినాదేవి - గదాధరులే !

— సమాప్తం —



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B148 |
| పుస్తకం పేరు | హేమశిల్పి |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 205 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Afsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | praveenuh H |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |